అపరాధ పరిశోధన అనుబంధం—65

# మూడు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ఎవరకు దక్కిందేమిటి

రచన: 'సికిందర్'

## కుక్క-గాడిద

రచన: వసుంధర

35

## ఐదో హత్య?

రచన: అజీజ్

**అడుగు ముందుకు వేస్తే చస్తావ్!**

ఐదవ భాగము—రచన: వసుంధర

అపరాధ పరిశోధన సప్లిమెంట్—65
మే, 1979
వెల : రు. 3-50
ఏడాది చందా 45 రూపాయలు
జీవితచందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

Ranga Rao

# చివరకు దక్కిందేమిటి?

'సికిందర్'

ఈ కథ నాకు ఆత్మారాం చెప్పాడు.

ఆత్మారాం వయసు 50, ఎత్తు అయిదడుగులు, బరువు 220 పౌనులు. ఎప్పుడూ నవ్వుతూ కులాసాగా, సరదాగా కనిపిస్తాడు.

వెడల్పాటి, తెల్లటి అతని ముఖాన్ని చూస్తే ఎవరైనా మర్యాద చెయ్యక తప్పదు. మొదటి చూపులోనే అతని మీద ఎవరికయినా గౌరవభావం తప్పక ఏర్పడుతుంది.

ఆత్మారాంకి తెలియని విషయంలేదు. అతని వృత్తి ఏమిటో నాకు చెప్పలేదు కానీ, సిటీలో జరిగే వివిధ సంఘటనలను గురించి వివరాలు సేకరించడం తన హాబీ అని చెప్పాడు.

ఆ సంఘటన ఏదయినా కావచ్చు—దోపిడీ, మానభంగం, హత్య......ఆక్సిడెంట్, కిడ్నాప్, బ్లాక్ మెయిల్...

ఒక సంఘటన అతని చెవిలో పడిందంటే, దాని వివ

రాలన్నీ సేకరించేవరకూ నిద్రపోడు. అతని విషయ సేకరణ యిలా వుంటుంది:—

ముందు ప్రజలు ఏమనుకుంటున్నారో వింటాడు. అవసర మనుకుంటే ప్రశ్నిస్తాడు. ఆ తర్వాత పోలీసుల అభిప్రాయాలేమిటో, పత్రికలు ఏం రాస్తున్నాయో గమనిస్తాడు...ఇలా సేకరించిన వివరాలన్నీ ఒకచోట చేర్చి ఆలోచిస్తాడు. ఆ వివరాలకి అక్కడక్కడ తనూహించింది కల్పిస్తాడు. అందమయిన కథలా తయారుచేస్తాడు. ఆ విధంగా పోలీసులకి తెలియని విషయాలెన్నో అతనికి తెలుసు—కానీ, వాళ్ళదగ్గర నోరువిప్పడు.

అలా తయారుచేసిన కథల్ని కాలక్షేపం కోరేవారికి విన్పిస్తాడు_అదే అతని హాబీ. ఈ కబుర్లు చెప్పడానికి ఆత్మారాంకి కావలసిందల్లా డజనుకప్పుల టీ, యాభయి రూపాయల నోటు!

మావూళ్ళో యెండలు భరించలేక, వారంరోజులు విశ్రాంతిగా గడుపుదామని ఒకానొక ఆదివారం ఉదయాన హైదరాబాదుకి చేరాను. నేను బసచేసిన ఇరోస్ హోటలు రిసెప్షనిస్టుతో నాకు పరిచయం వుంది.

అతను నన్ను ఆరోజు సాయంత్రం ఆరుగంటలకి హోటల్ ముందువున్న విశాలమైన గార్డెన్‌లో ఆత్మారాంకి పరిచయం చేశాడు.

ఆత్మారాం చిరునవ్వు విసిరి చెయ్యిముందుకు చాచాడు. నేను షేకాండిచ్చి పరిచయం చేసుకున్నాను.

"అయితే మిస్టర్ మోహన్, నువ్వు రచయితవన్నమాట. నీ ముఖంచూస్తే రచయితలాలేవు!" అన్నాడతను నవ్వుతూ.

రచయితలో చూడవల్సింది ముఖంకాదనీ, అతని

మేధస్సును ప్రస్ఫుటంచేసే ఆలోచనా ధోరణి అనీ అతనికి చెప్పాను.

"వెరీవెల్! నువ్వెలాంటి రచనలు చేస్తావు?"

"క్రయిం."

అతను మళ్ళీనవ్వి సిగరెట్ ఆఫర్ చేశాడు. నేను తాగనన్నాను.

అతను పెద్దగానవ్వి, "విస్కీకూడా తాగుతావనుకున్నాను!" అన్నాడు.

నేనుండేది పల్లెటూళ్ళో కాబట్టి పాలు మాత్రం తాగుతానని చెప్పాను.

"వెరీగుడ్! నువ్వు క్రయిం రచనలు చెయ్యడం మంచిదే. ఆ సాహిత్యానికి పాత్రపోషణ అవసరంలేదు. ఇక పాత్రల మనస్తత్వాల్ని విశ్లేషించే అవసరం అసలే లేదు. ఇంకా జీవితాన్ని లోతుగా చూడని నీలాటి ముఖాలకి క్రయిం సాహిత్యం ఉత్తమం."

అతని అభిప్రాయాలతో నేను ఏకీభవించి వచ్చిన పని యేమిటో విన్నవించుకున్నాను.

ఆత్మారాం సిగరెట్ వెల్గించి నాకేసి సూటిగాచూసి అన్నాడు:

"చెప్పు, ఏ కథ చెప్పాలి?"

"నీకు నచ్చింది చెప్పు" అన్నాను.

"దాన్ని నువ్వు కథగా వ్రాసుకోగలవా?"

"సందేహంలేదు. నీకే అంకితమిస్తాను."

"థాంక్యూ. మూవీస్టార్ జయదేవ్ గురించి చెప్పనా!"

"ఏమిటతని గురించి?"

"కిడ్నాప్, బ్లాక్ మెయిల్, మర్డర్" అన్నాడతను.

అలాటి ఇతివృత్తాలమీద కథలు చాలా సాధారణమైపోయాయని చెప్పాను.

ఆత్మారాం మరోసారి నన్ను సూటిగా చూశాడు, "కాదు. కవిగారన్నట్టు పాటకు రాగాలుకోటి. కానీ భావం ఒకటే. ఆ రాగాల్ని అందరినీ ఆకట్టుకునే విధంగా ఆలాపించడంలోనే నీ సామర్థ్యం కన్పిస్తుంది. నేను చెప్ప బోయే కథ నీకు నచ్చితే వ్రాసుకో. లేకపోతే మర్చిపో. అయితే, నీకు నచ్చినా నచ్చకపోయినా నా మామూలు మాత్రం ఇచ్చుకోవాల్సిందే. ఇది మర్చిపోకు."

అలాగేనని చెప్పమన్నట్టు తలూపాను.

అతను టీ గుర్తు చేశాడు. ఆర్డరిచ్చాను.

"ఓ.కే. మోహన్. నేను చెప్పబోయేది యదార్థ సంఘటన" అన్నాడతను. "అయితే అంతా యదార్థ మని నువ్వు నమ్మనవసరం లేదు. నా గురించి నువ్వు తెలుసుకునే వుంటావు. ప్రజాభిప్రాయాలే నా కబుర్లకు ఆధారం. ఎక్కడో మద్రాసులో వున్న మనిషి ఫలానా రోజున, ఫలానా క్షణాన, ఫలానా మనిషితో, ఫలానా చోటుకి వెళ్ళి, ఫలానా విధంగా ప్రవర్తించి, ఫలానా మాటలు చెప్పాడని నీకెలా తెలుసని నువ్వడగవచ్చు: వూహిస్తాను. మూల సంఘటనకి అనుగుణంగా కొన్ని చిన్న చిన్న సంఘటనల్ని కల్పిస్తాను. ఇలా చెయ్యడం వలన చెప్పడానికి నాకూ, వినడానికి నీకూ ఉత్సాహంగా వుంటుంది. ఏమంటావ్?"

తలూపాను. టీలు వచ్చాయి. చెరో కప్పందుకున్నాం,

"ఇక ప్రారంభిస్తున్నాను." ఆత్మారాం అన్నాడు. "సంఘటన ఏ విధంగా ప్రారంభమయిందో అదే విధంగా చెప్తాను. అందులో పాత్రలన్నీ వరుసక్రమంలో చోటు చేసుకుంటాయి. డౌట్స్ వస్తే మధ్యలో అడ్డుతగల కూడదు. వాటిని చివరికి చర్చిద్దాం. ఇక మొదలు పెడు తున్నాను..."

"సంవత్సరం క్రితం ముగ్గురు ఆగంతకులు సిటీ వెలుపల హాయత్ నగర్‌లో ఒక చిన్న ఇంట్లో సమావేశము అయ్యారు. భూషణ్, కళావర్, నాగేష్ వాళ్ళ పేర్లు. భూషణ్‌కి 58 ఏళ్ళు. ఎప్పుడూ ఆరోగ్యంగా, నీట్‌గా వుంటాడు—కారణం—దుర్వ్యసనాలు లేవు. కానీ వృత్తిరీత్యా నేరస్థుడు. అప్పుడప్పుడు ఫోర్జరీ కేసులమీద జైలు కెళుతుంటాడు.

"కళావర్ సింగ్—పంజాబీ. 32 ఏళ్లుంటాయి. నాటు సారా అతని అభిమాన డ్రింక్. ఆడవాళ్ళ నగలు దోచుకోడం అతని వృత్తి. అయితే భూషణ్‌కీ, సింగుకీ కత్తులు తప్ప ఇతర ఆయుధాలు గురించి తెలియదు. రకరకాల ఆయుధాల గురించి తెలిసినవాడు నాగేష్.

"నాగేష్ వయసు 23. చింపాంజీలా వుంటాడు. అతనికి వంటరిగా ఆడది కన్పించడానికి వీల్లేదు. పది రూపాయల కోసం తల్లిగొంతు కోసే రకం.

"ఈ ముగ్గురూ కలిసి ఒక పథకం ఆలోచించి రంగంలోకి దూకారు, ప్రతిఫలం దక్కించుకున్నేందుకు. కానీ దక్కిందేమిటో చివరవరకూ తెలియలేదు! ఆల్ రైట్. సంవత్సరం క్రితం ఆ ముగ్గురూ హాయత్ నగర్‌లో చిన్న అద్దె ఇంట్లో సమావేశమయ్యారు..."

చెప్పుకుపోతున్నాడు ఆత్మారాం సీరియస్‌గా.

## 2

భూషణ్ బల్ల సొరుగులోంచి 'సినీహెరాల్డ్' తీసి పైన పర్చాడు. సింగ్, నాగేష్ ఆసక్తిగా ముందుకు వంగారు. సమయం సాయంత్రం ఆరయింది. మూడుగదులు కిచన్, బాత్రూంవున్న ఆ యింట్లో తక్కువ వోల్టేజిగల దీపాలు వెలుగుతున్నాయి.

చుట్టుపక్కలంతా ప్రశాంతంగా వుంది. సింగ్, నాగేష్‌లు ముందుకు వంగగానే భూషణ్ తలతిప్పి కిటికీలోంచి సూర్యాస్తమయ సమయాన్ని తిలకించ సాగాడు. నాగేష్ కళ్లు ముందు పేజీలోవున్న వాంప్ ఆర్టిస్ట్ చిత్రం మీద పడ్డాయి. అర్ధనగ్నంగావున్న ఆ ఫోటోను చూసి సింగ్ ముఖం తిప్పుకున్నాడు. సింగ్‌కి స్త్రీలపట్ల చాలా గౌరవముంది. కన్పించిన స్త్రీలని 'అమ్మా,' 'చెల్లీ' అని పిలిచి నగలిచ్చేయమంటాడు.

"నాగేష్, మై సన్, ఆ ఫోటోకేసి అలా చూడకు!" భూషణ్ అన్నాడు నవ్వుతూ.

భూషణ్ మాటలకి నాగేష్ రెచ్చిపోయాడు: "ఆమె నీ భార్యకాదు, బాస్టర్డ్!"

భూషణ్ ఉలికిపడి, అంతలోనే నవ్వాడు. "నీకు తండ్రిలాంటి వాడిని, అలా తిట్టకు."

నాగేష్ ఉద్రేకంగా లేచి నిలబడి కుర్చీని తన్నాడు, "చూడు మిస్టర్! నన్ను 'మైసన్' అని పిల్చావంటే పళ్ళు ఊడగొడతాను!"

సింగ్ కల్పించుకున్నాడు, "అచ్ఛా! అచ్ఛా! మనం ఈ ఇంట్లో చేరింది తన్నుకోడానిక్కాదు కదా?"

భూషణ్ తేరుకున్నాడు. నాగేష్ 'బాస్టర్డ్' అన్నందుకు కొట్టాలనుకున్నాడు గాని వాడి కళ్ళుచూసి మానుకున్నాడు.

"ఫ్రెండ్స్, ఈ ఇల్లు అద్దెకు తీసుకున్నది మూడు లక్షలు సంపాదించడానికి" అన్నాడతను శాంతంగా.

"మూడులక్షలు! ఏమిటవి?" సింగ్ అడిగాడు గాభరాగా.

"రూపాయలు" అన్నాడు భూషణ్. "అందుకే మిమ్మల్ని పిల్చాను."

నాగేష్ దీర్ఘంగా ఆలోచించి ఆ తర్వాత భూషణ్ మీద ప్రశ్నల వర్షం కురిపించాడు.

"పని ఎలాటిది?"

"కిడ్నాప్."

"శాల్తీ ఎలాటిది?"

"మూవీస్టార్ పెళ్ళాం."

"వాటాల సంగతేమిటి?"

"మూడు లక్షల్లో లక్షన్నర నాది."

ఈ సమాధానం విని నాగేష్ నవ్వాడు. "మా వాటా."

"మిగిలినదాంట్లో చెరిసగం."

నాగేష్ లోలోన నవ్వుకుని అన్నాడు, "ఈ బిజినెస్‌లో రిస్క్ చాలావుంది. ఈపని నేను లేకుండా నువ్వు చెయ్యలేవు భూషణ్. కళాధర్, నువ్వూ చేయ చేయలేవు. ఎగ్జిబిషన్ గ్రవుండ్సులో నలుగురు ఆడవాళ్ళు నిన్ను చెప్పులతో కొట్టగా చూశాను. ఆడవాళ్ళని హాండిల్ చెయ్యడం నా ఒక్కడికే చాతవును. ఒప్పుకుంటారా?"

వెంటనే తలూపాడు భూషణ్.

"కాబట్టి నా వాటా లక్ష. నీవాటా నువ్వన్నట్టు. సింగ్ వాటా యాభయి వేలు. ఇక ప్లానేమిటో చెప్పు!" అన్నాడు నాగేష్.

భూషణ్ ఉలికిపడ్డాడు, "నాగేష్, సింగ్‌కి అన్యాయం చేస్తున్నావ్!"

"అన్యాయం చేస్తున్నానా! అయితే ఒకపని చేద్దాం తలో లక్ష పంచుకుందాం!" నాగేష్ అన్నాడు.

"లక్ష!" అర్చాడు భూషణ్, "చివరికి నాకే ఎసరు

పెడతావా! నా వాటా లక్షరూపాయలా! ప్లాను నాది! ఖర్చులు నావి__”

“మెదడు నీది! పటప్ బాస్టర్డ్!” కసిరాడు నాగేష్, “నీకెంత మెదడువున్నా నేను లేనిది ఏమీ చెయ్యలేవు. చెప్పినట్టు ఒప్పుకో! లేదా ఎవరిదారి వారిదే!”

భూషణ్ ఉలిక్కిపడ్డాడు. అతని ముఖం ఎర్రబడింది.

నాగేష్ గురించి అతనికి తెలుసు. నాగేషనుకున్న దానికి యెవరయినా కాదంటే తనదారి తనుచూసుకుంటాడు. ఈ పథకంలో నాగేష్‌లాటి మనిషి అవసరం చాలా ముఖ్యం. ఈ పథకంలో ఆయుధాలు ఉపయోగించవలసి వుంటుంది. తనకీ, కళావర్‌కీ కత్తులుతప్ప మరో ఆయుధం పట్టుకోడంరాదు.

పథకం బెడిసికొట్టి పోలీసులు రంగ ప్రవేశం చేస్తే కత్తులతో యుద్ధం చేయడానికిది రామాయణ మహాభారతాలనాటి కాలంకాదు. ఈ పథకం పూర్తిగా నాగేష్మీద ఆధారపడివుంది. అతను లేనిది పథకం లేదు.

“అలాగే__అలాగే నాగేష్ __ నువ్వసాధ్యుడివి,” అన్నాడు భూషణ్ చివరికి.

“ఇక ప్లాను వివరించు!” నాగేషన్నాడు సింగ్‌ని చూసి నవ్వి.

భూషణ్ నిట్టూర్చి, అనుచరులిద్దర్నీ చూసి పేపరందుకున్నాడు:_

“ఈ సినీహెరాల్డ్ హెడ్‌లైన్స్ ప్రకారం హైద్రాబాదులో రెండురోజుల తర్వాత ప్రముఖసినీనటి కౌసల్యాదేవిని సన్మానిస్తున్నారు. సభ రవీంద్రభారతిలో జరుగుతుంది. ఆమె ఫీల్డులో ప్రవేశించి పాతికేళ్ళు గడిచాయట. అందుకని సన్మానం. ఆమె సన్మానంతో మనకి పనిలేదు. ఆమెని సన్మానించడానికి ప్రత్యేక శ్రద్ధతో

మద్రాసునుంచి వస్తోన్న సూపర్‌స్టార్ జయదేవ్ భార్య వనజతో మనం మూడులక్షలు బిజినెస్ చేస్తాం..."

"అర్థమయింది. మధ్యలో ఆగనవసరంలేదు. చెప్పుకుపో!" నాగేష న్నాడు.

భూషణ్ మళ్ళీ ప్రారంభించాడు, "ఆమెభర్త మిస్టర్ జయదేవ్ సూపర్‌స్టార్ ఆఫ్ ది డికేడ్. పదేళ్ళుగా ఫీల్డుని మకుటంలేని మహారాజులా యేలుతున్నాడు. ఈ మధ్య ప్రభుత్వం ప్రకటించిన ఇన్‌కం టాక్స్ బకాయిల్లో అతనిదే అగ్రస్థానం. అతనిదగ్గర చాలా బ్లాక్‌మనీ వుంది. అంత డబ్బు అనవసరంగా కుళ్ళిపోవడం నాకు నచ్చలేదు. అందులో కొంత మనకి ఉపయోగపడాలి. ఎనిడౌట్స్?"

"నో డౌట్స్."

"రెండురోజుల తర్వాత, మూడవరోజున, రాత్రి ఎనిమిది గంటలకి, రవీంద్ర భారతిలో కౌసల్యాదేవి సన్మాన సభ జరుగుతుంది. సభకి గవర్నర్, ముఖ్యమంత్రి, ఇతర పెద్దమనుషులు హాజరవుతారు. సన్మాన కార్యక్రమం ముగిశాక సాంస్కృతిక కార్యక్రమాలు ప్రారంభమవుతాయి.

"రాత్రి పన్నెండు గంటలకు సభ ముగుస్తుంది. మద్రాసు నుంచి వచ్చిన వాళ్ళందరికీ కంపాలాలో బస యేర్పాటుచేశారు. ఆ రాత్రి వుండిపోయి తెల్లారి బయలుదేరతారు. కానీ, డియర్ ఫ్రెండ్స్, వనజ బయలుదేరదు."

"మంచిది. కౌసల్యని సన్మానించడానికి జయదేవ్ ఎందుకు రావడంలేదు?" నాగేషడిగాడు.

భూషణ్ తేలిగ్గా నవ్వాడు. "ఈ పేపరు చదివితే తెలుస్తుంది. నీకు చదువు రాదని నాకు తెలుసు. చెప్తాను విను. జయదేవ్ గుండెజబ్బుతో మూడు నెలల నుంచి బాధపడుతున్నాడు. ప్రయాణాలు చెయ్యకూడదని

డాక్టర్స్ సలహా యిచ్చారు. ఇప్పుడతను షూటింగ్స్‌లో పాల్గొనకుండా విశ్రాంతిగా గడుపుతున్నాడు. కాబట్టి తన తరపున భార్యని పంపుతున్నాడు.''

''గుడ్. ఇక ఎలా కిడ్నాప్ చెయ్యాలో చెప్పు.''

''ఆ రాత్రి ఆమె హోటల్‌కి తిరిగివచ్చాక నేను ఫోన్ చేస్తాను. నేను జయదేవ్‌ననీ,ఇప్పుడే వచ్చాననీ ఇరోస్‌లో బసచేశాననీ, వనజని రూంఖాళీచేసేసి నా దగ్గరికి వచ్చేయమనీ చెప్తాను. జయదేవ్ గొంతు నేను అనుకరించగలను. నా మాటలు విన్నతర్వాత తప్పకుండా ఆమె వస్తుంది- ఆమె వచ్చేందుకు నేనొక కారు పంపుతున్నట్టు కూడా చెప్తాను. ఆ కార్లో కళావర్ వుంటాడు.

''ఆమె సూట్‌కేసు తీసుకుని బయటికి రాగానే, కళావర్ ఆమె దగ్గరికెళ్ళి తనని జయదేవ్ పంపించినట్లు చెప్తాడు. ఆమె కారెక్కుతుంది. హోటల్‌కి కొంత దూరంలో నువ్వు నిలబడివుంటావు. కళావర్ కారు ని దగ్గరికి వస్తుంది. నువ్వు ఎక్కి వనజ పక్కన కూచోనీ పిస్తోలు గురిపెట్టాలి...ఆ తర్వాత ఏం చ్యెయాలో నీకు తెలుసు. ఆమె గొడవ చెయ్యకుండా ఇక్కడికి చేరాలి. అర్థమైందా?''

''మరి నువ్వెక్కడుంటావు?''

''నేను మలక్‌పేట నుంచి ఫోన్‌చేసి తిరిగి ఇక్కడికి వస్తాను. మీకోసం ఎదురుచూస్తుంటాను. నాకు నమ్మకం వుంది. నా మాటలు విని ఆమె తప్పకుండా హోటల్ ఖాళీ చేస్తుంది. ఆమె బయటికి వచ్చాక బాధ్యత మీది. జాగ్రత్తగా వ్యవహరించాలి. ఈ రోజు కారు యేర్పాటు చేస్తాను. ఓ.కే.?''

భూషణ్ మాటలకి నాగేష్, కళావర్‌లు తల లూపారు.

"మరి డబ్బెలా సంపాదిస్తాం?"

"ఆ విషయం తర్వాత వివరంగా చర్చించుకుందాం. కిడ్నాప్ చేసిన రాత్రి నేను జయదేవ్‌కి ట్రంకాల్ చేసి విషయం చెప్తాను."

నాగేష్ దీర్ఘంగా ఆలోచించి తలూపాడు. అతన్ని చూసి సింగుకూడా వూపాడు. ఆ యిద్దర్నీ చూసి భూషణ్ తృప్తిగా నవ్వుకున్నాడు.

## 3

ఆత్మారాం టీకప్పు కింద పెట్టి నన్ను చూశాడు.

"కిడ్నాపర్స్ ప్లాను సిద్ధం చెయ్యడంతో ఈ కథలో ఒక అధ్యాయం ముగిసింది. అయితే మిస్టర్ మోహన్, మరో రెండుపాత్రలు యీ కథలో ప్రవేశించాయి. అంతేనా? జయదేవ్—వనజాదేవి. ఈ పాత్రల గురించి రెండుమాటలు: జయదేవ్ వయసు 35. వనజ వయసు 28. వివాహమై ఆరేళ్ళు గడిచాయి. వనజ ఉన్నత కుటుంబంనుంచి వచ్చింది. ఇద్దరిమధ్య ఎలాటి స్పర్థలూ లేవు. అన్యోన్యంగా వుంటారు. ఎంత అన్యోన్యంగా వున్నా పిల్లలులేని లోటు దాంపత్యంలో అసంతృప్తిని కలిగిస్తుంది.

"అయితే వాళ్ళిద్దరూ ఏనాడూ కలహించుకోలేదు. పిల్లలు కలగక పోవడానికి కారణం జయదేవ్‌లో లోపమని డాక్టర్స్ తేల్చారు. అతని వీర్యంలో కణాలు లేవు.

"తానెప్పటికీ తల్లిని కాలేనని తెలిసి...వనజ మొదట చాలా కృంగిపోయింది. అయినా దేవ్‌ని ద్వేషించలేదు. మరింత ప్రేమించింది. ఆమె తనని ఎంత అర్థం చేసుకున్నా దేవ్ మాత్రం న్యూనతా భావం ఫీలవసాగాడు. తను ఆమెకు ద్రోహం చేశాడు. జన్మలో ఆమెకి తల్లి అయ్యే

అదృష్టంలేదు. కానీ తనని అసహ్యించుకోడంలేదు... వనజలాటి మంచిభార్య దొరకడం ఎంత అదృష్టం!

"దేవ్ అలా అనుకుని పూరుకుంటే బావుండేది. కానీ, అతని పతనానికి దారితీసే అనుమానం ఒకటి మెదడులో ప్రవేశించింది. మనసును కలచివేసింది: నిజంగా తనకి పురుషత్వంలేదా? వీర్యంలో కణాలు లేవని డాక్టర్స్ తేల్చారు గానీ, అతనికి నమ్మశక్యం గాలేదు. ఏదో పొరపాటు జరిగి వుండాలని అనుమానించాడు. అయితే లోపం వనజలోనే వుండాలి. తనలో ఎలాటి లోపం వుండే అవకాశంలేదు! ఈ విషయం ధృవపరచుకోవాలి. తనకి పూర్తి పుంసత్వం వుంది. ఈ విషయం నిరూపించుకోవాలి. అంతే—అప్పుడేం చేశాడంటావ్ జయదేవ్?"

"అక్రమ సంబంధం యేర్పరచుకొని వుండాలి—" అన్నాను.

ఆత్మారాం నవ్వాడు, "కరెక్ట్. అయితే ఒకటీరెండూ కాదు. అసంఖ్యాకమైన సంబంధాలు. నిజం చెప్పాలంటే అతని కంతకుముందు ఎలాటి దుర్వ్యసనాలు లేవు, తాగుడు తప్ప. సంవత్సరంపాటు విఫల ప్రయత్నం చేశాడు గానీ ఫలితంలేదు.

"చివరికి అతని తతంగం వనజకి తెలిసిపోయింది. ఐనా ఆమె అసహ్యించుకోలేదు, కృంగిపోలేదు. అతనికి నచ్చచెప్పింది. మార్చడానికి ప్రయత్నించింది...

"తనని ఆమె ఇంకా సహిస్తోంటే, ఆమె మంచితనం నిరూపించుకుంటోంటే, అతనిలో పట్టుదల ఇంకా పెరిగింది. తాగుడు, తిరుగుళ్ళు విపరీతంగా పెరిగిపోయాయి. ఫలితం అతను వూహించని విధంగా దక్కింది—గుండె జబ్బు ప్రారంభమయింది. ఒకసారి స్ట్రోక్ కూడ వచ్చింది. అప్పుడే ఆస్పత్రిలో చేరాడు. అక్కడ కోలుకుంటోం

డగా రేవతి అనే నర్సుకి సన్నిహిత మయ్యాడు. రేవతి: అందమైన యువతి, వయసు 24. ఇంకా కుమారి.

"పూర్తిగా కోలుకున్నాక తిరుగుళ్ళన్నీ మానేసి రేవతి ప్రేమలో పడ్డాడు. ఉద్యోగం మాన్పించి, అడయార్‌లో ఒక బంగళా కొని ఆమెకి అక్కడ బస ఏర్పాటు చేశాడు. వనజ అతని గురించి పట్టించుకోడం తగ్గించేసింది. డాక్టర్స్ మూడు నెలలు పూర్తిగా విశ్రాంతి తీసుకోమన్నారు. దేవ్ అడయార్ బంగళాలో రేవతితో మకాం వేశాడు. అలాగని భార్యని నిర్లక్ష్యం చేయలేదు. ఆమె పేర్న అయిదులక్షలు ఇన్సూర్ చేశాడు.

"ఇక అసలు కథకివద్దాం. ఇక్కడ కిడ్నాపర్స్ప్లాను సిద్ధం చేసుకున్న సమయంలో మద్రాసులో జయదేవ్, అడయార్ బంగళాలో రేవతితో కాలక్షేపం చేస్తూ వున్నాడు. రేవతి అందమయినదని ముందే చెప్పాను. ఆమెకు నగలు, డబ్బుమీద మోజెక్కువ. దేవ్‌తో వ్యవహారం ప్రారంభమయ్యాక పగటి కలలు కనడం ప్రారంభించింది. ఎలాగయినా అతని భార్యస్థానం ఆక్రమించాలనుకుంది. దేవ్ తప్పకుండా భార్యకు విడాకులిస్తాడని ఆమె నమ్మకం. అందుకతన్ని ప్రేరేపించాలి..."

## 4

ఆత్మారాం నాకు చెప్పిన ప్రకారం, ఆరోజు తోటలో కూచోని వుండగా రేవతి జయదేవ్‌ని సందేహించకుండా అడిగేసింది:

"దేవ్, మరి మన పెళ్ళెప్పుడు?"

దేవ్ షాక్ తిని చూశాడు, "ఏమిటి రేవ్ నువ్వన్నది?"

"పెళ్ళి."

దేవ్ ఆమె కళ్ళలోకి సూటిగా చూశాడు, "రేవ్,

నీకా్కవలసింది డబ్బు, నగలు—అంతేకదూ? ఈ విషయం నువ్వే చెప్పావు.''

''చెప్పాను—చెప్పాను దేవ్. కానీ ఇప్పుడు నాకు పెళ్ళికూడా కావాలి—నాకు భద్రత ఏర్పడాలి!''

ఫకాలున నవ్వాడు దేవ్, ''రేవ్! నువ్వు నీ భద్రత గురించి ఎప్పుడూ ఆలోచించలేదు! ఆలోచించవు! ఆలోచించి వుంటే ఈ మూడు నెలలు గడపకుండా పవిత్రంగా వుండేదానివి. అవునా? ఇంకెప్పుడూ పెళ్ళిగురించి ఆలోచించకు!''

రేవతి చురుగ్గా చూసింది, ''పిచ్చిదేవ్! వనజకి విడాకులిస్తే నీకువచ్చే నష్టమేమిటి? నువ్వామెను పూర్తిగా మర్చిపోయావు! మీ యిద్దరిలో అన్యోన్యత లేదు. ఇంకెంత కాలం ఆమెముందు సిగ్గుపడుతూ బ్రతుకుతావు, పౌరుషం లేని మగవాడిలా!''

''రేవ్!'' జయదేవ్ అరిచాడు, ''నాభార్య—వనజ—దేవత!''

రేవతి పకపక నవ్వింది, ''పిచ్చిదేవ్! నువ్వింకా కళ్ళు మూసుకునే వున్నావు—''

''ఏమన్నావ్?''

''నీ భార్య దేవతకాదు—ఆమె...ఆమె — పతివ్రత కాదు!''

జయదేవ్ విసురుగా చెయ్యెత్తి రేవతి ముఖంమీద చరిచాడు. రేవతి బాధగా మూల్గింది. ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి. దేవ్ తేరుకుని చలించిపోయాడు. ఆత్రతగా ఆమె ముఖం చేతుల్లో తీసుకున్నాడు, ''ఓహ్, గాడ్! నిన్ను కొట్టానా! రేవతీ, ఏమిటిది?''

అతని చేతుల్ని చెంపలకి రుద్దుకుంటూ గొణిగింది రేవతి, ''నా దేహంమీద నీకు అధికారం వుంది దేవ్.''

అంతే, ఛటుక్కున ఆమెను దగ్గరికి తీసుకున్నాడు దేవ్. ఇద్దరూ గడ్డిలో వాలిపోయారు.

"దేవ్!"

"దేవ్!"

అరగంట తరువాత విడిపోయారు.

"క్షమించు దేవ్. నిన్ను కొట్టాను. ఏం చెయ్యను– నా భార్యని కించపరచావు!" అలసటగా అన్నాడు జయదేవ్.

"దేవ్, నువ్వే నన్ను క్షమించాలి" అంది రేవతి.

"అలాగే. నన్ను పెళ్ళిచేసుకునే ప్రయత్నంలో వనజ గురించి నీచంగా మాట్లాడకు!"

"మాట్లాడను" ఉలిక్కిపడి మళ్ళీ అంది రేవతి, "ఆమె హైద్రాబాదు కెప్పుడెళుతుంది దేవ్?"

"రెండురోజుల తర్వాత. లెటజ్ మేక్ లవ్ యెగయిన్!"

దేవ్ చేతులు ఆమెను చుట్టేశాయి.

## 5

జయదేవ్ ఆ రోజంతా ఉత్సాహంగా గడిపాడు.

స్టూడియోస్ కెళ్ళి స్నేహితుల్ని కలుసుకున్నాడు. హోటల్‌లో పార్టీ ఇచ్చాడు. రాత్రి యెనిమిదిగంటల వరకు బీచిలో వంటరిగా గడిపి తిరిగి ఇంటికి వచ్చాడు. ఇల్లంతా అతనికి కొత్తగా వింతగా తోచింది. మూడు నెలల తరువాత ఈ ఇంట్లో ప్రవేశించాడతను.

ఇన్నిరోజులు వనజ ఇక్కడ వంటరిగా గడిపింది! ఎంత ఆవేదన చెందిందో? ఏర్‌పోర్టులో ఆమె చెప్పిన మాటలు జ్ఞాపకం వచ్చాయి:

అవే మాటలు! అదే ధోరణి! రేవతిని మర్చిపొమ్మంది.

తను తిరిగి వచ్చేసరికి రేవతికి కావలసినంత డబ్బిచ్చి, ఎక్కడికేనా దూరంగా పంపించేసి, తనకోసం యెదురు చూస్తూండమంది. దేవ్ ఈమాట అంతగా పట్టించుకో లేదు. అయితే, తను చెప్పినట్టు చెయ్యకపోతే ప్రాణాలు తీసుకుంటానని వనజ చెప్పినపుడు, విపరీతంగా భయ పడ్డాడు.

జయదేవ్ ఆలోచించాడు. అసలు తనెందుకిలా ప్రవ ర్తిస్తున్నాడు? ఆమె నెందుకలా చిత్రవధకి గురిచేస్తు న్నాడు? తనలో ఆ వెధవ కాంప్లెక్స్ ఎందుకు ప్రవేశిం చింది? తనపట్ల ఆమె అంత అనురాగం చూపిస్తోంటే ఎందుకు అవమానం ఫీలవుతున్నాడు?

నో, ఈ సమస్యని ఈ రోజు పరిష్కరించాల్సిందే! తను తీసుకోబోయే నిర్ణయం తిరుగులేనిదిగా వుండాలి! ఈ సంవత్సరంనించీ తను తొక్కుతున్న వక్రమార్గాల్ని ఒక గమ్యానికి చేర్చాలి! అంటే బయలుదేరిన చోటుకే తిరిగి రావాలి—వనజ శ్రేయస్సు దృష్ట్యా. ఇంకెంత కాలమూ ఆమె సహించదు.

ఈ దగాకోరు ప్రపంచంలో వనజతప్ప తనకి నిజమైన ప్రేమను ఎవరూ అందించలేరు! రేవతిని మర్చిపోయి ఆమెకి చేరువ కావాలి. తప్పదు. లేదా, ఆమె చావుకు తను అనుమతించినట్టవుతుంది! అప్పుడు తను బ్రతికివున్నా శవంతో సమానం.

రేవతి ప్రేమిస్తోంది తననికాదు, తన డబ్బును. తన భార్యస్థానం ఆక్రమించడానికి ఆమె చేస్తోన్న ప్రయ త్నాలు చూస్తోంటే జాలివేస్తోంది జయదేవ్‌కి.

గంటసేపు సిగరెట్ కాలుస్తూ బెడ్‌రూంలో గడి పాడు. నిశ్శబ్దంగావున్న ఇంట్లో హఠాత్తుగా ఫోను మోగి జయదేవ్‌ని అదరగొట్టింది.

రిసీవర్ ఎత్తాడు.

"దేవ్, ఎక్కడున్నావు ఉదయం నుంచీ!"

దేవ్ గుండె ఝల్లుమంది. సమాధానమివ్వకుండా— అవతల రేవతి మాట్లాడే అవకాశమివ్వకుండా, రక్కున రిసీవర్ పెట్టేశాడు.

చాలాసేపు అచేతనంగా వుండిపోయాడతను. రేవతి! తను అక్కడికి వెళ్ళాలా? నో, ఈ క్షణం నుంచి ఆమెతో తనకెలాంటి సంబంధమూ లేదు!

మళ్ళీ మోగింది ఫోను!

జయదేవ్ సందేహించాడు. ఆ తర్వాత రిసీవర్ ఎత్తాడు.

"హల్లో? హల్లో? దేవ్? నువ్వేనా?"

జయదేవ్ రక్తం గడ్డకట్టింది. రిసీవర్ విసిరికొట్టాడు.

బెడ్ మీద అడ్డంగా పడుకుని కళ్ళు మూసుకున్నాడు. తనని మర్చిపొమ్మని ఆమెకి చెప్పాలి. కావలసినంత డబ్బివ్వాలి. దూరంగా వెళ్ళిపొమ్మనాలి. తప్పకుండా వెళ్ళిపోతుంది—వనజ ఏం చెప్పిందో ఆమెకి చెప్తేచాలు.

సమయం పదకొండు గంటలైంది. ఆకలిగాలేదు. అలాగే అరగంటసేపు పడుకున్నాడు. అప్పుడు మోగింది కాలింగ్ బెల్, టెలిఫోన్ కాదు.

ఉలికిపడి లేచాడు జయదేవ్. ఎవరొచ్చారు? రేవతి వచ్చిందా? అయితే యిప్పుడే యీ సమస్యని పరిష్కరించాలి.

ఛటుక్కున లేచి టేబిల్ సొరుగులోంచి పెన్నూ, చెక్ బుక్కు తీశాడు. ఆ తర్వాత హాల్లోకి వచ్చి తలుపు తెరిచాడు. ఎదుగారువున్న ఆకారాన్ని చూసి అదిరి పోయాడు.

రేవతి ఎన్నడూలేని విధంగా అలంకరించుకునివుంది. సాదాగా వుంటేనే ఆమె చాలా అందంగా కన్పిస్తుంది.

అందులోనూ యీ అలంకరణ అదరగొట్టింది జయదేవ్ ని. నెయిల్ పాలిషు గోళ్ళు, మృదువైన వేళ్ళు, చేతులకి గాజులు, పెదవులకి లిప్ స్టిక్, కళ్ళకి కాటుక, వదులుగా వేసుకున్న జడ, జడలో మత్తెక్కించే పూలు, వీటన్నిటినీ మించి కైపెక్కించే చూపులు, ఆ చూపుల్ని మించి పాత్రికడుపు కిందికి కట్టిన పల్చటి తెల్లని చీర!

జయదేవ్ నరాలు అదుపు తప్పాయి.

రేవతి కిలకిలమని నవ్వి లోనికడుగు పెట్టింది.

"పిచ్చిదేవ్, నేను నీ దాన్ని!"

ఆకాశంలో తేలిపోతున్న దేవ్ హాఠాత్తుగా నేల మీద కొచ్చిపడ్డాడు—నడుము విరిగినంత పనయింది.

నో, రేవతికి లొంగకూడదు!

"ఏమిటలా అయిపోతున్నావు? యేమయింది నీకు?" రేవతి అడిగింది గాభరాగా.

జయదేవ్ తేరుకుని నవ్వాడు, "రేవ్, నువ్వు యీ యింట్లోకి రాకూడదు. ఈ క్షణం నుంచి నా ఛాయలకి రాకూడదు. నన్ను మర్చిపోయేందుకు నీ కెంత కావాలి చెబీ?"

రేవతి ముఖంలో రంగులు వేగంగా మారాయి.

"నువ్వన్నదేమిటి దేవ్?"

"నన్ను మర్చిపోయాలి. నీకెంత కావాలి?"

ఆలస్యం చెయ్యకుండా చెక్ బుక్ తీశాడతను.

"నిన్ను మర్చిపోవాలా! నాకేం కాను!"

"పదివేలిస్తాను. విలాసంగా బ్రతకవచ్చు."

"దేవ్, నువ్వు తమాషా చెయ్యడంలేదు కదా?"

"ఇరవై వేలు!"

"దేవ్, ఏమిటిది?"

"తమాషాకాదు. ప్రాణానికి సంబంధించిన సమస్య.

నువ్వు నాకు దూరంగా వుంటే ఒక ప్రాణాన్ని కాపాడిన దానవవుతావు. ఎంత డబ్బయినా యిస్తాను—ముఖైవేలు!"

"దేవ్! ఎవరి ప్రాణం."

"ఊహించలేవా? వనజ ప్రాణం."

"ఏమందామె?"

"నువ్వు కోరినంత డబ్బిచ్చి దూరంగా పంపించమంది. లేకపోతే తనే వెళ్ళిపోతానంది-దూరంగా—శాశ్వతంగా-మరో లోకానికి."

ఇంకా విడమర్చి చెప్పాడు జయదేవ్, "రేవ్, ఆమె నన్ను చాలా సహించింది. ఇంకా ఆమె సహనాన్ని పరీక్షించాలనుకోవడం తెలివితక్కువ తనమే అవుతుంది. ఇప్పటికే నేను బుద్ధితక్కువగా ప్రవర్తించి చాలా పోగొట్టుకున్నాను—వనజమీది ప్రేమ, నా ఆరోగ్యం, డబ్బు, ప్రతిష్ట, మనశ్శాంతి...ఇంకా మనిషికేమేం కావాలో అవన్నీ!

"రేవ్, నువ్వు నన్ను అర్థంచేసుకోవాలి. మన పరిచయం ప్రారంభమైనప్పుడే చెప్పాను, మన సంబంధం ఎటువంటిదై వుంటుందో. అయినా నువ్వు ఆశలు పెంచుకున్నావు. అది నా తప్పుకాదు. నేనేమీ చెయ్యలేను. నౌ, రేవతీ, లెటజ్ సెటిల్ ది ఎఫైర్."

జయదేవ్ సోఫాలో కూచోని, సిగరెట్ వెల్గించి, యాభైవేలకి చెక్కు వ్రాసి రేవతి చేతిలో పెట్టాడు.

రేవతి చాలాసేపు చెక్కును చూస్తూ ఆలోచిస్తూండి పోయింది. ఆ తర్వాత తేరుకుని దాన్ని ముక్కలుగా చించివేసింది.

జయదేవ్ వూపిరి బిగించి ఆత్రుతగా చూశాడు.

"పద దేవ్, ఈ ఒక్కరాత్రి నీతో నిద్రించాలి!"

కఠినంగా, ఆజ్ఞాపించినట్టుగా వున్న ఆమె స్వరం విని

ముఖంలోకి చూశాడు దేవ్. ఇంకా కసిగా, కర్కశంగా చూసిందామె. ఆ తర్వాత దేవ్ ని ఆశ్చర్యపరుస్తూ మృదువైన స్వరంతో అంది, "దేవ్, నిన్ను అర్థం చేసుకోలేననుకున్నావా? మంచీ చెడూ ఆలోచించలేని అమాయకురాల్ని కాను నేను. డబ్బుకోసమే నీతో స్నేహంచేశాను. ఆ తర్వాత పెళ్ళికూడా కావాలన్పించింది. నీకు అంకితమైపోయిన నేను యిలా కోరుకోడం నేరంకాదు. అయితే నా కోరిక నెరవేరదని యిప్పుడు పరిస్థితినిబట్టి అర్థం చేసుకున్నాను. నిన్ను పెళ్ళాడి సాటి ఆడదాని చావుకు బాధ్యురాల్ని కావడం నాకిష్టంలేదు. అందుకే నువ్వు చెప్పినట్లు చేస్తాను—దూరంగా వెళ్ళిపోతాను."

"థాంక్స్, రేవ్! థాంక్యూ వెరీమచ్!"

రేవతి జాలిగా నవ్వింది, "అయితే నాతోరా! యీ ఒక్క రాత్రి—"

దేవ్ సందేహించకుండా ఆమె చెయ్యిపట్టుకుని గదిలోకి తీసికెళ్ళాడు.

"రేవ్, వనజ తర్వాత నువ్వు దేవతవి!"

"దేవ్, నన్నెప్పుడూ మర్చిపోకు."

"అలాగే, ఎక్కడికెళ్తావు? ఏం చేస్తావు?"

"ఎక్కడికయినా వెళ్తాను. ఉద్యోగం చేస్తాను."

"రేవ్, డబ్బు తీసుకో—నా తృప్తికోసం."

ఆమె అడ్డంగా తలూపింది, "నా తృప్తికోసం ఈ రాత్రి జన్మకంతటికి జ్ఞాపకం వుంచుకునేలా చేయ్!"

రెండుగంటల తర్వాత ఇద్దరూ గాఢనిద్రలోకి జారుకున్నారు. అలా ఎంతసేపు నిద్రపోయాడో జయదేవ్ కి తెలియదు. అంత గాఢనిద్రలోనూ అతని కెందుకో క్రమంగా మెలుకువ రాసాగింది. ఏదో శబ్దం అవలీలగా

విన్పిస్తోంది. పూర్తిగా మేల్కొనేందుకు రెండునిమిషాలు పట్టింది.

బెడ్ పక్కన టీపాయ్‌మీద ఫోను అదేపనిగా మోగుతోంది. చటుక్కున చెయ్యిచాచి రిసీవర్ అందుకున్నాడు.

"హల్లో, జయదేవ్ హియర్."

"గుడ్ మార్నింగ్ మిస్టర్ జయదేవ్" అవతలి గొంతు పలికింది.

"యస్?"

"మిస్టర్ దేవ్, నో ఎక్సైట్‌మెంట్ ప్లీజ్!"

"యస్?"

"గాభరా పడకండి. అంతా సవ్యంగా జరుగుతుంది. మీరు వెంటనే బయలుదేరి హైదరాబాదుకు వచ్చేయండి!"

"హల్లో," తికమకగా అడిగాడు జయదేవ్, "ఎవరు మీరు?"

"మిస్టర్ దేవ్, డిసీజ్ ట్రంకాల్. సమయం ఎక్కువ లేదు. ప్రశ్నలడక్కండి. చెప్పినట్లు చెయ్యండి! శ్రద్ధగా వినండి: మా బందీగావున్న మీ భార్యని విడిపించుకో డానికి మాకు అయిదులక్షలు చెల్లించాలి. మళ్ళీ చెబు న్నాను. మా బందీగావున్న మీ భార్యని విడిపించుకో డానికి మాకు అయిదులక్షలు చెల్లించాలి—"

"హల్లో, ఏమిటి మీరనేది?"

"తక్షణం హైదరాబాదుకి బయలుదేరి వచ్చేయండి— డబ్బుతో. డబ్బు ఏ విధంగా చెల్లించాలో ఈ రోజు సాయంత్రం హైద్రాబాదులో సరిగ్గా ఆరుగంటలకి తెలియజేస్తాం. జాగ్రత్త. డబ్బుమాత్రమే యివ్వాలి.

పోలీసులకి పట్టివ్వకూడదు! నో ట్రిక్స్, మిస్టర్ దేవ్. మీ రాకకోసం ఎదురుచూస్తుంటాం. సెలవు!''

టెలిఫోన్ సంభాషణ ఆసాంతమూ విన్న రేవతి, జయదేవ్‌లో ఎంతకీ చలనం లేకపోవడంతో గాభరాగా లేచి కూచుంది. వణుకుతున్న చెయ్యితో లైటుస్విచ్ నొక్కింది.

జయదేవ్ సీలింగ్‌కేసి సూటిగా, కన్నార్పకుండా చూస్తూ వెల్లకిలా పడివున్నాడు.

''దేవ్! ఏం జరిగింది?''

సమాధానం లేదు.

రేవతికి ఏడుపు ముంచుక వచ్చింది.

ఛటుక్కున లేచి అతని గుండెకి చెవి ఆనించింది—బలహీనంగా, అస్పష్టంగా శబ్దం విన్పిస్తోంది.

''ఓహ్, దేవ్! యేమయ్యింది?''

ఆమె కుదుపుకి జయదేవ్ చేతిలోని రిసీవర్ జారి కింద పడింది. ఆ మూడు నిమిషాల షాక్ నుంచి అతను ఆకస్మాత్తుగా తేరుకున్నాడు.

రేవతి తేలిగ్గా ఊపిరి వదిలింది.

''దేవ్, ఫోన్ చేసిందెవరు? ఎందుకలా భయపడ్డావ్?''

అతను పూర్తి స్పృహలోకొచ్చి జరిగిందేమిటో గ్రహించాడు.

వనజ అపాయంలో వుంది!

ఆగంతకుని ఆదేశం ప్రకారం అయిదులక్షలు చెల్లించి ఆమెని దక్కించుకోవాలి! అతనికో అనుమానం తట్టింది. ఇది నిజమా? లేక తమాషాకి ఎవడో పిచ్చివాడు చెప్పిన మాటలా? కాదు! ఆ గొంతు కఠినంగా వుంది. పరమ కిరాతకుడని తెలుస్తోంది.

వనజ నిజంగా అపాయంలో వుంది!

తేరుకుని, జరిగిందేమిటో ఆమెకి చెప్పాడు. ఆమె విపరీతంగా భయపడింది.

"దేవ్, ఈ విషయం పోలీసులకి చెప్పవు కదూ?"

"లేదు, చెప్పను. వనజ క్షేమంగా దక్కాలి! ఎంత డబ్బయినా వదులుకుంటాను!"

"దేవ్, ఏమీ దిగులుపడకు! అసలిదెలా జరిగిందో అర్థంగావడంలేదు! నీకైనా తెలుసా?... వెంటనే బయలుదేరదాం దేవ్."

"వద్దు!" జయదేవన్నాడు వెంటనే, "నేనొక్కడినే వెళ్తాను. ఎవరికీ చెప్పకు! రేవతీ నీ దారిన నువ్వు పో! ప్లీజ్..."

రేవతి సాలోచనగా తలూపింది.

# 6

సిగరెట్ అవతలకి విసిరి టీ కప్పందుకున్నాడు ఆత్మారాం.

అప్పటికి బాగా చీకటి పడింది. చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. వెన్నెల్లో అతని ముఖంలో ఉత్సాహం కన్పించింది నాకు.

"గుడ్, మిస్టర్ మోహన్," అన్నాడతను టీ తాగుతూ, "డౌట్స్ వస్తే మధ్యలో అడ్డు తగలవద్దన్నాను. నువ్వలా బుద్ధిగా కూచోని వినడం నాకెంతో నచ్చింది!"

నేనెవరైనా కబుర్లు చెబుతోంటే చెవులప్పగించి వింటాను తప్ప నోరు విప్పనని చెప్పాను.

"వెరీగుడ్! నువ్వు చాలా సీరియస్ గా వింటున్నావు కాబట్టి నీకో డౌటు వచ్చివుంటుదని నా అనుమానం. అంతేనా? ఆ డౌటేమిటో చెప్పుకో చూద్దాం?"

ఆత్మారాం కథ ఆపినప్పుడే నాకా డౌటు వచ్చింది.

"అయిదులక్షల నోటు" అన్నాను వెంటనే.

ఆత్మారాం నవ్వాడు. "అహాఁ! ఫరవాలేదు, కథలు వ్రాసుకోగలవు. సరే, ఆ నోటు వెనుక చాలా కథ వుంది. మూడులక్షలని నిర్ణయించుకుని భూషణ్ అయిదు లక్షలు కోరడానికి కారణమేమిటో ఊహించగలవా?"

"నాగేష్ అతని వాటా తగ్గించేశాడు కాబట్టి తృప్తి కలగలేదేమో!" అన్నాడు.

మళ్ళీ నవ్వాడతను, "కాదు. ఇక్కడొక సస్పెన్సు వుంది. నేను వివరిస్తాను" తిరిగి కథలో దూకాడు.

"ఈ సస్పెన్సుని విడగొట్టాలంటే కిడ్నాప్ జరిగిన రాత్రిగురించి చెప్పాలి. ప్లాను ఏ విధంగా సిద్ధం చేశారో నీకు ముందే చెప్పాను కాబట్టి ఎలా కిడ్నాప్ చేశారో చెప్పడం అనవసరం, టైంవేస్టు. అనుకున్న విధంగా ఆగంతకులు వనజని కిడ్నాప్ చేసి హయాత్ నగర్ తీసి కొచ్చారు. ఆమె ప్రతిఘటించిందని వేరే చెప్పనక్కర లేదు. కళావర్ తస్కరించిన కారు డ్రైవ్ చేస్తుండగా, నాగేష్ వెనకసీట్లో పిస్తోలు గురిపెట్టి కూచున్నాడు— అరిస్తే కాల్చేస్తానని హెచ్చరించాడు. వనజకి అర్థమైంది పరిస్థితి ఏమిటో. తనని కిడ్నాప్ చేశారా అనడిగితే అవునని చెప్పాడు నాగేష్. అయితే ఫరవాలేదని చెప్పిందామె!!

"ఆగంతకులిద్దరూ ఆమె ధోరణికి ఆశ్చర్యపోయారు. ఆ తర్వాత ఆమె మోసం చేస్తుందేమోనని అనుమానించారు. వనజ ప్రశాంతంగా కూచోని ప్రయాణించింది. నాగేష్ అప్పుడప్పుడు ఆమె ముఖం చూస్తూ, ఆమె ఏదో తీవ్రంగా ఆలోచిస్తోందని పసిగట్టాడు.

మామూలు పరిస్థితిలోనయితే కన్పించిన స్త్రీని వదిలే గకంకాదు నాగేష్. కానీ ఇప్పటి పరిస్థితి యేమిటంటే,

ఆమెమీద డబ్బు సంపాదిస్తున్నాడన్న ఆశ — ఒక ప్రఖ్యాత నటుడిభార్య పక్కనకూచునేహోదా భూషణ్ కల్పించినందుకు సంతోషం — ఈ రెండూ అతన్ని వేరే ఆలోచనల్లోంచి తప్పించాయి. కారు క్షేమంగా, భూషణ్ అసహనంగా ఎదురుచూస్తోన్న హాయత్‌నగర్ ఇంటికి చేరుకుంది..."

* * *

కారుదిగి అందరూ నిశ్శబ్దంగా లోనికి నడిచారు.

భూషణ్ మెరుస్తున్న కళ్ళతో చూస్తూ చేతులుజోడించాడు, "మాడమ్, ఇక్కడ మీకు అన్ని సౌకర్యాలూ కల్పించలేనందుకు చింతిస్తున్నాము. క్షమించండి, మీకు కేటాయించిన గదిలో నవారు మంచం, దుప్పటి, దిండు తప్ప మరేమీ లేవు. ఆ గదిలో మీరు ఇరవై నాలుగు గంటలు గడిపితే, ఆ తర్వాత వదిలి పెట్టేస్తాం."

వనజ ముఖ కవళికలు మారాయి: "నేనలా చేస్తే మీ కేమిటి లాభం?"

ఆమెని తీక్షణంగా చూశారు కిడ్నాప్ చేసిన ఆగంతకు లిద్దరూ.

"మూడులక్షలు," భూషణ్ అన్నాడు, "మీ భర్త నుంచి సంపాదిస్తాం."

వనజ తేరుకుంది.

"నన్ను కిడ్నాప్ చేసి మూడులక్షలు సంపాదిస్తారా!" ఆశ్చర్యంగా వుందామె గొంతు.

భూషణ్ నవ్వాడు, "మేం కిరాతకులం! సంపాదిస్తాం!"

"నమ్మకమేనా? ఆత్మ విశ్వాసంతోనే అంటున్నావా ఈ మాటలు?"

నాగేష్, సింగు వోకర్నొకరు చూసుకున్నారు.

"ఆత్మవిశ్వాసమేకాదు, ధైర్యసాహసాలుకూడా మాకు న్నాయి. మీరు నిశ్చింతగా వుండండి. డబ్బందాక మీరు క్షేమంగా మద్రాసు చేరుకుంటారు." అన్నాడు భూషణ్.

వనజ కొన్నిక్షణాలు తీవ్రంగా ఆలోచించింది.

"సరే_అలాగే కానివ్వండి_అయితే_" ఆగిపోయిందామె.

"అయితే?" భూషణ్ అన్నాడు కలవరపడుతూ.

"కొన్ని షరతులున్నాయి" అంది వనజ హుందాగా.

"ఏమిటవి?" భూషణ్ ఇప్పుడు కంగారుపడ్డాడు.

వనజ నాగేష్‌నిచూసి, "ముందా హిప్పీగాడ్ని వెళ్ళమను ఇక్కడినుంచి! వాడ్ని చూస్తోంటే కంపరం పుడుతోంది" అనర్చింది.

భూషణ్ నాగేష్‌కి ... వెళ్ళమన్నట్టు సైగచేశాడు. నాగేష్ వనజని పళ్ళునూరుతూ చూస్తూ, "ఏయ్ బ్యూటీ! నిన్ను చూస్తోంటే తినేయాలన్పిస్తోంది!" అన్నాడు.

"వెకిలి చూపులు చూడకు, వెళ్ళిక్కడ్నుంచి" అరిచింది వనజ.

కళాధర్ కల్పించుకున్నాడు, "బహెన్‌జీ! అలా అరవకండి. నాగేష్, నువ్వు బయటికెళ్ళి కాపుకాయ్."

"మైగాడ్! ఆ బ్యూటీ నన్ను వెకిలి అంది, వెకిలి! ఈ బాస్టర్డ్ బయట కాపు కాయమన్నాడు, కాపు," నాగేష్ అర్చాడు ఆందోళనగా.

భూషణ్ నాగేష్‌ని నవ్వుతూ చూశాడు, "తండ్రిలాంటి వాడిని నేనుండగా నువ్వలా మాటాడకూడదు, మైసన్! బాస్టర్డ్! గెటవుట్, అనవసర చిక్కులు కల్పించి ప్లాను పాడుచెయ్యకు."

భూషణ్ మాటలకి కసిగా పళ్ళునూరి, మిర్రిచూసి బయటకు నడిచాడు నాగేష్.

"మాడమ్, ఇప్పుడు చెప్పండి?" భూషణ్ అడిగాను ప్రశాంతంగా.

"నా గదెక్కడ?"

భూషణ్ ఆమెను గదిలోకి తీసుకెళ్ళాడు. కళావర్ వెంబడించాడు.

"నీ పేరేమిటి?"

చెప్పాడు భూషణ్.

"నీ పేరు?"

కళావర్ తన పేరు చెప్పాడు.

"భూషణ్, సింగ్ నికూడా వెళ్ళమను" వనజ ఆజ్ఞాపించింది. ఆ ఆజ్ఞ తిరిగి భూషన్నుంచి అందుకోకముందే బయటకి నడిచాడు సింగ్.

భూషణ్ అసహనంగా చూశాడు, "ఇప్పుడు చెప్పండి మాడమ్?"

వనజ ప్రవర్తన విచిత్రంగా వుందతనికి.

"మీరు మూడులక్షలు సంపాదిస్తున్నారు" అంది వనజ, "నాకు రెండు లక్షలు కావాలి."

"మాడమ్?"

"ఏ విషయమయినా ఒకేసారి చెప్తాను—నాకు రెండు లక్షలు కావాలి."

"అర్థం కాలేదు... దేనికి?"

"అర్థమవ నవసరంలేదు. అది నీ కనవసరం."

భూషణ్ భయంగా చూశాడు.

"మీవి మూడు, నాది రెండు — మొత్తం అయిదు, ఒప్పుకుంటే చెప్పు, లేదా నా దారిన నన్ను పోనీయ్" అంది వనజ.

"మాడమ్, నాకేమీ అర్థంగావడంలేదు. అసలేమి టిది? డబుల్ క్రాస్ చేస్తున్నారా? అయితే ఆ ప్రయత్నము—"

"భూషణ్," అడ్డుతగిలింది వనజ. ఆమె గొంతు కఠినంగా వుంది, "నామీద డబ్బు సంపాదించి పారిపోలేరని నీకు తెలుసా? నేను చెప్పినట్టు చేస్తే మీరూ, నేనూ క్షేమంగా ఉంటాం. లేదా, అందరమూ నాశనమవుతాం!"

"ఏమిటి? ఏమిటి_మీరనేది?"

"నాకు రెండు లక్షలు కావాలి."

"దేనికి?"

"చెప్పను."

"మళ్ళీ మొదటికొస్తున్నారు" అర్చాడు భూషణ్, "ఆల్ రైట్, మీకోరిక నిరాకరిస్తే?"

"నా దారిన నన్ను పోనియ్."

"అది జరిగేపనికాదు మాడమ్."

"అయితే ప్రాణాలు తీసుకుంటాను."

భూషణ్ అసహనంగా అర్చాడు, "అసలేమిటి ఇది అంతా?"

"నేననుకున్నది లభించకపోతే నాకు చావే పరిష్కారం" అంది వనజ.

భూషణ్ తేరుకున్నాడు, "ఏమిటి మీ సమస్య మేడమ్?"

"భూషణ్, నన్నేమి అడక్కు. నేను చెప్పినట్టు చేస్తావా, చావమంటావా?"

భూషణ్ కుడిచెయ్యెత్తి నుదుటిమీద మూడుసార్లు కొట్టుకున్నాడు.

"మిమ్మల్ని ఎత్తుకొచ్చి చాలా పొరబాటు చేశాం."

"నేను కోరినట్టు చేస్తే, మీరు పట్టుబడకుండా జాగ్రత్త తీసుకుంటాను. నాభర్త పోలీసు రిపోర్టివ్వకుండా ఒప్పిస్తాను."

భూషణ్ మధ్యలో అన్నాడు, "మాడమ్, నాకు చాలా సందేహాలున్నాయి: ఒక ఉన్నతాధికారి భార్య అయి వుండి డబ్బుకోసం మీరిలాంటి మార్గం యెన్నుకున్నారంటే, మీరేవేనా తప్పుడు పనులు చేశారా, లేక... చేయదల్చుకున్నారా?"

ఉలికిపడి సూటిగా చూసింది వనజ. "నీకనవసరం!"

"క్షమించండి. నాకవసరం."

"అది నా వ్యక్తిగత విషయం."

"అయినా నేను కల్పించుకోవలసిన విషయం."

"నువ్వెవరు? దేనికి కల్పించుకుంటావ్!"

"తండ్రిలాంటివాడిని, సహాయపడతాను"'

అసహనంగా చూసింది వనజ.

"ఏదైనా చిక్కులో పడ్డారా?"

అడ్డంగా తలూపిందామె.

"మీ భర్తనుంచి విడాకులు తీసుకోదల్చారా?"

"ఓహ్, కాదు!"

"బ్లాక్ మెయిల్‌లో ఇరుక్కున్నారా?"

"భూషణ్!" అర్చింది వనజ విపరీతంగా వణుకుతూ.

"ఓ.కే. మాడమ్" అన్నాడు భూషణ్ ఒక నిశ్చయానికి వచ్చి. "మీరు మోసం చెయ్యడంలేదని నాకు నమ్మకం కలగాలి. మీరు నిజంగా కష్టాల్లో వున్నారని నాకు తోస్తే సహాయం చేస్తాను. నన్ను తక్కువ అంచనా వెయ్యకండి. ఏ సహాయమైనా చేస్తాను! భూషణ్–కళాధర్–నాగేష్: ఈ టీము ఎలాంటి చిక్కుల్లోంచి అయినా మిమ్మల్ని రక్షిస్తుంది. నమ్మండి."

కాసేపటి తర్వాత అస్పష్టంగా గొణిగింది వనజ, "అవును భూషణ్, నేను బ్లాక్ మెయిల్ లో యిరుక్కున్నాను."

భూషణ్ ఒక్కక్షణం వులిక్కిపడి, ఆ తర్వాత అర్చాడు:

"బ్లాక్ మెయిలర్ కి మేం బుద్ధి చెప్తాం! కళావర్! నాగేష్! ఇలా రండి!"

వనజ వారించింది, "భూషణ్, రాజన్ ని నువ్వేమీ చేయలేవు!"

"వాడేనా బ్లాక్ మెయిలర్?" అడిగాడు భూషణ్.

గదిలో నాగేష్, సింగ్ లు ప్రత్యక్షమయ్యారు.

"బాస్టర్డ్, ఎందుకలా అర్చావు?" అన్నాడు నాగేష్

"మాడమ్ కి సహాయం చెయ్యాలి. ఆమె కష్టాల్లో—"

ఫకాలున నవ్వాడు నాగేష్, "ఆడవాళ్ళకి అన్యాయం చెయ్యడమే నాకు చాతవును!"

వనజ అందుకుంది, "రాజన్ ని ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు, భూషణ్!"

సింగ్ అన్నాడు, "బహెన్ జీ. బాత్ క్యా హై?"

భూషణ్ అడ్డుతగిలాడు, "నాగేష్-సింగ్, మీరిద్దరూ బయటికి వెళ్ళండి. మాడమ్ తో నేను వంటరిగా మాట్లాడతాను!"

వాళ్ళిద్దరూ విసుక్కుంటూ బయటికెళ్ళాక మళ్ళీ అన్నాడు భూషణ్, "ఇప్పుడు చెప్పండి మాడమ్, మీరు బ్లాక్ మెయిల్ లో ఎందుకు ఇరుక్కున్నారు?"

"భూషణ్, మరోసారి చెప్తున్నాను-నన్ను రక్షించలేవు!"

"ఎలా యిరుక్కున్నారో తెలిస్తే ఎలా రక్షించాలో ఆలోచిస్తాను."

"రక్షించలేవు! రక్షించలేవు!" అరిచింది వనజ, "రాజన్ గురించి నీకేమీ తెలియదు. ఆ ఫోటోల్ని వాడు బ్యాంకులో దాచాడు. వాడేమన్నాడో తెలుసా? వాడ్ని పోలీసులకి పట్టిచ్చినా, లేదా హేమరాజ్ చేత చంపించినా, ఆ ఫోటోలు నన్ను బజారుకీడుస్తాయట! వింటున్నావా?"

భూషణ్ తల పంకించాడు, "హేమరాజ్ ఎవరు? మీ ప్రియుడా? ప్చ్ — పేరు ప్రఖ్యాతులున్న భర్త భార్యగా మీరిలా అవినీతికి తలబడ్డం నాకేమీ నచ్చలేదు!"

"ఏమిటి నీకు నచ్చలేదు? నాకు పిల్లలు కావాలి!" అరిచింది వనజ ఉద్రేకంగా.

ఆమె అరుపుకి భూషణ్ అదిరిపడి వెంటనే తేరుకున్నాడు.

"మేడమ్, మీరు ప్రశాంతంగా యేం జరిగిందో చెప్పండి?"

వనజ అసహనంగా చూసింది. భూషణ్ తలూపాడు.

వనజ అంది, "భూషణ్. ఈ జన్మలో నాకు తల్లినయ్యే అదృష్టం లేదు. తల్లి కాకుండా ఏ ఆడది జీవితాంతం సుఖంగా వుంటుంది? అదేం జీవితం! నా భర్తవల్ల నాకు పిల్లలు కలగరు. అందుకాయన్ని నిందించను. ప్రేమిస్తాను — ప్రాణమైనా యిస్తాను — కానీ ఆయన నన్ను నిర్లక్ష్యం చేసినప్పుడు నేనీ రెండూ ఎందుకు చెయ్యాలి? నాకు తెలుసు — నేనీ ప్రపంచంలో వంటరిగా మిగిలిపోయే రోజు చాలా దగ్గర్లో వుందని. నా భవిష్యత్తుని వూహించుకుంటే వొళ్ళు జలదరిస్తుంది. ఆయన నన్ను పూర్తిగా మర్చిపోయినట్టు ప్రవర్తిస్తున్నాడు. ఆ ప్రవర్తన చూస్తోంటే

ఏదో ఒకనాడు నావ విడాకులు తప్పవని వూహించు వున్నాను. అప్పుడు నేనేం కావాలి?''

భూషణ్ మాట్లాడలేదు.

వనజ మళ్ళీ అంది. "విడాకుల తర్వాత వంటరితనం నేను వూహించలేను. అలాగని చావుని ఆహ్వానించలేను. నావ ప్రాణాలమీద తీపివుంది. మాతృత్వంపట్ల మమకారం వుంది. ఎలాంటి పరిస్థితిలోనైనా నేను తల్లిని కావాలి! విడాకులు తీసుకుని మరో వివాహం చేసుకోవచ్చు. కానీ, ఎప్పుడో లభించే విడాకులకోసం నేను ఎదురుచూస్తూ కాలం వృధా చేయదలచలేదు. అందుకే హేమరాజ్‌ని ప్రేమించాను. ఆ ప్రేమమైకంలో కాలుజారాను. కాలు జారి రాజన్ చేతిలో చిక్కాను. మేం కలిసివున్నప్పుడు వాడు రహస్యంగా ఫోటోలు తీశాడు. రెండులక్షలిస్తే, ఫోటోలు పత్రికలకి ఎక్కకుండా నాకే దక్కుతాయని చెప్పాడు.

"నాకేమీ తోచలేదు! అంత డబ్బు ఎక్కడనుంచి తేవాలి?...వాడు తొందర చేస్తున్నాడు. ఇప్పటికి నెల రోజులు గడిచాయి. మరోవారం గడువిచ్చాడు. వాడికి డబ్బివ్వకపోతే, నా ప్రతిష్ట దెబ్బతినే ముందు ప్రాణాలు తీసుకోవాలనుకున్నాను. కానీ ... కానీ ...భూషణ్, నువ్వు ఆశాకిరణంలా కన్పించావు! నాకీ సహాయం చేసి పెట్టు—జీవితాంతం ఋణపడివుంటాను.''

భూషణ్ అంతా విని, "మీరు చెప్పేది ఎంతవరకు నిజం?'' అన్నాడు.

"ఎలా ఋజువు చెయ్యమంటావు?'' అడిగిందామె.

"బ్లాక్ మెయిలర్‌తో నేనే మాట్లాడాలి— నెంబర్ వుందా?''

వనజ రాజన్ ఫోన్ నెంబర్ చెప్పింది.

"ఓ.కే. మాడమ్, ఫోటోలు దక్కాలంటే డబ్బు తప్ప మరో మార్గంలేదా?"

"లేదు. ఫోటోలు బ్యాంకులో దాచాడు-వాడ్ని ఏమీ చెయ్యలేం!"

"సరే-ఇప్పుడు మీ కార్యక్రమం ఏమిటి?"

"నాకు రెండులక్షలు లభించేలా చేస్తే ఈ కిడ్నాప్ గురించి ఎవ్వరికీ చెప్పను-పోలీసులకి కూడా! నన్ను నమ్ము! నన్ను నువ్వు రక్షిస్తే, మిమ్మల్ని నేను రక్షిస్తాను."

"మంచిది. ఆ డబ్బుతో మీ రెక్కడికి కళతారు?"

ఒక్కక్షణం ఆలోచించి అంది వనజ, "బంజారా హిల్స్‌లో నా ఫ్రెండ్ లలిత వుంది. డబ్బు ఆమె దగ్గర దాచి ఆయన దగ్గరకెళ్తాను. తర్వాత మద్రాసు వెళ్ళాక డబ్బు తెప్పించుకుంటాను."

భూషణ్ కాస్సేపు ఆలోచించి తలూపాడు.

## 7

జయదేవ్ తప్పకుండా విమానంలో దిగుతాడని కిడ్నాపర్స్‌కి తెలుసు. నాగేష్ ఏర్‌పోర్ట్‌లో కాపుకాసి, సాయంత్రం నాలుగుగంటలకి విమానం దిగిన జయదేవ్‌ని వెంబడించి, అతనెక్కడ బసచేశాడో తెలుసుకున్నాడు.

జయదేవ్ చెప్పాచెయ్యకుండా హఠాత్తుగావచ్చి బస చేయడం హోటల్ వారిని ఆశ్చర్య పర్చింది. తన ఆగమనాన్ని ప్రచారం చెయ్యవద్దని జయదేవ్ వాళ్ళని వారించాడు. ఆ తర్వాత కిడ్నాపర్స్‌నుంచి ఫోన్‌కాల్ కోసం గదిలో అసహనంగా ఎదురు చూడసాగాడు...

సరిగ్గా ఆరుగంటలకి ఫోను మ్రోగింది.

జయదేవ్ సన్నగా వణుకుతూ రిసీవర్ ఎత్తాడు.

"గుడ్ ఈవెనింగ్ మిస్టర్ దేవ్!"

అవతలి కంఠం విని అతని గుండెవేగం హెచ్చింది.

"మిస్టర్ దేవ్, చెప్పినట్టు చేస్తున్నందుకు చాలా థాంక్స్."

"యస్?"

"రాత్రి సరిగా 11 గంటలకి బ్రీఫ్ కేసులో డబ్బుతీసుకుని టాక్సీలో టాంక్ బండ్ చేరుకోండి—లిబర్టీ వేపు నుంచి రండి. టాంక్ బండ్ మీద కుడివేపుకు రెండు ఫర్లాంగులు ప్రయాణిస్తే, ఎడమప్రక్కన ఒకచోట టార్చి వెలుగుతూ, ఆరుతూ కన్పిస్తుంది. అక్కడే బ్రీఫ్ కేసును టాక్సీలో వెళుతూనే జారవిడవండి—జాగ్రత్త, డ్రయివర్ కి తెలియకూడదు. ఆ తర్వాత తిన్నగా హోటల్ చేరుకొని భార్యకోసం కాచుకోండి. సరిగ్గా 12-00 కి ఆమె మీ దగ్గరకి వస్తుంది. మీరు చెయ్యవల్సిందంతే. అతి తెలివి ప్రదర్శించకండి! ఏమంటారు?"

"మీరలాటి మోసం చేయకపోతే అతి తెలివి ప్రదర్శించను. నాభార్య క్షేమంగా దక్కాలి మిస్టర్!" అన్నాడు జయదేవ్.

"క్షేమంగా దక్కుతుంది."

"ఒక అనుమానం—నాభార్య మీ బందీగా వుందని ఎలా నమ్మమంటావు మిస్టర్?"

అవతల నవ్వు, "మరో గంటలో మీతో ఫోనులో మాట్లాడుతుంది. సరేనా?"

"ఓ.కే." జయదేవ్ రిసీవర్ పెట్టేశాడు.

# 8

అనుకున్న సమయానికి పదినిమిషాలముందు, నిర్ణయించిన స్థలానికి చేరుకున్నారు: నాగేష్, సింగ్ లు.

అప్పటికి టాంక్ బండ్ మీద రద్దీ తగ్గింది. ఎవరి కంట బడకుండా ఇద్దరూ పక్కనేవున్న చెట్టెక్కి కూచున్నారు. నాగేష్ చేతిలో రివాల్వర్, సింగ్ చేతిలో టార్చి

వున్నాయి. పట్టు తప్పకుండా గట్టిగా కొమ్మలు పట్టుకుని కూర్చున్నారు.

లిబర్టీ నుంచి కుడివేపుకు టాంక్ బండ్ పైన రెండువాహనాలు మళ్ళాయి—కారు, దాని వెనుక జీపు. అవి దగ్గరవుతుండగా నాగేష్ ఉలిక్కిపడ్డాడు, "బాస్టర్డ్! పోలీసుల్ని తెస్తున్నాడు!"

సింగ్ భయపడ్డాడు.

వాహనాలు అంతకంతకు దగ్గరయ్యాయి...

నాగేష్ రివాల్వర్ సిద్ధంగా పట్టుకుని, టార్చి వెలిగించవద్దని సింగ్ కి చెప్పాడు.

కానీ, నాగేష్ వూహించనిది జరిగింది...

ఆరెండు వాహనాలు రివ్వుమని వాళ్ళని దాటిపోయాయి. ఆకారు టాక్సీకాదూ, దాని వెనక వున్నది పోలీసు జీపూ కాదు.

అతను నవ్వుకుని లేచుకునే లోపున, శరవేగంగా వస్తూ అదే దిశలో మరోకారు కన్పించింది.

"కళాధర్, రెడీ!"

కళాధర్ చటుక్కున టార్చి వెలిగించి రోడ్డుమీద వేశాడు. ఆ తర్వాత ఆర్పి మళ్ళీ వేశాడు. అలాగే అయిదారుసార్లు చేశాడు. ఈలోపు ఆకారు దాటిపోయింది. అది టాక్సీ అని నాగేష్ కి తెలుసు. దాటిపోయిన టాక్సీ లోంచి నల్లటి బ్రీఫ్ కేసు జారిపడి, రోడ్డుపైన చీకటిలో కలిసిపోయింది.

టాక్సీ అమిత వేగంతో దూసుకుపోయి కనుమరుగయింది.

"దూకేయ్!" అర్చాడు నాగేష్. మరుక్షణం ఇద్దరు దూకేశారు. కాళీధర్ గావుకేక పెట్టి వెల్లకిలా పడి

పోయాడు. నాగేష గభాల్న బ్రీఫ్ కేసు నందుకొని కళావర్ని పేవ్ మెంటు పైకి లాగాడు.

ఇంతలో వెనుక అడుగుల అలికిడితో బాటు అరుపు విన్పించింది:

"ఎవరక్కడ!"

నాగేష్ ఛటుక్కున వెనుదిరిగి చూసి అదిరిపోయాడు_ బీట్ కానిస్టేబిల్ లాఠీ వూపుకుంటూ వస్తున్నాడు.

"సింగ్! లే, పారిపోవాలి!"

కళావర్ లేవలేదు. మూలుగుతున్నాడు. నాగేష్ సహానం చచ్చిపోయింది.

"సింగ్! పోలీస్."

"నాగేష్...నాగేష్...నాకాలు..." కళావరన్నాడు అస్పష్టంగా.

"ఏమయ్యింది?"

"విరి...విరి...విరిగింది."

"బాస్టర్డ్" నాగేష్కి మార్గంతోచలేదు. కళావర్ని వదలి పారిపోదామనుకున్నాడు కానీ, వీడు పోలీసులకు చిక్కితే గుట్టంతా చెప్పేస్తాడు.

"ఏం జరిగింది మిస్టర్?"

ఉలికిపడి తలెత్తి చూశాడు నాగేష్. లాఠీ సిద్ధంగా పట్టుకుని వున్నాడు కానిస్టేబుల్. నాగేష్ బ్రీఫ్ కేసుని బలంగా పట్టుకొని ఛటుక్కునలేచి నిలబడ్డాడు.

"ఏమిలేదు! నువ్వెళ్ళు!"

కానిస్టేబిల్ కళ్ళు నాగేష్ మీద అనుమానంగా కదులుతున్నాయి.

"ఏయ్ మిస్టర్! బుకాయించకు! అతన్ని కొట్టి బ్రీఫ్ కేసు లాక్కున్నావు! నువ్వు దొంగవి!" ఛటుక్కున విజిల్ తీసి వూదాడు కానిస్టేబిల్.

ఒక్క క్షణం ఆలస్యం చెయ్యలేదు నాగేష్. విసురుగా చెయ్యెత్తి కానిస్టేబిల్ దవడకింద కొట్టి వెనక్కి నెట్టాడు. కానిస్టేబిల్ కిందపడి లాఠీ లేపాడు. నాగేష్ లాఠీ లాక్కుని విరిచేసి చెరువులోకి విసిరాడు. బూటుకాలు ఎత్తి బలంగా కానిస్టేబిల్ తలమీద తన్నాడు. కానిస్టేబిల్ తల వాల్చేశాడు. అతన్ని లాక్కెళ్ళి రెయిలింగ్స్‌కి ఆనించి కూచోబెట్టాడు నాగేష్.

ఆ తర్వాత కళావర్ దగ్గరికి వచ్చి అర్చాడు. "బాస్టర్డు! నీ వల్లనే ఇదంతా! లే!"

"కాదు, నీ వల్లనే! అంత ఎత్తునుంచి దూకమంటావా బద్మాష్!" బదులుగా కళావర్ కూడ అర్చాడు.

కళావర్ మాటలకి నాగేష్ ఇంకా రెచ్చిపోయాడు. "రాస్కెల్! లే, లేచి పరుగెత్తు!"

కళావర్ నీరసంగా లేచి నిలబడి, "నాగేష్, నా కాలు..." అన్నాడు.

నాగేష్ తనకి తెలిసిన భాషల్లో సమస్త బూతులన్నీ తిడుతూ, కళావర్‌ని భుజంమీద వేసుకుని, బ్రీఫ్ కేసు చేతబట్టుకుని గబగబ నడిచాడు. ఫర్లాంగు దూరాన బెంచిమీద అతన్ని ఎత్తేసి, "ఇక్కడే పడుకో, పది నిమిషాల్లో వస్తాను." అని వెనుదిరిగాడు.

దురదృష్టం! నిట్టూర్చాడు కళావర్. లక్షరూపాయలతో హార్యానా వెళ్ళి అయిదెకరాల పొలం, ట్రాక్టరు కొనుక్కుని కష్టపడి జీవించాలనుకున్నాడు. కానీ ఏం జరిగింది? కాలు విరిగింది! ఆ నాగేష్‌గాడు తానూహించని విధంగా జాతకాన్ని తల్లకిందుల చేశాడు!

పావుగంట గడిచాక నిగనిగ లాడుతున్న ఆకుపచ్చ అంబాసిడర్‌లో ప్రత్యక్షమయ్యాడు నాగేష్. "ఏయ్ బాస్టర్డు, కారెక్కు!"

"ఎక్కించు!" మొండిగా అన్నాడు కళావర్. నాగేష్ కారుదిగి వెనక సీటు తలుపు తెరిచి కళావర్‌ని ఎత్తి లోనికి తోశాడు. కళావర్ సీట్లో బోర్లా పడుకుని తిట్టుకున్నాడు. నాగేష్ కారు స్టార్టు చేశాడు.

"కా రెక్కడిది?" కళావర్ అడిగాడు.

నాగేష్ సమాధాన మివ్వలేదు. వేగంగా డ్రైవ్ చేస్తున్నాడు.

"ఆ పెట్టెలో వుంది డబ్బేనా?" మళ్ళీ అడిగాడు కళావర్.

"కాదు, చిత్తు కాయితాలు!"

"నా కాలు విరగ్గొట్టావు! అవి చిత్తు కాయితాలయినా, కరెన్సీ కాయితాలయినా నాకు ఉపయోగ పడవు! నా కలలన్నీ కాలరాచావు!"

నాగేష్ మాట్లాడలేదు.

అతని ఆలోచనలు వేరే విషయంమీద వున్నాయి.

కళావర్ కసురుకుంటూ మధ్య మధ్య మూల్గుతున్నాడు.

## 9

వనజ వాచీ చూసుకుని భూషణ్‌తో అంది: "ఇంతాలస్యం ఎందుకయింది? ఈపాటికి వచ్చివుండాల్సిందే!"

భూషణ్ ఒకసారి వనజని ఆపాదమస్తకమూ చూశాడు. ఆమె ముఖంలో ఆందోళన వుంది. నుదుటి మీద ముడతలేర్పడ్డాయి. చిన్నగా నవ్వి అన్నాడు, "బ్లాక్ మెయిలర్‌ని వదిలించుకున్నాక ఏం చేస్తారు? హేమరాజ్‌ని మర్చిపోతారా? లేక —"

వనజ చురచుర చూసింది: "నా ప్రశ్నకి జవాబు అదికాదు!"

బయట హారన్ మోగింది.

భూషణ్ ఉలికిపడి, "మీ ప్రశ్నకు జవాబు అది!" అనర్చాడు.

ఇద్దరూ లేచి బయటికి పరుగెత్తారు.

నాగేష్ కార్లోంచి దిగుతూ అర్చాడు, "బాస్టర్డ్! సక్సెస్!"

"యూ ఆర్ గ్రేట్ మైసన్!" ముందుకు వురికాడు భూషణ్.

కార్లో తొంగిచూసి గాభరాపడ్డాడు, "సింగ్ కేమయింది?"

"కాలు విరిగింది" బ్రీఫ్ కేసుతో ముందుకు నడుస్తూ అన్నాడు నాగేష్. "ఏయ్ బ్యూటీ, సక్సెస్!"

"నాలిక చీరేస్తాను!" అర్చింది వనజ, "డబ్బిలా తే!"

నాగేష్ ఆమె చెంపమీద చిటికలేసి, వెనక్కి తోసి, ఇంట్లోకి నడిచాడు. వనజ రివ్వున దూసుకవచ్చి అతని చెంప వాయించింది.

కత్తిపర్ని ఎత్తుకుని లోనికివచ్చిన భూషణ్ గాభరాగా అర్చాడు, "మైసన్! సిస్టర్నేం చేస్తున్నావ్?"

నాగేష్ వనజని క్రూరంగా చూశాడు, "నన్ను కొట్టినందుకు నేనేం చేయగలనో తెలుసా? ఈ డబ్బుతో బయటికి నడిచేయగలను!"

వనజ విస్తుపోయింది.

నాగేష్ నవ్వాడు, "భయపడకు! అలా చెయ్యను. నేను భూషణ్ కి మాటిచ్చాను—నీపైని ఎలాంటిదౌర్జన్యం చెయ్యననీ, రక్షించడానికి ప్రయత్నిస్తాననీ. నే నిప్పుడు మంచివాడ్ని! హ...హ."

వనజ ఆశ్చర్యంగా చూసిందతన్ని, "క్షమించు—అలాగే నన్ను గౌరవించడం నేర్చుకుంటావా?"

"గౌరవం!" ఆశ్చర్యపోయాడు నాగేష్, "ఆడ వాళ్ళని గౌరవించడం నాకు తెలీదే! ఆ పని సింగ్ చేస్తాడు. సింగ్ బహెన్‌జీసే మర్యాద్ కరో!"

భూషణ్ బ్రీఫ్‌కేసు తెరిచి డబ్బు లెక్కబెట్టాడు—అన్నీ వందరూపాయల కట్టలు. ఒక్కో కట్టకి వంద కాయితాలు చొప్పున మొత్తం యాభై కట్టలున్నాయి. వాటిని వాటాలవారీగా వేరుచేసి తృప్తిగా నవ్వుకున్నాడు.

విరిగిన కాలితో నేలమీద పడున్న కళాధర్, డబ్బును చూసి ఉన్నట్టుండి ఏడ్పు ప్రారంభించాడు.

"షటప్!" అరిచాడు భూషణ్, "మాడమ్, అనుకున్న పని జరిగింది. మీకీ సహాయం చేస్తున్నందుకు నాకు సంతోషంగా వున్నా, ఏదో అసంతృప్తిగా వుంది... మాడమ్, ఈ బ్లాక్ మెయిల్ నుంచి మీరు బయట పడగలరా?"

"ఆ డబ్బు వాడికిస్తే నెగెటివ్స్, ఫోటోలు నాకిచ్చేస్తాడు." అంది వనజ నమ్మకంగా, "భూషణ్, నీకు చాలా ఋణపడి వున్నాను. నీ సహాయం జన్మలో మరువలేను!"

భూషణ్ తృప్తిగా నవ్వుకుని వూరుకున్నాడు.

వనజ వాటా రెండు లక్షల్ని తన ఆకుపచ్చ ఏర్ బ్యాగులో పెట్టి, జిప్ లాగి ఆమె కందించాడు. వనజ బ్యాగు, తన సూట్‌కేసు తీసుకుని బయలుదేరడానికి సిద్ధమయింది.

"విష్యూ గుడ్‌లక్, మాడమ్," భూషణ్ ఉద్వేగంగా చెయ్యివూపాడు.

"నాతో ఎవరొస్తారు?" అడిగింది వనజ.

భూషణ్ కళాధర్‌ని చూశాడు-మూల్గుతున్నాడతను.

ఆ తర్వాత నాగేష్‌ని చూసి, "నాగేష్—మాడమ్‌ని వదిలి పెట్టిరా! జాగ్రత్త, నువ్వు నాకు మాటిచ్చావు!" అన్నాడు.

నాగేష్ అదోలా నవ్వి వనజ వెంట నడిచాడు.

# 10

"రిలాక్స్, మిస్టర్ దేవ్, రిలాక్స్." ఇన్‌స్పెక్టర్ శివనేశన్, దేవ్‌ని శాంతపరిచి తీసికెళ్ళి వనజ శవాన్ని చూపించాడు. ప్రశాంతంగా నిద్రపోతున్నట్టు కన్పిస్తోన్న వనజ దేహంమీదపడి రెండు నిమిషాలు రోదించాడు దేవ్.

ఆ తర్వాత మనసు రాయి చేసుకుని ఇన్‌స్పెక్టర్‌తో బయటికి వచ్చాడు.

"మిస్టర్ దేవ్, ఏమిటిదంతా? ఎలా జరిగింది?" అడిగాడు శివనేశన్.

"నాకేమీ తెలియదు! రెండు రోజులుగా ఆమెని చూడలేదు!"

శివనేశన్ ఆశ్చర్యపోయాడు.

"ఐ రిగ్రెట్ వెరీ మచ్, మిస్టర్ దేవ్. ఇది చాలా దారుణం. మాకేమీ అర్థంగావడం లేదు! ఆమె బంజారా హిల్స్ కెందుకెళ్ళిందో మీకు తెలుసా?"

జయదేవ్ అడ్డంగా తలూపాడు.

"మిసెస్ లలితకూడా తెలియదట. బహుశ కలుసుకోడానికి వచ్చిందేమో అంది. ఆశ్చర్యమేమిటంటే ఆమె ఇంటి గేటు దగ్గరే మీ భార్య హత్య చెయ్యబడింది."

"మిసెస్ లలిత ఎవరూ?"

"మీకు తెలియదా? మీ భార్య ఫ్రెండ్. రాత్రి

మీ భార్య లలితను కలుసుకోడానికి వెళ్ళింది. అయితే గేటుదగ్గరే ఆమెనెవరో చంపేశారు. ఆమె శవం ఉదయం ఎదురింటివాళ్ళకి కన్పించింది. మిసెస్ లలిత ఏమీ చెప్పలేకపోతోంది.''

''ఎక్కడుందామె?''

''ఇంటిదగ్గర. తామిద్దరు చాలా స్నేహంగా వుంటామని చెప్పిందామె. వనజ హైద్రాబాదుకి వచ్చినట్టు ఆమెకి తెలుసట—కౌసల్యాదేవి సన్మానసభలో కలుసుకుందట—అదే చివరిసారి చూడటం.''

జయదేవ్ మాట్లాడలేదు. శివనేశన్ నిశ్శబ్దంగా చూస్తున్నాడు.

ఇంతలో గది బయట అలజడి రేగింది.

ప్రెస్ రిపోర్టర్స్ లోనికి ప్రవేశించడానికి అభ్యంతరం చెబుతున్న ఇన్స్పెక్టర్ దేవిడ్‌తో వాగ్వివాదానికి దిగారు. తీవ్రమైన అరుపులు, కేకలు విన్పిస్తున్నాయి. శివనేశన్ లేచి బయటికి వెళ్ళాడు.

''మిస్టర్ దేవ్, మీ భార్య మీతో చెప్పి వెళ్ళలేదా?'' దేవరాజ్ అడిగాడు.

''లేదు. రెండు రోజులనుంచి నేనామెని చూడలేదు.''

ఆశ్చర్యపోయాడు దేవరాజ్, ''అంటే?''

''ఆమెని కిడ్నాప్ చేశారు.''

''వాట్!''

''ఆమెని కిడ్నాప్ చేశారు.'' మళ్ళీ చెప్పాడు జయదేవ్. దేవరాజ్ తేరుకోకముందే జరిగిందంతా వివరంగా చెప్పేశాడు. ప్రెస్ రిపోర్టర్స్‌ని శాంతపరచి తిరిగివచ్చిన ఇన్స్పెక్టర్స్ ఆశ్చర్యంగా విన్నారు.

అంతా విని, ప్రశాంతంగా సిగరెట్ వెల్గించి, బల

హీనంగా నవ్వి అన్నాడు దేవరాజ్: "ఆశ్చర్యంగా వుంది! మిస్టర్ దేవ్, అపాయంలో చిక్కుకున్నప్పుడు పోలీసుల సహాయం కోరకపోవడం తమని తాము మోసం చేసుకోడమే! మీరెందుకలా చేశారు?"

"వనజ క్షేమంకోసం...అలా చేస్తే ఆమె క్షేమంగా వుంటుందనీ, అందుకు బదులు పోలీసుల్ని దించితే వుండదనీ హెచ్చరిక చేశారు. ఎటువంటి పరిస్థితిలోనైనా ఆమెని దక్కించుకునేందుకు ఎంత డబ్బయినా ఇవ్వడానికి సిద్ధపడ్డప్పుడు, మధ్య పోలీసులెందుకు? కానీ ఇంత మోసం జరుగుతుందనుకోలేదు కమీషనర్!"

దేవరాజ్ మౌనంగా ఆలోచించాడు, "ఇందులో ఒక విషయం అర్థంగావడంలేదు. కిడ్నాపర్స్ విడుదల చేశాక ఆమె మిమ్మల్ని కలుసుకోకుండా లలితదగ్గరికెందుకెళ్ళింది? మీ రిక్కడ వున్నట్టు ఆమెకి తెలియదా?"

"తెలుసు. నిన్న సాయంత్రం నాతో ఆమె ఫోన్‌లో మాట్లాడింది."

అప్పుడే దేవరాజ్ మెదడులో ఓ మెరుపు మెరిసింది.

# 11

"దట్సాల్ మిస్టర్ మోహన్, వనజ హత్య చెయ్యబడ్డంతో కథ కొత్త మలుపు తిరిగింది." అన్నాడు ఆత్మారాం, "నువ్వు చక్కగా ఫాలో అవుతున్నావా? డౌట్స్ ఏమీ లేవుకదూ?"

ఏమీ లేవని చెప్పాను.

"వెరీగుడ్! నా శ్రోతలంతా నీలాటి వాళ్ళయితే ఎలాటి ఇబ్బందులూ వుండవు." బేరర్ తెచ్చిన టీ కప్పు అందుకుని నవ్వాడు ఆత్మారాం.

"చాలా రాత్రయినట్టుంది, కథ త్వరగా ముగిం
చేద్దాం. ఆల్ రైట్, మిస్టర్ మోహన్, వనజ హత్య
విషయం రేడియోలో విని భూషణ్ పిచ్చివాడిలా
ఇల్లంతా గంతులేస్తూ చిందరవందర చేశాడు. ఇది
ఆయనకి అనుకోని షాక్. రాత్రి వనజని వదిలిపెట్టి
వచ్చిన నాగేష్ ఉదయం ఆమె హత్య విషయం విని
అదిరిపోయాడు. భూషణ్, నాగేష్ని పట్టుకుని కసిదీరా
బాదాడు.

నాగేష్ తనకేమీ తెలియదని ఎంత అర్చినా
భూషణ్ విన్లేదు. కళావర్ కాలు విరగ్గొట్టుకుని అచే
తనంగా పడివున్నాడు. నాగేష్ అలా చేసే అవకాశం
లేదని కళావర్ అన్నప్పుడు భూషణ్ ఇంకా రెచ్చి
పోయాడు.

నాగేష్ వనజని చంపేశాడని భూషణ్కి నమ్మకంగా
తెలుసు. రాత్రి కళావర్ని అంత ఎత్తు చెట్టుమీంచి
దూకమన్నదెందుకు? ఏ చెయ్యో, కాలో విరిగితే అప్పు
డతను నాగేష్తో వనజకి తోడుగా వెళ్ళే అవకాశం
వుండదు! అవునా? నాగేష్ వనజతో ఒంటరిగా వెళ్ళి
ఆమె పైన దౌర్జన్యం చేసి, చంపేసి, డబ్బు కాజెయ్య
వచ్చు!

"మిస్టర్ మోహన్- భూషణ్ ఆలోచన సబబైనదే.
కానీ ఆ విషయం నాగేష్ ససేమిరా ఒప్పుకోలేదు.
మొదట వనజని చూసినప్పుడు తనకి దురుద్దేశ్యం పుట్టిం
దనీ, కానీ, తర్వాత భూషణ్కి మాట ఇచ్చినప్పుడు
ఆ ఆలోచన తుడిచేసుకున్నాడనీ అతను వాదించాడు.
వాగ్వివాదాలు పెరిగి, పరిస్థితి ఇంకా విషమించింది.

భూషణ్ తప్పుడు ఆరోపణలు చేస్తూ కొడుతోంటే
నాగేష్ అప్పటివరకూ సహించాడుగానీ, ఆపైన అతని

వల్ల కాలేదు_కింద పడేసి చిత్తుగా తన్నాడు. భూషణ్ డొక్కలో బలంగా దెబ్బలు తగిలి మూల్గసాగాడు.

"సరే_జరిగిందేదో జరిగింది, నాగేష్ వనజని చంపి వుంటే వుండవచ్చుగాక! డబ్బు కాజేస్తే కాజేసివుండ వచ్చు! అయితే ప్రస్తుత పరిస్థితి ఏమిటి? భూషణ్ ఆలోచించాడు: ఇంకా ఈ సిటీలో వుండటం క్షేమం కాదు. తక్షణం పారిపోవాలి. అయితే కళావర్ పరిస్థితి తీవ్రంగా వుంది. తగిన వైద్యంలేక బాధపడు తున్నాడు. అతనితో ఎలా పారిపోయేది? పోనీ, వాటాలు పంచుకుని ఎవరిదారిన వాళ్ళు విడిపోతే? ఈ ఆలోచన సబబుగా తోచింది.

"కానీ, నాగేష్‌కి నచ్చలేదు. ప్రస్తుతం ఇల్లు కదిలి బయటికి వెళ్ళడం చాలా ప్రమాదమని చెప్పాడు. రాత్రి తను కానిస్టేబిల్‌ని కొట్టినట్టూ, ఆ కానిస్టేబిల్ తనని తప్పకుండా గుర్తుపెట్టుకుని వుండవచ్చనీ, పోలీసు రికార్డ్స్‌లో తన ఫోటోలున్నాయనీ—ఆ ఫోటోలు ఈపాటికి పత్రికల్లో వచ్చివుంటాయనీ చెప్పి భూషణ్‌ని అదరగొట్టాడు.

నాగేష్ కానిస్టేబిల్‌ని కొట్టాడని తెలిసి భూషణ్ తిట్టని తిట్టులేదు—అంతకంటే ఆ నీరసంలో ఏమీ చేయలేకపోయాడు. పరిస్థితులు చక్కబడ్డాక ముగ్గురూ కలిసి సిటీ వదిలి వెళ్ళిపోవచ్చని నాగేష్ చెప్పాడు. తప్పకుండా ఈపాటికి పోలీసులు రహదారులన్నిటినీ కాపలా కాస్తూండవచ్చు. ఇలాటి పరిస్థితిలో బయటి కెళ్ళడం ప్రమాదకరం. అయితే మరొక భయంకర మైన ఆలోచన వచ్చింది. పత్రికల్లో ప్రజటనలు చూసి ఈ ఇల్లు అద్దెకిచ్చిన ఆసామి పోలీసుల దగ్గరికెళ్ళడు కదా?

"ఈ అనుమానంతో భూషణ్ వెంటనే సిటీలోకి బయలుదేరాడు. ఇంటి యజమానిదగ్గరికెళ్ళి అతనికేదో సాకు చెప్పి, అతని స్కూటర్ మీద హయత్ నగర్కి తీసుకొచ్చాడు. ఇంట్లోకి రాగానే ఆ ఆసామిని నాగేష్ కట్టేసి కిచెన్లో పడేశాడు. పరిస్థితి చక్కబడి తాము పారిపోయేవరకు అతన్నలాగే వుంచాలని తీర్మానించుకున్నారు.

"మిస్టర్ మోహన్, కిడ్నాపర్స్ ఆ తర్వాత నిశ్చింతగా విశ్రాంతి తీసుకున్నారు. బ్లాక్ మెయిల్ డబ్బు మూడు లక్షలు బ్రీఫ్ కేసులో పెట్టి బీరువాలో దాచారు.

"వనజ హత్య విషయం సిటీ అంతటా ప్రాకి సంచలనం కల్గించింది. ఆరోజు స్టూడియోలు, థియేటర్లు మూసివేయబడ్డాయి. అవుట్ డోర్ యూనిట్లు రద్దుచేసుకున్నాయి. మద్రాసులోకూడ యావద్ సినీ ఫీల్డు మూతబడింది. జయదేవ్ కోసం మద్రాసు ప్రముఖులు గాలించి, చివరికి హైద్రాబాదు కెళ్ళాడని తెలుసుకుని, వెంటనే చేతికందిన వాహనాలెక్కేశారు...

"మిస్టర్ మోహన్, ఉదయం పదిగంటలయేసరికి పోలీసులకి కేసు పూర్తిగా బోధపడింది... నాగేష్ అనుమానించినట్టు అతని ఫోటోలుగాక, కళేబర్ ఫోటోలు కూడా పత్రికలకి, ఈవినింగ్ ఎడిషన్స్కోసం విడుదల చేశారు. సిటీని అన్ని రహదారులవద్దా కాపలా ఏర్పాటు చేశారు. రేడియోద్వారా హంతకుల ఆనవాలు తెలియజేశారు. టెలివిజన్ ప్రత్యేక ప్రసారాల్లో ఫోటోల్ని ప్రదర్శించారు.

"అయితే హంతకులు ఇంకా సిటీలోనే వున్నారన్న నమ్మకం పోలీసులకి కలగడంలేదు—రాత్రి పారిపోయి

వుండవచ్చు. అయినా ముందు జాగ్రత్తకోసం ఈ తతంగం ప్రారంభించక తప్పలేదు. వెల్, ఇక పోలీసులు కిడ్నాపర్స్‌ని ఎలా పట్టుకున్నారో చెప్తాను.”

## 12

హైద్రాబాదులో నాగేష్ ఎవరో తెలియనివారు అరుదు. ప్రత్యక్షంగా చూడకపోయినా అతనిగురించి విననివారుండరు. ఒకప్పుడు—ఇరవైయేళ్ళ వయసులో సిటీలో స్త్రీలని గడ గడలాడించిన కిరాతకుడు.

అనేకసార్లు పోలీసులు అతన్ని అరెస్టు చేసి నిర్బంధించారు. ఇప్పుడతని అఘాయిత్యాలు ఉధృతం తగ్గినా, క్రయిం బ్రాంచిలో మాత్రం అతనిగురించి ప్రత్యేక ఫైలు వుంది.

కాబట్టి, గతరాత్రి టాంక్ బండ్ మీద కానిస్టేబిల్‌ని గాయపర్చిందెవరో తెలుసుకోడం పోలీసులకు కష్టమేమీ కాలేదు. కాన్‌స్టేబిల్ చెప్పిన మరో ఆనవాల ప్రకారం కళాధర్ సింగ్ కూడ బయటపడ్డాడు...

ఉదయం వనజ శవం కనుగొన్న తరువాత, జయదేవ్ స్టేట్‌మెంట్ విని, పోలీసులు ఒక నిశ్చయానికి వచ్చారు. టాంక్ బండ్ మీద రాత్రి జరిగిన సంఘటనకీ, వనజ కిడ్నాపింగ్ కీ—నాగేష్, కళాధర్‌లతో సంబంధం వుంది. కాబట్టి, వాళ్ళ ఫోటోలు పత్రికలకిచ్చి ఆగంతకుల వేట ప్రారంభించారు.

ముందుగా పోలీస్ డిటెక్టివ్‌లు—శివశేఖర్, దేవిడ్‌లు నాగేష్ నివాస మీద రెయిడ్ చేశారు. పంజగుట్టలో వున్న నాగేష్ ఇల్లు తాళం వేసివుంది. ఆ ప్రాంతాల వున్న అతని అనుచరుల్ని పట్టుకుని విచారించారు. అప్పుడొక ఆసక్తికరమైన విషయం బయటపడింది.

నాలుగు రోజులక్రితం ఎవరో పొడవాటి మనిషివచ్చి నాగేష్‌ని తీసికెళ్లాడట. తిరిగి అతను అర్ధరాత్రి ఇంటికి వచ్చాడట. ఆ తర్వాత తరచు బయటికెళ్లేవాడట. అయితే రెండు రోజులక్రితం సాయంత్రం వెళ్ళి ఇంత వరకు తిరిగిరాలేదట.

స్టేట్‌మెంట్ ఇచ్చిన ముగ్గురు అనుచరులు నాగేష్ కోసం వచ్చిన మనిషి ఆనవాలు చెప్పారు.

ఆ ముగ్గుర్ని హెడ్‌క్వార్టర్స్ తీసికెళ్ళి అలాంటి పోలికలున్న కొన్ని ఫోటోలు చూపించారు.

ఎంతో తర్జనభర్జన చేసుకున్న పిమ్మట, ఆ ముగ్గురు ఒక ఫోటో ఎన్నుకుని అదేనని చెప్పారు.

ఆ ఫోటోలోవున్న మనిషి మాస్టర్ ఫోర్జర్. పేరు శాంతిభూషణ్. అనేకసార్లు ఫోర్జరీ కేసులమీద జెయిలు కెళ్లాడు...

వెంటనే ఇన్‌స్పెక్టర్స్ భూషణ్ అడ్రసు ప్రకారం ఇంటికెళ్లారు. తాళం వేసివుంది. ఎక్కడికెళ్లారో ఎవరూ చెప్పలేకపోయారు. ఇన్‌స్పెక్టర్స్ ముగ్గురు అగంతకుల ఇంటివద్దా మఫ్టీలో తమ మనుషుల్ని నియమించారు. ఆ తర్వాత భూషణ్ ఫోటోకూడా పత్రికలకిచ్చారు.

అయితే కిడ్నాపర్స్ ఇంకా సిటీలోనే వున్నారన్న నమ్మకం పోలీసులకి కలగడంలేదు. హత్య జరిగిన వెంటనే రాత్రి పారిపోయి వుండవచ్చు—అయితే, ముందు జాగ్రత్తకోసం తీసుకోవలసిన చర్యలన్నీతీసుకోసాగారు. వాళ్ళ ఆశలన్నీ ఆ ఫోటోలమీదే వున్నాయి. కిడ్నాపర్స్ ఆచూకీ తెలిపే సమాచారం అందితే వెంటనే రంగంలో దిగడానికి బలగాన్ని సిద్ధంగా వుంచారు.

సాయంత్రం ఆరుగంటలయేసరికి జంటనగరాల్లో కల

కలం బయలుదేరింది. పత్రికల్లో పతాక శీర్షికలో వార్త, ఫోటోలు, సంభ్రమాశ్చర్యాల్ని కల్గించాయి. నాగేష్–కళాధర్–భూషణ్ ఫోటోలకింద ప్రకటించిన బహుమతి ప్రతిఒక్కరినీ పగటి కలలు కనేలా చేసింది...

కొద్దిపాటి డిటెక్టివ్ సాహిత్యంతో పరిచయంవున్న వారితోసహా, స్టేటస్ కోసం ఇంగ్లీషు సినిమాలు చూసే వాళ్ళంతా రంగంలో దూకారు. పర్యవసానం: ట్రాఫిక్ కి అడ్డదిడ్డంగా పరుగెత్తి కాళ్లు చేతులు విరగ్గొట్టుకున్నారు.

ఏ. సి. దేవరాజ్ ఇన్ స్పెక్టర్స్ శివనేశన్, డేవిడ్ లు ఆఫీసులో అసహనంగా కాచుకుని ఫోన్ కాల్స్ కోసం ఎదురుచూస్తున్నారు. కానీ ఒక్కసారికూడా ఫోను మోగలేదు...ఎంతో ఓపిక తెచ్చుకుని కాఫీలు తాగుతూ కాలక్షేపం చేస్తున్నారు.

సరిగ్గా ఏడు గంటలకి ఫోను మోగింది.

గణగణమని ఫోను మోగుతోంటే, ఇన్ స్పెక్టర్స్ చేతుల్లో కాఫీ కప్పులు గజగజ వణికాయి...

దేవరాజ్ రిసీవర్ ఎత్తాడు ఉత్సాహంగా.

“యస్, ఏ. సి. దేవరాజ్ హియర్.”

“నమస్తే కమీషనర్! నా పేరు విమల. అంబర్ పేటలో వుంటున్నాను. మీరు దయచేసి వెంటనే మా యింటికి వస్తారా?” అని చకచక అడ్రను చెప్పింది అవతలి కంఠం.

దేవరాజ్ ఉలికిపడ్డాడు, “హల్లో, ఏమిటి మీరనేది! కిడ్నాపర్స్ గురించి మీకు తెలుసా?”

“అవును.”—అన్న మాటలతో లైను కట్ అయింది.

దేవరాజ్ చటుక్కున లేచి బయటికెళ్ళాడు. అతని

వెనుక ఇన్‌స్పెక్టర్స్ పురికారు. ముగ్గురూ బయటికి వచ్చి కారెక్కి అంబర్‌పేటకు ప్రయాణమయ్యారు.

దారిలో దేవరాజ్ హెచ్చరించాడు: "జాగ్రత్త! ఇందులో మోసం వుండవచ్చు...రివాల్వర్స్ సిద్ధంగా వుంచుకోండి."

అంబర్‌పేటలో విమల ఇల్లు చేరుకుని కారు దిగారు. ఇంట్లోంచి ఒక యువతి పరిగెత్తికొచ్చింది. దేవరాజ్ ఆమెని తీక్షణంగా చూశాడు: వివాహిత.

"మీరేనా విమల?"

"లోనికి రండి" అందామె.

ముగ్గురూ జాగ్రత్తగా లోనికి నడిచారు, డేవిడ్ కాంపౌండ్‌లో, శివనేశన్ గుమ్మంలో నిలబడిపోయారు. దేవరాజ్ ఆమెతో ఇంట్లోకి నడిచాడు.

"ఎందుకు పిల్చారు?"

"ఆ మనిషిని చూశాను."

"ఏ మనిషిని?"

"భూషణ్‌ని."

"ఎక్కడ వున్నాడు?"

"తెలియదు—ఉదయం రెడ్డిగారింటికొచ్చాడు!"

"రెడ్డిగారెవరు?"

"రమణారెడ్డిగారు. ఆ ఎదురిల్లు ఆయనదే-పేపర్లో చూసిన ఫోటోకీ ఆ మనిషికీ తేడా లేదు—అతనే!"

"ఎందుకొచ్చాడు? మీరెలా చూశారు?"

"ఉదయం పదకొండు గంటలకి నేను డాబామీద బట్టలు ఆరేస్తున్నాను. అప్పుడీ మనిషిని చూశాను— రెడ్డిగారింటి కొచ్చాడు. కాస్సేపయ్యాక ఇద్దరూ బయటికి వచ్చి స్కూటర్ మీద ఎక్కడికో వెళ్లారు!"

"ఎక్కడికి?"

"ఏమో?"

"ఇప్పుడింట్లో ఎవరున్నారు?"

"ఎవరూ లేరు—వేసవి సెలవులుకదా, భార్యాపిల్లలు వూరికెళ్ళారు."

"రెడ్డిగారు ఉదయంనుంచీ ఇంటికి రాలేదా?"

"నాకు తెలిసినంతవరకు రాలేదు."

"భూషణ్ని అంతకుముందు చూశారా?"

"లేదు."

దేవరాజ్కి మెరుపులాంటి ఆలోచన వచ్చింది.

"రెడ్డిగారికి సిటీలో ఇంకా ఇళ్ళున్నాయా?"

"ఎందుకు లేవు? వున్నాయి—నాంపల్లీలో ఒకటి, హాయత్ నగర్లో ఒకటి." అని అడ్రసులు చెప్పిందామె.

దేవరాజ్ కళ్ళు మెరిసాయి.

"థాంక్యూ మాడమ్! చాలా సహాయం చేశారు! ప్రకటించిన బహుమతి ఎవరి దనుకుంటున్నారు? మీదే!"

"నిజంగా?"

దేవరాజ్ ఛటుక్కున బయటికి వచ్చి ఇన్స్పెక్టర్తో కారెక్కాడు.

"గుడ్లక్! బాస్టర్డ్స్ ఇప్పుడు చిక్కారు! డేవిడ్, మనం హాయత్నగర్ వెళ్ళాలి. కారు స్పీడుగా డ్రైవ్ చెయ్యండి—అడ్రసు చెప్తాను."

కారు స్టార్టయి దూసుకెళ్ళింది.

"సర్! మనం ముగ్గురం వాళ్ళని ఎదుర్కోగలమా?" శివనేశన్ అడిగాడు.

"ఫ్లయింగ్ స్క్వాడ్స్కి మెసేజ్ ఇవ్వండి—పావు

గంటలో హాయత్‌నగర్ చేరుకోమని. అక్కడనుంచి మనం మెరుపు దాడి జరపాలి!''

శివనేశన్ వెంటనే దేవరాజ్ ఆదేశాన్ని వైర్‌లెస్‌లో పూరేశాడు.

నాంపల్లీ ఇంటికంటే, హాయత్‌నగర్ ఇల్లు కిడ్నాపింగ్‌కి అనువైనదని దేవరాజ్‌కి తెలుసు. పది నిమిషాల్లో కారు హాయత్‌నగర్‌లో ఒక పెట్రోలు బంకుముందాగింది.

ముగ్గురూ కారు దిగి చుట్టూ కలియజూశారు. పెట్రోలు బంకు ఎడమవేపు వెళ్ళేదారిలో అరమైలు దూరాన వుందా ఇల్లు. చీకట్లో ఏమీ కన్పించడంలేదు. మరో పదినిమిషాల్లో ఒకదాని తర్వాత ఒకటి, కార్లూ జీపులూ అక్కడికి చేరుకున్నాయి.

దేవరాజ్ చకచక ఆర్డర్స్ జారీచేశాడు. వాహనాల్ని హైవే మీదే వదిలేసి, దాదాపు వందమంది ఇన్స్‌పెక్టర్స్ కానిస్టేబిల్స్, ఆయుధాలు పట్టుకుని కాలి నడకన వెళ్ళారు.

చకచక నడిచి పదినిమిషాల్లో ఆ ఇంటిని చేరుకున్నారు. ఇంటిచుట్టూ వలయాకారంలో ఆక్రమించుకుని, ఆయుధాలు గురిపెట్టారు.

దేవరాజ్ చూశాడు: దీపాలు వెలుగుతున్నాయి. ఇంట్లో శబ్దంలేదు. తెరిచివున్న కిటికీలోంచి ఒక ఆకారం అటూ ఇటూ తిరుగుతూ కన్పిస్తోంది.

దేవరాజ్ ఇన్స్‌పెక్టర్స్‌కి సైగచేసి ముందుకెళ్ళాడు. తలుపు చేరుకుని, రివాల్వర్ సిద్ధంగా పట్టుకుని తట్టాడు. సమాధానంలేదు. మరోసారి తట్టాడు. లోపల అలికిడి, గుసగుసలు విన్పించాయి...

కొన్ని క్షణాలతర్వాత హఠాత్తుగా తలుపు తెరుగు

గొంతులో దేవరాజ్ అర్చాడు, "హోల్డప్! దిసీజ్ పోలీస్!"

భూషణ్ కొయ్యబారిపోయాడు.

నాగేష్ చేతిలో రివాల్వర్ జారిపడింది.

కళాధర్ గట్టిగా కేకపెట్టి మూర్ఛపోయాడు.

పోలీసులు ఇంట్లో జొరబడి తమ తతంగం ప్రారంభించారు.

కిచెన్‌లో కట్టిపడేసి వున్న ఇంటి యజమాని పోలీసుల్ని చూసి ఆనందంతో మూల్గాడు.

## 13

మర్నాడు ఉదయం కమీషనర్ కార్యాలయంలో దేవరాజ్, పబ్లిక్ ప్రాసిక్యూటర్, ఇన్‌స్పెక్టర్స్, పట్టుబడ్డ కిడ్నాపర్స్‌తో సహా జయదేవ్ హాజరయ్యారు.

భూషణ్ ఇచ్చిన స్టేట్‌మెంట్ పోలీసులు రికార్డ్ చేశారు. అతని వాఙ్మూలం పోలీసులనెంతో ఆశ్చర్యపర్చింది.

వనజ హత్య వెనకవున్న రంగం అందరినీ విస్మయం కల్గించింది. ఆమె రహస్యంగా ప్రేమ వ్యవహారం నడిపి, బ్లాక్‌మెయిల్‌లో ఇరుక్కుందని తెలిసి, జయదేవ్ ముఖం అవమానంతో కందిపోయింది...తల వంచుకుని కనిగా పళ్ళు నూరాడు.

జయదేవ్ నుంచి సంపాదించిన డబ్బులో రెండు లక్షలు వనజకిచ్చినట్టూ, మిగిలిన డబ్బు తనదగ్గర వున్నట్టూ భూషణ్ చెప్పాడు. కిడ్నాపర్స్‌దగ్గర పోలీసులకి దొరికిన డబ్బులో మూడు లక్షలకి కొన్ని వందలు తక్కువ వున్నాయి.

మిగతా రెండు లక్షలు వనజదగ్గర వున్నాయి కాబట్టి, నాగేష్ ఆమెని చంపేసి దాచేశాడని భూషణ్

ఆరోపించాడు. ఆమె హత్య నాగేష్ తప్ప ఎవరూ చేసే వీలు లేదని వాదించాడు. నాగేష్ కన్పించిన స్త్రీని వదిలే రకం కాదని, వనజమీద దౌర్జన్యం జేసి చంపాడనీ చెప్పాడు.

అయితే, పోస్ట్‌మార్టమ్‌లో శీలానికి సంబంధించినంత వరకు వనజమీద ఎలాటి దౌర్జన్యం జరగలేదని తేలింది.

ఈ విషయం విని భూషణ్ అరిచాడు: "కాదు, సార్! ఆమెని నాగేష్ ఒక్కడే చంపాడు! పథకం ప్రకారం చంపాడు! వాడి వెంట రావలసివున్న కళాధర్ కాలు విరగ్గొట్టాడు. ఎందుకు? వనజతో ఒంటరిగా వెళ్ళి—"

"షటప్!" నాగేష్ అడ్డు తగిలాడు, "వనజని చంపాలనే ఆలోచన నాకుంటే, కళాధర్ నా వెంట వచ్చినా చంపేసేవాడ్ని! నేను వనజని చంపలేదు— సార్, నా రికార్డు మీదగ్గర వుంది. ఒక్కసారి పరిశీలించండి—పెళ్ళయిన స్త్రీల జోలికి నేనెప్పుడయినా వెళ్ళానా?"

"వనజని నువ్వెక్కడ వదిలిపెట్టావు?" దేవరాజ్ అడిగాడు.

"వీధి మలుపుదగ్గర. ఆమె కారుదిగి నడిచి వెళ్ళింది!!

"ఆమె వెంట ఎవరేనా వెళ్ళారా?"

"లేదు."

"నువ్వెక్కడ ఎంతసేపు వున్నావు?"

"వెంటనే తిరిగి వచ్చేశాను."

"అవును—వెంటనే తిరిగి వచ్చేశావు—ఆమె శవాన్ని అక్కడ పడేసి—కదూ?"

నాగేష్ అవాక్కయిపోయాడు.

దేవరాజ్ క్రూరంగా చూశాడు. "రాస్కెల్! నువ్వు నిజం చెప్పకపోతే చావుదెబ్బలు తింటావు! చెప్పు, వనజని దార్లో ఎక్కడో చంపేసి, శవాన్ని బంజారా హిల్స్‌లో పడేసి వచ్చావుకదూ?"

నాగేష్ గుటకలు మింగాడు.

భూషణ్ అతన్ని కసిగా చూశాడు. "అంతే సార్! అదే జరిగింది! ముమ్మాటికీ వాడే చంపాడు!"

"లేదు, నేను చంపలేదు! నాకేమీ తెలియదు! నన్నేం చేస్తారో చేసుకోండి! కొట్టండి, చంపండి,... మీ ఇష్టం! నేను చెప్పేది మాత్రం ఒక్కటే! ఆమెని నేను చంపలేదు!"

దేవరాజ్ అసహనంగా అర్చాడు, "గెట్ దిస్ బిచ్ అవుటాఫ్ హియర్!"

మరుక్షణం దేవిడ్‌తో భూషణ్, నాగేష్, కళాధర్‌లు బయటికి నడిచారు.

దేవరాజ్ పబ్లిక్ ప్రాసిక్యూటర్‌ని చూశాడు.

"మీ అభిప్రాయం ఏమిటి?"

"భయపెట్టి నేరాన్ని ఒప్పించడం విజ్ఞత అన్పించుకోదు. నాగేష్ హంతకుడని మనం నిర్ణయించలేం. పరిస్థితులు అతడ్ని హంతకుడ్ని చేసినా, అందుకు సాక్ష్యాధారాలు లేవుకదా?" అన్నాడు ప్రాసిక్యూటర్.

"ఎలాటి సాక్ష్యాలు కావాలి మీకు?" అన్నాడు దేవరాజ్.

"హత్యాయుధం, అడుగుజాడలు, వేలిముద్రలు ఏవీ దొరకలేదు."

"వాటితో మీకేమిటి పని? కోర్టులో నాగేష్ ముద్దాయిగా కేసు ఫైలు చెయ్యండి! ఈ కేసులో ఆధా

రాలు లేకపోయినా సర్కమ్‌స్టేన్షియల్ ఎవిడెన్స వుంది!"

"నో, సర్. సర్కమ్‌స్టేన్షియల్ ఎవిడెన్స సరిపోదు—దానివల్ల బలమైన గ్రౌండ్స్ ఏర్పడవు."

"ఐతే ఏమిటి మార్గం?"

ప్రాసిక్యూటర్ ఒక్క క్షణం తర్వాత అన్నాడు, "సర్, ఈ కేసులో మాయమైన డబ్బు ప్రధాన పాత్ర వహిస్తుంది. ఆ డబ్బెక్కడ వుందో కనుక్కొండి—హంతకుడెవడో నిరూపించవచ్చు. అంతవరకు నాగేష్ మీద ఎలాంటి కేసూ నిలబడదు!"

"డబ్బు ఎక్కడ వుందని మీ అభిప్రాయం? నాగేష్ దగ్గర ఎందుకు వుండకూడదు?"

"వుండవచ్చు. ఆ డబ్బు ఆకుపచ్చ ఏర్ బ్యాగుతో సహా మాయమైంది. కనీసం ఆ బ్యాగు దొరికినా, డబ్బు ఎక్కడవుందో తెలుస్తుంది. సర్, ఈ కేసులో మరో ఇద్దర్ని మీరు మర్చిపోతున్నారు: రాజన్, హేమరాజ్."

దేవరాజ్ జయదేవ్‌ని చూసి అదోలా నవ్వాడు.

"దటీజ్ రైట్, మిస్టర్ ప్రాసిక్యూటర్. డబ్బు ఎక్కడవుందో ముందు తెలుసుకుంటాం. మిస్టర్ జయదేవ్, మీరు నిశ్చింతగా వుండండి. త్వరలో హంతకుడిని పట్టుకుంటాం."

## 14

జయదేవ్ విసుగ్గా రిసీవర్ అందుకున్నాడు: "యస్, దేవ్ హియర్."

"దేవ్!" అంది అవతలి కంఠం.

ఛటుక్కున రక్తప్రసరణ ఆగిపోయింది జయదేవ్‌లో,

వెన్నులోంచి చలి పుట్టుకవచ్చి దేహమంతా చల్ల బడింది.

"దేవ్! పలకవేం?"

"ఎవరది!"

"ఓహ్ దేవ్! నాతో పాటు నా గొంతూ మర్చి పోయావా!"

"రేవ్! రేవ్...నువ్వేనా? ఎక్కడున్నావు?"

"ఇక్కడే—అడయార్ బంగళాలో."

గతుక్కుమన్నాడు జయదేవ్, "ఎప్పటినించీ?"

"ఇవాళే వచ్చాను..."

"ఎక్కడనుంచీ!"

"మొన్న కోయంబత్తూరు కెళ్ళాను.— దేవ్, నే విన్నది నిజమేనా? నమ్మశక్యంగావడంలేదు! చెప్పు దేవ్, ఇది నిజం కాదని చెప్పు!"

దేవ్ పూర్తిగా తెలివిలోకొచ్చాడు. "నువ్వన్నది నిజమే రేవ్. ఇప్పుడు నేనా పాతకిని తలుచుకుంటూ దుఃఖించడం లేదు! ఆమె పతివ్రత కాదని నువ్వు చెప్పినప్పుడు నిన్ను కొట్టినందుకు—"

"ఓహ్ దేవ్! అవన్నీ మర్చిపో! నీ భార్య జీవితం అన్ని విధాలా నాశనమైంది. దురదృష్టవంతురాలు ... నాకు చాలా జాలిగా వుంది!"

"దయచేసి అలాంటి మాటలు చెప్పకు రేవ్!"

"దేవ్ నువ్వొంటనే ఇక్కడికొస్తావా?"

"ఎందుకు?"

"ఇలాంటి పరిస్థితిలో నీకు వంటరితనం మంచిదికాదు— దేవ్, నువ్వు నన్నింకా ప్రేమిస్తున్నావు కదూ?"

జయదేవ్ సందేహించాడు.

"చెప్పు దేవ్, నన్నెప్పుడూ ప్రేమిస్తావు కదూ?"

దేవ్ పలకలేదు.

"ఓ.హ్, క్షమించు దేవ్! నేనిలా మాట్లాడకూడదు - భార్య పోయిన దుఃఖంలో నువ్వుండగా... నేనిప్పుడే ఇలా..."

"రేవతీ!" అర్చాడు జయదేవ్. "నా భార్యని తలచుకోకు దయచేసి! ఐ లవ్ యూ! నువ్వు నాక్కావాలి! జీవితాంతం...ప్రతి క్షణం..."

"వెంటనే వచ్చేయ్ దేవ్."

లైను కట్ అయింది.

తేరుకుని చెమటలు తుడుచుకున్నాడు జయదేవ్.

ఆ తర్వాత ఒక్క క్షణం ఆలస్యం చెయ్యలేదు. వెంటనే బయటికి వచ్చి గ్యారేజిలోంచి కారు తీశాడు. ఎన్నడూ డ్రైవ్ చెయ్యని వేగంతో పది నిమిషాల్లో అడయార్ బంగళా చేరుకున్నాడు. పొడవాటి సర్వేచెట్ల మధ్య చీకటిగా వున్న బంగళా భయం పుట్టించింది. కారును ఆవరణలో వదిలేసి గబగబ మెట్లెక్కి వరండా చేరుకున్నాడు. చీకట్లో ఒంటరిగా నిలబడివున్న స్త్రీ ఆకారాన్ని చూసి ఆగిపోయాడు.

అతని నోటినుంచి అప్రయత్నంగా, "రేవతీ?" అన్న పిలుపు వచ్చింది.

"జయదేవ్, మైడియర్, వచ్చేశావా!" బదులుగా జవాబు వచ్చింది.

జయదేవ్ ఛటుక్కున వెళ్ళి ఆమెని పట్టుకున్నాడు.

"ఓహ్ దేవ్!"

"ఏమిటి రేవ్?"

"పద! పైకెళ్ళి మాట్లాడుకుందాం..."

దేవ్ ఆమె నడుము చుట్టూ చెయ్యివేసి మేడమీది గదిలోకి నడిచాడు.

"దేవ్...నీ భార్య, వనజ...పాపం ఆమె..."

"షటప్! ఆమె ప్రసక్తి తేక!" అర్చాడు దేవ్, "ఆమె నా భార్య కాదు! అర్థమైందా? నువ్వు నా భార్యవి!"

రేవతి కళ్ళు మెరిశాయి: "నిజంగా? ఓహ్, దేవ్, మైడియర్, లవ్ మీ!"

దేవ్ ఆమెని బెడ్ మీద కూచోబెట్టి తను పక్కన కూచున్నాడు. ఆ తర్వాత వాళ్ళిద్దరూ వివిధ విషయాలు చర్చించుకున్నారు. వాటిలో వనజ ప్రస్తావన రాలేదు.

జయదేవ్ భవిష్యత్ లో తన కార్యక్రమాలు వివరించి చెప్పాడు. సినీఫీల్డుకి గుడ్ బై కొట్టి జీవితాంతం విశ్రాంతిగా రేవతితో కాలక్షేపం చేస్తూ గడుపుతానన్నాడు. వారం రోజుల్లో రేవతితో గోవా వెళ్ళి నెల రోజులు గడపాలని చెప్పాడు. రేవతి తనకి అందమైన చీరలు; విలువైన నగలు కావాలంది. తనకి బొమ్మ కుక్కలంటే చాలా ఇష్టమని రేవతి చెప్పినప్పుడు, రేపుదయం సెక్రటరీ చేత తెప్పిస్తానని దేవ్ చెప్పాడు.

ఆ తర్వాత తాముండే ఇల్లుగురించి మాట్లాడుకున్నప్పుడు, అడయార్ బంగళాలోనే తను వుండదలుచుకున్నాడని దేవ్ చెప్పాడు. వనజ గడిపిన ఇంట్లో ఇక కాలు పెట్టననీ, ఆ ఇల్లు అమ్మేస్తాననీ కూడ చెప్పాడు.

రేవతి సంతోషించింది.

"అయితే, దేవ్, మనిద్దరం ఎప్పుడూ కలిసి వుంటాం కదూ?"

దేవ్ నవ్వాడు, "అవును-అనుక్షణం కలిసివుంటాం-అణువణువున ఏకమవుతాం."

"ఓహ్ దేవ్! నీ కవిత్వం బాగుంది!"

దేవ్ ఆమె మాటలు, విన్పించుకోలేదు.

అతని కళ్ళు ఎదురుగా వున్న బట్టలు స్టాండుమీద నిల్చాయి.

"ఏమిటలా చూస్తున్నావ్ దేవ్?" రేవతి అడిగింది.

దేవ్ తటాలున దూకి స్టాండుకి వేలాడుతోన్న ఆకు పచ్చ ఏర్ బ్యాగు అందుకున్నాడు, "ఇదెక్కడిది!"

అతని ప్రవర్తన ఆమె కర్థంగాలేదు, "కోయంబత్తూరులో కొన్నాను—బావుందికదూ?" అంది అమాయకంగా.

ఆమె మాటలు విని దేవ్ ముఖం ఎర్రబడింది. నోరు తడారిపోయింది. గుండె వేగంగా కొట్టుకుంటోంటే బ్యాగుతో రేవతి దగ్గరి కొచ్చాడు.

"రేవతి... ఈ బ్యాగు... బాగా ఆలోచించి చెప్పు... నీ కెక్కడ దొరికిందీ?"

రేవతి ఆశ్చర్యపోయింది: "ఏమిటి దేవ్? కొన్నానంటూంటేను!"

దేవ్ బ్యాగు ఆమె మీదకి విసిరికొట్టాడు, "అబద్ధం! ఈ బ్యాగు నువ్వు కొనలేదు! నువ్వు కోయంబత్తూరు వెళ్ళలేదు! హైద్రాబాదు కెళ్ళావ్!".

"దేవ్!" అర్చిందామె ఘటుక్కున నిలబడి.

"నిజం చెప్పు! నాటకమాడకు! ఈ బ్యాగు నువ్వు హైద్రాబాదునుంచి తెచ్చావుకదూ?"

"ఒహ్ దేవ్, ఏమిటిది? ఆ బ్యాగు నేను కొన్నాను-కొన్నాను—కొన్నాను-"

"షటప్ యూ డర్టీ బిచ్!" ఆమె చెంప వాయించాడు జయదేవ్.

"ఈ బ్యాగు ఏమిటనుకుంటున్నావు? కిడ్నాపర్స్ ఇందులో రెండు లక్షలు పెట్టి వనజ కిచ్చారు! పోలీసులు ఇప్పుడు ఆ డబ్బుకోసం, ఈ బ్యాగుకోసం గాలిస్తు

న్నారు! ఈ బ్యాగుతో నువ్వు పట్టుబడ్డావంటే ఏమవు తావో తెలుసా?"

రేవతి విపరీతంగా వణకసాగింది. ఆమె చెంపలు ఎర్ర బడ్డాయి. పెదవులు అదురుతున్నాయి.

"దేవ్...దేవ్...ఇలా జరుగుతుందనుకోలేదు! నన్ను-నన్ను — దేవ్! రక్షించు!"

"ఎందుకు? ఏం చేశావు?"

"ఆ బ్యాగు నేనే తెచ్చాను...వనజ దగ్గరినుంచి."

జయదేవ్ ఉలిక్కిపడ్డాడు, "ఏమిటీ?"

"అవును దేవ్, నేనే తెచ్చాను. జరిగిందేమిటో తెలిస్తే నువ్వు నన్ను తప్పకుండా రక్షిస్తావు! నీకోసం ఆ పని చేశాను దేవ్.'.

"ఏ పని? అర్థమయ్యేలా చెప్పు!"

రేవతి కిటికీ దగ్గరకెళ్ళి బయట చీకట్లోకి చూసింది. "చెప్తాను. ఆ పని ఎందుకు చేయవలసి వచ్చిందో చెప్తాను. దేవ్, హాస్పిటల్‌లో నిన్ను చూసిన క్షణాన నీ భార్య అయితే ఎంత బావుండు అనిపించింది! నీతో పరిచయ మైయ్యాక ఆ కోరిక ఇంకా బలంగా నాటుకుంది. కానీ, నన్ను పెళ్ళాడేందుకు నీ కిష్టంలేదు. నిన్ను పెళ్ళి చేసుకు తీరాలన్న పట్టుదలతో నీ భార్య గురించి నీచంగా మాట్లా డాను. ఇంకా ఎన్నో విధాలుగా ప్రయత్నించాను. ఫలితం లేకపోయింది. కానీ, ఏనాటికైనా నీ భార్య నవుతానన్న నమ్మకం నాకుంది.

"ఆ నమ్మకమే నన్నీ పని చేయించింది. వనజని కిడ్నాప్ చేసినట్టు నువ్వు చెప్పినప్పుడు నా మెదడులో ఒక మెరుపు మెరిసింది. ఇది చక్కటి అవకాశం! జార విడుచుకోకూడ దనుకున్నాను. నువ్వు నాకు అయిదు వేలు ఇచ్చి వెళ్ళిపొమ్మన్నావు. నేను కోయంబత్తూరు వెళ్ళ

లేదు. నీకంటే ముందు హైద్రాబాదు చేరుకున్నాను. ఆ తర్వాత ఏర్‌పోర్ట్‌లో నీ రాకకోసం ఎదురు చూశాను. సాయంత్రం నువ్వు వచ్చాక వెంబడించి ఎక్కడ బస చేశావో తెలుసుకున్నాను.

"ఆ సాయంత్రం నుంచీ చాలా రాత్రివరకు హోటల్ దగ్గరే కాపుకాశాను. సుమారు పదకొండు గంటలకి నువ్వు బయటికి వచ్చి టాక్సీ ఎక్కావు. నేను ఒక కారు దొంగిలించి నిన్ను కొంతదూరం నుంచి వెంబడించాను. నువ్వు టాంక్‌బండ్ చేరుకున్నాక కారులోంచి బ్రీఫ్‌కేసు పడేశావు, నీ టాక్సీ దూసుకుపోయింది.

"నీ వెంట నేనూ కొంత దూరం వచ్చి ఆగిపోయాను. నువ్వు బ్రీఫ్‌కేసు పడేసిన వంద గజాల దూరంలో కారు దిగి చూశాను. ఎవరో ఇద్దరు చెట్టుమీంచి దూకి బ్రీఫ్ కేసు అందుకున్నారు.

ఆ తర్వాత వాళ్ళు కానిస్టేబిల్‌ని కొట్టడం లాటి సంఘటనలు జరిగాయి. చివరికి వాళ్ళిద్దరూ ఒక కార్లో బయలుదేరారు. నేను నా కార్లో వాళ్ళని వెంబడించాను' వాళ్ళు వూరి బయటికెళ్ళి ఎక్కడికో అదృశ్యమయ్యారు' నేను పట్టించుకోలేదు. కారును చెట్లమధ్య దాచి కాచుకున్నాను.

అరగంట తర్వాత ఆ కారు వూళ్ళోకి వస్తూ కన్పించింది. కార్లో వనజ, మరొకడు వున్నారు. ఆ కారు నన్ను దాటిపోయాక తిరిగి వెంటాడాను. చాలాసేపు ప్రయాణించి ఆ కారు బంజారా హిల్స్ చేరుకుంది. ఆ కారు ఓ వీధి మలుపు దగ్గర ఆగినప్పుడు వనజ దిగిపోయింది—ఆమె చేతిలో బ్యాగు వుంది.

"ఆమెని వదిలేసి ఆ మనిషి కార్లో వెళ్ళిపోయాడు."

"ఆ తర్వాత?"

రేవతి, జయదేవ్ కళ్ళల్లోకి సూటిగా చూసింది.

"ఆ తర్వాత__నేను కారు దిగి చకచక వనజ వెనక నడిచాను. ఆమె వేగంగా నడిచివెళ్ళి ఒక ఇంటి గేటు ముందు ఆగింది. నేను గబగబ వెళ్ళి ఆమె వెనక నిల బడ్డాను. నా అలికిడి విని ఆమె వెనక్కి తిరిగింది. కెవ్వు మని అరవబోయేంతలో, నేనామె నోరు గట్టిగా మూసి కత్తితో వీపులో పొడిచేశాను."

జయదేవ్ కళ్ళప్పగించి చూస్తున్నాడు.

"అంతే దేవ్. ఆమె చనిపోయింది. ఆమె చేతిలో బ్యాగు వుంది. అందులో డబ్బు వుంది. ఆ బ్యాగు తీసుకుని తిరిగి వచ్చేశాను. మర్నాడు ఇక్కడికి చేరుకున్నాను. చెప్పు దేవ్-మంచి పని చేశానుకదూ? వనజని నువ్వు ప్రేమించలేక పోతున్నావు. ఆమె ముందు తలెత్తుకుని తిరగలేక పోతున్నావు. అవమానం ఫీలవుతున్నావ్. నీకు విముక్తి కల్గించాను కదూ?"

అప్పటికిగాని తేరుకోలేదు జయదేవ్.

"నువ్వు నా భార్యని చంపేశావా!"

రేవతి నవ్వింది. "పిచ్చి దేవ్! ఆమెని తలచుకోకూడ దని నువ్వింఁదాకే చెప్పావు! ఆమెమీద నీకు చాలా కసిగా వుంది కదూ? ఆ కసి నేను తీర్చాను. నన్ను పెళ్ళి చేసుకో! ఆమెని మరిపిస్తాను!"

జయదేవ్ తటాలున దూకి ఆమె కంఠం పుచ్చు కున్నాడు. రేవతి కెవ్వుమంది.

"నువ్వు హంతకురాలివి! నా భార్యవి కాలేవు! నా భార్యని చంపావు! నిన్ను చంపేస్తాను!" దేవ్ ఆయా సంతో వగరుస్తూ ఆమె కంఠం చుట్టూ వేళ్ళు బిగిస్తు న్నాడు. ఆమె వూపిరి ఆడక గిలగిల తన్నుకుంటోంది.

జయదేవ్ చేతులు ఆమె కంఠాన్ని నలిపేస్తున్నాయి. రేవతి అతి ప్రయాసమీద శక్తి కూడదీసుకుని, జయదేవ్ ని వదిలించుకుంటూ, పిడికిళ్ళు బిగించి అతని ఛాతీమీద వరుసగా పది దెబ్బలు కొట్టింది.

ఆ దెబ్బలకి దేవ్ గట్టిగా మూల్గాడు. రేవతిని వదిలేసి గుండెలు పట్టుకుని ఉక్కిరి బిక్కిరి అయ్యాడు. శ్వాస అందడం లేదు. ముఖం ఎర్రబడింది. హఠాత్తుగా గుండెలో అలజడి ప్రారంభమై అతన్ని కింద పడేసింది. జయదేవ్ నేలమీద పడి అటూ ఇటూ దొర్లసాగాడు, భరించలేని బాధతో.

కొన్ని క్షణాల తర్వాత కళ్ళు తేలవేసి అచేతనంగా వుండిపోయాడు.

రేవతి కెవ్వుమని అర్చింది. జయదేవ్ చనియాడు.

ఆమె గుండెల్లో రైలింజన్లు పరిగెత్తాయి. ఒక్క క్షణం ఏం జరిగిందో అర్థంకాలేదు. తేరుకుని గదిలో పిచ్చిగా అటూ ఇటూ పరిగెత్తింది. ఆ తర్వాత ఏర్ బ్యాగులో పరుపుకింద నుంచి నోట్ల కట్టలు తీసి కుక్కింది. కాళ్ళూ చేతులూ విపరీతంగా వణుకుతున్నాయి. స్పృహ తప్పేలా వుంది. ఆమెలో మొండి ధైర్యం ప్రవేశించింది. పారిపోవాలి. స్పృహతప్పే లోపున ఇక్కడనుంచి పారిపోవాలి.

ఏర్ బ్యాగు అందుకుని బయటికి వురికింది. మెట్లు దిగి చీకటిగా వున్న ఆవరణలోకి వేగంగా వురికింది. గేటు తెరుచుకుని వీధిలోకి యింకా వేగంగా వురికింది.

ఆమె వేగాన్ని చూసి ఆశ్చర్యపోయి, గేటు దగ్గర కాపలా కాస్తోన్న ఇన్ స్పెక్టర్ దేవిడ్, గొంతు చించుకుని అర్చాడు:

"హే. ఆగండి. ఆగండి.".

రేవతి ఛటుక్కున ఆగి, వెనక్కి తిరిగి చూసి అదిరి పడింది. ఈ హఠాత్పరిమానికి ఇంకా భయం ఎక్కువై ముందుకి వురికింది. మృత్యువు కౌగిలిలోకి.

ఆ వేగంలో ఆమె లేడిలా రోడ్డు దాటబోతుండగా ఆటునుంచి వస్తోన్న ఓ కారు గుద్దేసింది. ఆమె శరీరం పదడుగుల ఎత్తున బంతిలా ఎగిరి ఇరవై అడుగుల దూరాన పడింది. ఇంతలో మరో కారు దూసుకొచ్చి ఆమె మీదికి ఎక్కేసింది.

అంతటితో ఆమె జీవితం అంతమైంది.

# 15

ఆత్మారాం సిగరెట్ ఆర్పేసి అవతలికి విసిరాడు, "అంతే మిస్టర్ మోహన్, ఇంకేమీ లేదు. కథ అయి పోయింది." అన్నాడతను.

నేను చాలాసేపు మౌనంగా వుండిపోయాను. ఆ తర్వాత భారంగా నిట్టూర్చి, "థాంక్స్ ఆత్మారాం, థాంక్యూ వెరీమచ్! కొన్ని సందేహాలున్నాయి..." అన్నాను.

"అడుగు." అన్నాడతను.

"అడయార్ బంగళాదగ్గరికి ఇన్‌స్పెక్టర్ డేవిడ్ ఎలా వచ్చారు?"

ఆత్మారాం చిన్నగా నవ్వాడు. "పబ్లిక్ ప్రాసిక్యూటర్ నాగేష్‌మీద హత్యకేసు నిలబడదని వాదించి నప్పుడు, దేవరాజ్‌కి పిచ్చెక్కినట్టయింది. అప్పుడే బ్రహ్మాండమైన అయిడియా తట్టింది. ఈ కేసులోమరో ఇద్దరు తెరచాటు వ్యక్తులున్నారు. హేమరాజ్: వనజ ప్రేమికుడు, రాజన్: ఆమెని పీడిస్తున్న బ్లాక్ మెయిలర్ — ఈ ఇద్దర్లో ఎవరో ఒకరు వనజని ఎందుకు చంపేసివుండకూడదు? ఈ అనుమానంతో వెంటనే

మద్రాసు పోలీసులకి వర్తమానం పంపాడు దేవరాజ్. అక్కడి పోలీసులు ఆ ఇద్దర్నీ పట్టుకుని ఇంటరాగేట్ చేశారు. వనజ హత్యచేయబడ్డ రాత్రి తాము హైద్రాబాదులో లేమనీ, మద్రాసులోనే వున్నట్టుగా ఆ ఇద్దరూ ఎలిబీ చూపారు.

"దేవరాజ్ కి మతిపోయింది. మొదటినుంచీ పీడిస్తోన్న అనుమానాన్ని నివృత్తి చేసుకుందామని జయదేవ్ ని షాడో చెయ్యమని దేవిడ్ ని పురమాయించాడు. భార్య తనని మోసం చేస్తోందని జయదేవ్ కి తెలిసివుండవచ్చు. ఆమె అంతు చూడాలని అనుకుని వుండవచ్చు. ఈ కిడ్నాపింగ్ వ్యవహారం అందుకు చక్కటి అవకాశం కల్పించింది—ఆమెని అతను ఎందుకు చంపివుండకూడదు? హత్య కిడ్నాపర్స్ మెడకి చుట్టుకుంటుంది. ఎలాటి చిక్కులు ఉత్పన్నం కావు! కాబట్టి ఈ అనుమానాలన్నీ తీర్చుకుందుకు జయదేవ్ ని షాడో చేసి దేవిడ్, అడయార్ బంగళాదగ్గర కాపలా కాశాడు."

"అయితే ఈ హత్య రేవతి చేసిందని పోలీసులకెలా తెలుసు? కిడ్నాపర్స్ కెలాటి శిక్షలు పడ్డాయి?" అడిగాను.

"ఈ హత్య రేవతి చేసివుండకపోతే ఆమె జయదేవ్ ని చంపి, డబ్బుతో ఎందుకు పారిపోతుంది? ఈ అంశంతో కేసు అద్దంలా, స్పష్టంగా కనబడింది. అంతే మిస్టర్ మోహన్. వనజ విషయంలో ఆమె ఆత్మకు న్యాయం చేకూరింది. అంతకంటే పోలీసులు ఏంచేయగలరు? ఆగంతకులకి కిడ్నాపింగ్ నేరంమీద జైలు శిక్షలు పడ్డాయి. దట్సాల్. ఇంకా డౌట్స్ వున్నాయా?"

ఏమీ లేవని చెప్పాను.

"షారీవెల్! ఈ కథలో ప్రతిఒక్కరూ ఏదో ఒక ఫలితాన్ని ఆశించి దాన్ని దక్కించుకోవాలని ప్రయత్నించారు. అయితే చివరికి ఎవరికేమేం దక్కాయో నువ్వు తెలుసుకున్నావు. చాలా విచారించదగ్గ విషయం. ఇక నా ఫీజు..." అన్నాడతను చెయ్యిజాపి.

నేను డబ్బుతీసి అతని చేతిలో పెట్టాను.

అతనా చెయ్యిని అలాగే జేబులోకి పోనిచ్చి, "ఇంకెప్పుడు ఇలాటి అవసరం వచ్చినా, నా దగ్గరికి రావడం మరువకేం?" అన్నాడు.

అలాగే వస్తానని చెప్పి అక్కడనుంచి లేచాను.

—: అయిపోయింది :—

# కుక్క-గాడిద

## వసుంధర

ఇన్‌స్పెక్టర్ రాఘవరావు అప్పుడు డ్యూటీలో లేడు. కాబట్టి డబ్బెట్టి పేకాడుతున్నాడు. ఆ విషయం నవ్వుతూ అన్నట్టుగా అన్నాడు అతని స్నేహితుడు గోవిందం.

రాఘవరావు జోకును కాస్త సీరియస్‌గానే తీసుకుని– "స్నేహితులతో డబ్బెట్టి పేకాడ్డం తప్పుకాదు—" అన్నాడు.

"అలా అనుకుందామనుకున్నా ఇక్కడున్న వారంతా నీ స్నేహితులు కారు" అన్నాడు గోవిందం స్నేహితుణ్ణి కవ్వించడానికి.

అయితే అతనన్న మాటలు నిజమే! అక్కడున్న నలుగురిలోనూ గోవిందం ఒక్కడే రాఘవరావు స్నేహితుడు. మిగతా ఇద్దరూ గోవిందం స్నేహితులు. అందులో రామానుజంతో రాఘవరావుకిదివరకే పరిచయముంది కానీ సుబ్బారావును చూడడం ఇదే ప్రథమం.

"పేకాటే వాళ్ళమధ్య నున్న స్నేహం అన్నదమ్ముల అనుబంధాన్ని మించినదని నీకు తెలీదనుకుంటాను. ఏ

కూడా ఒక పంక్తిలో కూర్చున్నామో అప్పుడే రాఘవ రావుగారు నాకు స్నేహితులైపోయారు" అన్నాడు సుబ్బారావు.

రాఘవరావు ముఖం వికసించింది. అయితే ఈలోగా గోవిందం "పేకాడేవాళ్ళంతా స్నేహితులే అయితే, స్నేహితులలో డబ్బెట్టి పేకాడ్డం తప్పు కాకపోతే_ మొన్న నువ్వెందుకురా "ఫ్రెండ్స్ క్లబ్" మీద రెయిడ్ చేసి పేకాడుతున్న నేరానికి పదిమందిని అరెస్టు చేశావు?" అన్నాడు.

సుబ్బారావు మరోసారి రాఘవరావును ఆదుకున్నాడు "అయితే నీ ఇల్లూ క్లబ్బూ ఒక్కటేనంటావు..." అని కాస్త తెల్లబోయిన గోవిందం వంక చూసి చిన్నగా నవ్వుతూ "క్లబ్ లో పేకాడితే తప్పు. ఇంట్లో పేకాడితే తప్పుకాదు. ఇంట్లో చేసే చాలా పనులు క్లబ్బులో చేయడం తప్పు..." అన్నాడు.

"ఎందుకట?" అన్నాడు రామానుజం.

"తెలుసుకోవాలనున్నవాడు స్వంత పెళ్ళాన్ని ఒక సారి నడిరోడ్డుమీద ముద్దుపెట్టుకుని చూస్తే_పోలీసులు, కోర్టులు, లాయర్లు _ తనంతటతానే అదెందుకు తప్పో తెలుసుకుంటాడు..." అన్నాడు సుబ్బారావు.

"సుబ్బారావుతో వాదించడం కష్టం. వాడు ఇన స్పెక్టర్ గార్ని రక్షించాలనుకున్నాడు. ఆయనకు సాయ పడుతున్నాడు. వాడి సాయం లభించినవాళ్ళ జోలికి వెళ్ళడం మంచిదికాదు. నేను విరమించుకుంటున్నాను" అన్నాడు గోవిందం.

"చాలా థాంక్సండీ సుబ్బారావుగారూ _ ఈరోజు నాకో మంచి స్నేహితుడు లభించినందుకు చాలా సంతోషంగా వుంది" అన్నాడు రాఘవరావు.

"పోలీసులతో స్నేహం నాకే మంచిది. ఎప్పుడైనా అవసరానికి సాయపడతారు. నావల్ల మీకేం ప్రయోజన ముంటుంది?" అన్నాడు సుబ్బారావు.

"అలా నిన్ను నువ్వు చిన్నబుచ్చుకోకు. నీ సలహాల వల్ల ఎంతమంది బాగుపడలేదు? అందులోనూ అపరాధ పరిశోధన నీకు హాబీకదా..." అన్నాడు గోవిందం.

"ఈజిట్!" అని ఆశ్చర్యపడ్డాడు రాఘవరావు.

"హాబీలోనూ సామాన్యంకాదు. ఎక్కడైనా ఏదైనా కేసు వివరం తెలిస్తే దాన్నిబట్టి వీడు ఝున్నుంగా పాయింట్లు లాగి ఇలా ఇలా జరిగుండవచ్చునని అంటూంటాడు. చాలాసార్లు అలాగే జరగడం నాకు ఆశ్చర్యాన్ని కూడా కలిగించింది" అన్నాడు గోవిందం.

"ఎందుకురా ఇప్పుడవన్నీ" అన్నాడు సుబ్బారావు.

ఆ మాట వినిపించుకోకుండా "వీడి లేటెస్ట్ ప్రిడిక్షన్ చెప్పనా?" అన్నాడు గోవిందం.

రాఘవరావు ఉత్సాహంగా తలాడించాడు.

"ఫ్రెండ్స్ క్లబ్‌ను రెయిడ్‌చేసి అరెస్టులు చేశాక నువ్వు నేరస్థులను వదిలిపెట్టవలసి వచ్చింది. అందుకు కారణం" అని ఆగిపోయాడు గోవిందం ఎందుకంటే సుబ్బారావు అతనివంక ఉరిమి చూస్తున్నాడు.

"చెప్పు!" అన్నాడు రాఘవరావు కుతూహలంగా.

"చెప్పేస్తాన్రా మరి!" అని గోవిందం చెప్పసాగాడు.

ఆ క్లబ్‌లో దొరికిన వారందరూ పెద్దమనుషులు. డబ్బున్నవారు. వారు రాఘవరావును బెదిరించారు. అతను లొంగలేదు. రాఘవరావు పాత కక్షను సాధించడంకోసం ఈ పని చేసినట్లు కథ అల్లి సాక్ష్యాలు సంపాదిస్తామని వారు బెదిరించారు. ఆ పెద్దమనుషులకు పేరుమోసిన లాయర్లున్నారు.

పోలీసు అధికారి అయుండీ, ఒక నేరానికి ప్రత్యక్ష సాక్షి అయుండీ కూడా సరైన ఇతర సాక్ష్యాధారాలు లేకుండా కేసుల్రాయిస్తే అతను ప్రమాదంలో పడగలడు. అందుకే రెయిడింగ్ సమయంలో అతను కొన్ని ఫోటోలు తీసుకున్నాడు. ఆ ఫోటోల సాక్ష్యంతో అతను అనుకున్నది సాధించగలడు. అయితే ఆ ఫోటోలు పోయాయి. దాంతో రాఘవరావు భయపడి నేరస్థులను వదిలిపెట్టేశాడు.

"అద్భుతం. నిజంగా ఇదంతా మీరే చేయించినంత సులభంగా ఊహించారు" అన్నాడు రాఘవరావు.

"ఇలాంటి మాటలు వినాల్సి వస్తుందనే నా ఊహాలు పోలీసులకు చెప్పడం ఇష్టముండదు నాకు" అన్నాడు సుబ్బారావు.

"సారీ" అన్నాడు గోవిందం.

"నేనుకూడా సారీ చెబుతున్నాను కానీ మీరు అన్యథా భావించకుండా నేనడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పాలి..." అన్నాడు రాఘవరావు.

"మీరిప్పుడు డ్యూటీలో లేరు" అన్నాడు సుబ్బారావు.

"ఇది డ్యూటీకి సంబంధించిన విషయంకాదు. నేనిప్పుడు మీ స్నేహితుణ్ని!"

"అయితే అడగండి..." అన్నాడు సుబ్బారావు.

"మీరు విషయాన్ని ఇంత 'పెర్ఫెక్ట్'గా ఎలా ఊహించగలిగారు?" అన్నాడు రాఘవరావు.

"అంటే-నిజంగా ఆ ఫోటోలు పోయాయా?"

"పోయాయి. కానీ ఆ విషయం నేను నేరస్థులకు చెప్పలేదు. అలా చెప్పడంవల్ల వాళ్ళు మరింత పేట్రేగి

పోతారని భయపడ్డాను. చిన్నగా హెచ్చరించి వదిలేశాను..."

"పోలీసులతో గొడవ ఎవరికీ ఇష్టముండదు. వాళ్ళు తమ జాగ్రత్తలో తాముంటారు. ఇంక మీ జోలికి రారు..." అన్నాడు సుబ్బారావు.

"కానీ... ఈ విషయాన్ని ఇంత కచ్చితంగా మీరెలా ఊహించగలిగారు? ఇలాంటి అనుభవాలు ఇదివరలో మీకేమైనా ఎదురయ్యాయా?" అన్నాడు రాఘవరావు.

"చెప్పాలంటే ఇందాకా గోవిందం అన్నట్లు అపరాధ పరిశోధన నాకు హాబీ. నేను వార్తల్లో నేరాల గురించే వెతుకుతూంటాను. వాటినుంచి కేసులు తయారు చేసి వివరాలూహించడానికి ప్రయత్నిస్తూంటాను. అనుభవం నా పెర్ఫెక్షన్‌కి కారణమయుండవచ్చు. కానీ మీరు నన్ను మరీ మరీ ఈ ప్రశ్న అడగటానికి కారణమేమిటి?"

"ఆ దొంగతనం ఎలా జరిగిందో తెలుసుకోవాలనుంది నాకు. ఆ ఫోటోల విషయంలో చాలా జాగ్రత్త వహించాను నేను. వాటి ఉనికి అతిరహస్యంగా ఉంచబడింది" అన్నాడు రాఘవరావు.

"అన్నీ ఊహతో కనుక్కోవడం సాధ్యపడితే ఈ ప్రపంచంలో జీవితానికి థ్రిల్ ఉండదు. ఆ దొంగతనం ఆ పెద్దమనుషులు చేయించి వుండవచ్చు. లేదా సామాన్యమైన దొంగ ఏమో అనుకుని ఏమో తీసుకుని వుండవచ్చు. ఎవరైనా బ్లాక్ మెయిలర్ కావచ్చును. ఆ ఫోటోలు మీనుంచి కాజేసి ఆ పెద్ద మనుష్యుల్ని బ్లాక్ మెయిల్ చేస్తుండవచ్చును..."

"నిజమే-కానీ ఆ దొంగతనం ఎలా జరిగిందీ అని!"

సుబ్బారావు క్షణం ఆలోచించి "మీరు అది తెలుసు కోవాలంటే మీరా ఫోటోలను దాచడంలో ఎటువంటి జాగ్రత్త వహించారో నేను తెలుసుకోవలసి వుంది" అన్నాడు.

"సామాన్యంగా పోలీసులు ఇటువంటి వ్యవహారాల్లో ఎటువంటి జాగ్రత్త వహిస్తారో ఊహించలేరా?" అన్నాడు రాఘవరావు.

"ఊహించగలను. కానీ చెప్పదల్చుకోలేదు. ఎందుకంటే ఎప్పుడైనా అవసరం నన్ను దొంగగా మారిస్తే— ఈ ఊహాలన్నీ అప్పుడుపయోగపడతాయి. అవన్నీ ఒక పోలీసు అధికారికి చెప్పడంవల్ల నాకు చాలా నష్టంకదా మరి" అని నవ్వేశాడు సుబ్బారావు. అతనితో శ్రుతి కలిపారు గోవిందం, రామానుజం.

రాఘవరావు మాత్రం ఆశ్చర్యంగా అనుమానంగా అతని వంక చూశాడు.

## 2

నగరంలో ఒక హత్య జరిగింది. హతుడు బ్రహ్మచారి మధ్య తరగతివాడు. ఒక్కడూ గది తీసుకుని వుంటున్నాడు. పరిచయాలు చాలా స్వల్పం. విషప్రయోగం వల్ల మరణించాడతను.

హతుడు ఆత్మహత్య చేసుకుంటాడనుకునేందుకు ఏ మాత్రమూ అవకాశంలేదు. అతడికి డైరీ రాసే అలవాటుంది. చనిపోయే ముందురోజువరకూ అతడు డైరీ రాశాడు.

అతడికి ఏవిధమైన సమస్యలూ లేనట్లు, జీవితంపై ఏమాత్రమూ విముఖత లేనట్లూ ఆ డైరీ కచ్చితంగా చెబుతోంది. అదీకాక హత్యజరిగిన నాటికి వారంరోజుల్లో అతను పెళ్ళిచూపులకు వెళ్ళబోతున్నాడు. ఆ పిల్లగురించి

అతనికి ముందే కొంతగా తెలుసును. ఆ అమ్మాయే భార్య అయితే తను చాలా అదృష్టవంతుడినని అతను భావిస్తున్నాడు. ఆమెను గురించి అతను కంటున్న కలలు కూడా కొన్ని డైరీలో వ్రాయబడ్డాయి.

ఆ డైరీ చదివినవాడెవడూ అతను ఆత్మహత్య చేసుకుంటాడనుకోడు.

హాతుడి గదికి వెళ్ళాలంటే ఓ పెద్ద సందులోకి వెళ్ళి అక్కణ్నించి ఇరుకు సందులోకి వెళ్ళాలి. అతను ఇంటికి ఎప్పుడు వస్తాడో, ఎప్పుడు వెడతాడో, అతనింటికి ఎవరెవరు వచ్చి వెడుతూంటారో పెద్దగా పట్టించుకున్న వాళ్ళెవ్వరూ లేరు. అందువల్ల పోలీసులకి దొరికిన సమాచారం చాలా స్వల్పం.

అయితే హత్య జరిగిన చోట పోలీసులకు ఒక వస్తువు దొరికింది. అది హాతుడికి సంబంధించినదికాదు. హంతకుడికి సంబంధించినదనుకోవడానికి కొద్దిగా ఆధారాలున్నాయి.

ఆ వస్తువు ఏమిటో పోలీసులు బయటపెట్టలేదు. దాని సహాయంతో ఈ హత్యారహస్యాన్ని ఛేదించవచ్చునని వారు ఆశపడుతున్నారు.

హంతకుడికి సంబంధించిన ఆ వస్తువు డాక్టర్ నరసన్న గారింట్లో భద్రపర్చబడినట్లూ అక్కడ ఆ వస్తువుపై వారంరోజులపాటు రకరకాల పరీక్షలు జరుగుతాయనీ పోలీసులు పబ్లిక్‌గానే ప్రకటించారు. అలా ప్రకటించడంలో పోలీసుల ఉద్దేశ్యం హంతకుడు ఆ వస్తువు గురించి ప్రయత్నించి పట్టుబడిపోతాడని!

ఆ తర్వాత ఆ హత్యకేసు గురించి ఎవ్వరూ ఏమీ వినలేదు. పేపర్లు, ప్రజలుకూడా క్రమంగా దానిగురించి

మరిచిపోవడం జరిగింది. దానిగురించి మరిచిపోని అతికొద్ది మందిలో సుబ్బారావు ఒకడు!

"నేనిలా అన్నానని మళ్ళీ రాఘవరావుదగ్గర అనకు. పోలీసులు చాలా తెలివితక్కువ వారిలా కనిపిస్తున్నారు. వారిదగ్గర ఉన్న ఆ వస్తువును ఎవరో కాజేసివుంటారు" అన్నాడు సుబ్బారావు, గోవిందంతో.

"అలా ఎందుకు జరుగుతుంది?" అన్నాడు గోవిందం.

"వారిదగ్గర ఆ వస్తువు వుండివుంటే కొంతకాలం పాటు హంతకుడు ట్రాప్‌లో పడతాడేమోనని ఎదురు చూసి అలా జరక్కపోయేక వాళ్ళే దాన్ని బయటపెట్టి పదిమంది దృష్టిలోకి తీసుకువచ్చి ఎవరైనా దాన్ని ఫలానా వ్యక్తికి చెందిన వస్తువుగా ఐడెంటిఫై చేయగల రేమో తెలుసుకునేందుకు ప్రయత్నించేవారు. పోలీసులు కిమ్మనకుండా ఊరుకోవడాన్ని బట్టి వారివద్ద హత్యకు సంబంధించి ఏవిధమైన ఆధారమూ లేదని నిర్ధారణ చేయ వచ్చు" అన్నాడు సుబ్బారావు.

"నీ ఊహ బాగానే వుంది కానీ హంతకుడు పోలీసుల కన్నుగప్పి ఎలా మాయం చేయగలిగాడంటావ్?" అన్నాడు గోవిందం.

"నీ వెర్రికానీ హంతకుడు ఆ వస్తువు కోసం ఎందుకు ప్రయత్నిస్తాడు?"

"తనను పట్టిచ్చే ఆధారంకోసం ఏ హంతకుడు ప్రయత్నించడు?"

"కొంచెం ఆలోచించి చూస్తే నీ ఆలోచనలోని తప్పు నీకే తెలుస్తుంది. హంతకుణ్ని ట్రాప్ చేయడం కోసం పోలీసులు ఆ ఆధారాన్నుపయోగించనున్నారని అమాయకులకు కూడా అర్థమవుతుంది. అంటే ఆ ఆధా

రాన్ని బట్టి హంతకుడెవరో తెలియదు. ఆ ఆధారం కోసం ప్రయత్నిస్తేనే హంతకుడెవరో బయటపడుతుంది. హత్యచేసినవాడు ఈమాత్రం ఊహించలేకపోడు —అందులోనూ డిటెక్టివ్ సాహిత్యం ఇప్పటి స్థాయికి చేరుకున్నాక!" అన్నాడు సుబ్బారావు.

"హంతకుడు కానివాడికి ఆ ఆధారంతో పని ఏమిటి?"

"బ్లాక్ మెయిలింగ్!" అన్నాడు సుబ్బారావు "ఈ రోజుల్లో శ్రమపడకుండా డబ్బు సంపాదించే మార్గమది. అందుగురించి కొందరు అప్పుడప్పుడు శ్రమపడి ఇలాంటి వస్తువులు సేకరిస్తూంటారు."

గోవిందం అనుమానంగా సుబ్బారావువంక చూసి "నేను పోలీసు ఇన్స్పెక్టర్ని కాకపోయినప్పటికీ కూడా నిన్ను అనుమానించాలనిపిస్తోందిరా—నువ్వే బ్లాక్ మెయిలింగ్ వ్యవహారం స్వయంగా నడిపిస్తున్నావేమోనని!" అన్నాడు.

"నేనా? నాకంత కర్మం పట్టింది? అయినా నేను బ్లాక్ మెయిల్ చేస్తానేమోనన్న అనుమానం నీకు కలిగిందంటే నీ ప్రవర్తనలో ఏదో లోపముండి వుండాలని నా ఊహకు తడుతోంది. అదేమయుంటుందో చెబుతానుండు..." అన్నాడు సుబ్బారావు.

"బాబ్బాబు ఊరుకుందూ - కాస్త నెమ్మదిగా మాట్లాడు..." అన్నాడు గోవిందం. ఆఫీసులో ఆడ టైపిస్టుతో అతను కాస్త చనువుగా వుంటాడన్న విషయం సుబ్బారావుకు తెలుసును. ఆ విషయం గోవిందం భార్యకు తెలియడం ఇష్టంలేదనికూడా సుబ్బారావుకు తెలుసును.

# 3

"కెవ్వు" మన్న కేక విని వీధిలోని జనం చాలామంది ఆగిపోయారు. చాలామంది ఆ కేక వచ్చిన వైపు గాలించారు. అక్కడొక పాతికేళ్ళ మనిషి వుంది. ఆ కేక వేసినది అదే!

"శవం!" అని అరిచిందామె మళ్ళీ.

జనం గుమిగూడారు.

"ఏం జరిగింది?" చాలామంది అడిగారు. జవాబుగా ఆమె గుమ్మంలోకి చూపించింది. గుమ్మందాకా వెళ్ళిన వాళ్ళకు ఏం జరిగిందో ఎవరూ చెప్పనవసరం లేకపోయింది.

ఒక మనిషి వెల్లకితలా పడివున్నాడు. అతడి గుండెల్లోకి దిగివుంది కత్తి. రక్తం ఛాతీపైకి చిమ్మివుంది.

"హత్య!" అన్నారు ఇద్దరు ముగ్గురు అప్రయత్నంగా.

"నువ్వెవరు?" అన్నాడు అక్కడున్నవారిలో ఒకతను ఆ ఆడమనిషిని.

"నేను వీరింట్లో పనిమనిషినండి..." అందామె.

తడబడిపోతూ ఆమె చెప్పిన వివరాలేమిటంటే- గదిలో ఆమె చచ్చిపడున్నతని పేరు జగన్నాథస్వామి. ఒక్కడే వుంటున్నాడు. ఈమె అతని ఇంట్లో రెండు నెలలుగా పనిచేస్తోంది. జగన్నాథస్వామి చాలామంచివాడు. ఉదారస్వభావుడు. తను మామూలుగా పని చేయడానికి వచ్చి తలుపులు తోయగా ఈ దృశ్యం కళ్ళబడింది.

"అర్జంటుగా పోలీసులకు ఫోన్ చేయాలి. మీరంతా ఇక్కడే వుండండి...వాళ్ళడిగే ప్రశ్నలకు సమాధా

సాక్ష్యం బాగా పనికొస్తుంది" అన్నాడక్కడున్న వాళ్ళతో పనిమనిషిని పలకరించినతను.

పోలీసులు, సాక్ష్యం అన్న మాట వినగానే అక్కడున్నవారందరూ ఒకొక్కరే ఏవేవో పనులున్నాయంటూ తప్పించుకున్నారు. పనిమనిషి ఒక్కతే అక్కడ నిలబడింది.

"వీళ్ళింట్లో ఫోన్ వుందా?" అనడిగాడతను.

"లేదు" అందామె.

"పోలీసులు వచ్చేవరకూ నువ్విక్కడుంటావా, నీకింకా ఇక్కడేమైనా పనులున్నాయా?" అన్నాడతను మళ్ళీ.

"ఇంకా చాలా ఇళ్ళలో పనికెళ్ళాలండి" అందామె.

"అయితే నువ్వు వెళ్ళు. నేను పోలీసులకు కబురు చెబుతాను..." అన్నాడతను.

పనిమనిషి ముఖం సంతోషంతో వెలిగింది.

"ఇంట్లో ఏమైనా ఖరీదైన వస్తువులున్నాయా?"

"మనిషి ప్రాణంకంటె ఖరీదైనదేముంటుంది బాబూ" అంది పనిమనిషి కళ్ళొత్తుకుంటూ.

"దానికేంకాదు. హంతకుడు ఎందుకీ హత్య చేశాడూ అనడానికి ఇలాంటి విషయాలు దోహదం చేస్తాయి. అయినా అవన్నీ పోలీసులు చూసుకుంటారులే కానీ నువ్వొక్క క్షణం బయట నిలబడు. నేను లోపలకు వెళ్ళి తాళం వెదుకుతాను. గదికి తాళం వేసి అప్పుడు పోలీసులకు కబురుచేస్తే చాలా మంచిది" అన్నాడతను.

"తాళం ఎక్కడుందో నాకు తెలుసు బాబూ!" అంది పనిమనిషి.

"తెలిసినా నువ్వు వెళ్ళకూడదు. ఎందుకంటే అక్కడ మన వేలిముద్రలు పడకుండా, మనగురించి ఏ

ఆధారాలూ వదలకుండా ప్రయత్నించాలి. లేకపోతే అన్నీ మన నెత్తిమీదకే వస్తాయి...'' అన్నాడతను.

అతని మాటలకు పనిమనిషి బాగా భయపడింది. అతన్నే లోపలకు వెళ్ళమని తాళాలెక్కడుంటాయో చెప్పింది. అతను లోపలకు వెళ్ళి తలుపులు వేసుకున్నాడు.

పనిమనిషి బయట నిలబడింది.

హత్యగురించి తెలిసినవారందరూ వెళ్ళిపోయారు. ఉన్నవారిలో కొందరు దూరాన్నుంచి ఆ ఇంటికేసే చూస్తున్నారు. తెలియనివారు చాలామంది వీధిలో మామూలుగా అటూ ఇటూ తిరుగుతున్నారు.

పనిమనిషి వణుకుతూ పది నిముషాలు అక్కడ నిలబడి వుంది. లోపలకు వెళ్ళిన మనిషి అంతసేపు అక్కడ ఏం చేస్తున్నాడో ఆమెకు తెలియలేదు.

ఆమె నిలబడి వుండగానే అతను సన్నగా తలుపులు తెరిచి కదిలించి బయటకు వచ్చాడు. తలుపులు దగ్గరగా లాగి తాళం వేశాడు. తాళంచెవి పనిమనిషికి ఇచ్చి—తన చేతిలోని రుమాలు చూపించి—''నా వేలిముద్రలు పడకుండా ఈ జాగ్రత్త తీసుకున్నాను. నీకైతే ఇలాంటివి తెలియవు. నువ్వు జాగ్రత్తగా ఈ తాళం దాచు. ఎవరింట్లో వుంటావో చెప్పు. పోలీసులకు నేను కబురు చెబుతాను'' అన్నాడు.

పనిమనిషి తాళంచెవి అందుకుంది. అతను వెళ్ళిపోయాడు.

## 4

ఇన్‌స్పెక్టరు రాఘవరావు తాళం అందుకుని—''హత్య జరిగిందని ఎలా అనుకున్నావ్?'' అన్నాడు.

మనిషి వెల్లకిలా పడివున్నాడు. గుండెల్లో కత్తి. ఛాతీ నిండుగా రక్తం. తను హత్య జరిగిందనుకోవడానికి కారణాలు ఆమె ఇన్‌స్పెక్టర్‌కి చెప్పింది.

ఇన్‌స్పెక్టర్ తాళం తీశాడు. తలుపులు తోశాడు. జనం మళ్ళీ వీధి గుమ్మందగ్గర పోగవుతున్నారు.

పోలీసు బలగం గదిలో ప్రవేశించి తమ తమ పొజిషన్సు అడ్జస్టు చేసుకుంటున్నారు.

రాఘవరావు శవాన్ని చూసి ఉలిక్కిపడ్డాడు. గుండెల దగ్గర గాయం అయితే వున్నదికానీ ఆ స్థానంలో వుండవలసిన కత్తి లేదు. అతను చటుక్కున పనిమనిషి వంక చూసి "నీ పేరేమిటన్నావ్?" అన్నాడు.

"లక్ష్మి!" అందామె.

"చూడు లక్ష్మీ శవం గుండెల్లో కత్తిని చూశానన్నావ్ కదూ" అన్నాడు రాఘవరావు.

అప్పటికి లక్ష్మి శవాన్ని చూసింది. ఆమె వణికిపోతూ "అవును. కాదు" అంది.

అయితే రాఘవరావు ఆమెవద్ద నుంచి అసలు విషయం రాబట్టడానికి ఎంతోసేపు పట్టలేదు. ఆమె జరిగిన విషయం చెబుతూంటే అతను ఆశ్చర్యంగా విన్నాడు.

"హంతకుడు గుండెలు తీసిన బంటు" అన్నాడతను అప్రయత్నంగా.

"అతను హంతకుడా?" అందామె మరింతగా వణికిపోతూ.

"అవును. లేకపోతే హత్యాయుధంతో వాడికేం పని" అన్నాడు రాఘవరావు. అతని ముఖం ఎర్రబడింది. ఎంత ధైర్యం ఆ మనిషికి? నడివీధిలో ఎంతోమంది జనం అతన్ని చూశారు. పనిమనిషి లక్ష్మి అతన్ని చక్కగా గుర్తుపట్ట

గలేదు. ఆ పరిస్థితుల్లో ఆమెకు మాయమాటలు చెప్పి మోసంచేసి తన పని తను చేసుకుపోయాడు.

"నువ్వు వాణ్ని గుర్తుపట్టగలవు కదూ?" అన్నాడు రాఘవరావు.

"గుర్తు పట్టగలనండి" అంది లక్ష్మి. కానీ ఆమెకు మనసులో భయంగా వుంది.

అక్కడి తతంగం అంతా ముగించుకుని రాఘవరావు లక్ష్మిని పోలీస్ స్టేషన్‌కు తీసుకు వెళ్ళాడు. అక్కడ పాత నేరస్తుల ఫోటోలన్నీ చూపించాడు. వాటిలో ఎక్కడా ఆ మనిషి లేడు.

"ఇవన్నీ దొంగ ముఖాలండి. అతను చాల పెద్దమనిషి లాగున్నాడు" అంది లక్ష్మి.

"నీ తెలివి తక్కువతనం మూలంగా హంతకుడు తప్పించుకు పోయాడు. ఈ హత్యలో నీకు చాలా బాధ్యత వుంది. అసలు నువ్వే ఈ హత్య చేసి హత్యాయుధాన్ని దాచేసి ఈ కట్టుకథంతా చెబుతున్నావని నాకు అనుమానంగా వుంది" అన్నాడు రాఘవరావు.

లక్ష్మి గొల్లుమని గోలపెట్టి రాఘవరావు కాళ్ళమీద పడిపోయి "నాకు నిజంగా ఏమీ తెలియదు. నన్ను నమ్మండి బాబూ" అంది.

తన అనుభవాన్నిబట్టి లక్ష్మికి ఈ కేసులో ఏ విధమైన సంబంధమూ వుండి వుండదని రాఘవరావు వూహించాడు. అయితే హంతకుడు చాలా తెలివైనవాడు. అతన్ని గుర్తు పట్టడానికి ఏకైక ఆధారం లక్ష్మి. అసలు హంతకుడు ఎదురుగా వున్నా లక్ష్మి నిర్లిప్తంగా వుంటే అతన్ని తెలుసుకోవడం తనకు సాధ్యపడకపోవచ్చు. లక్ష్మిని నిర్లిప్తంగా వుంచడానికి అతను చాలా ప్రయత్నాలు చేయవచ్చు. అందువల్ల హంతకుడి ఆచూకీ పోలీసులకు

తెలియజేయవలసిన బాధ్యతను లక్ష్మి స్వీకరించాలి. అందుకు ఆమెను భయపెట్టాలి.

"ఒక వారం రోజుల్లో నువ్వు ఆ హంతకుడి ఆచూకీ మా కివ్వాలి. లేకపోతే నిన్ను నేను రక్షించలేను" అన్నాడు రాఘవరావు.

లక్ష్మి దిగులుగా అక్కణ్నించి బయల్దేరింది.

రాఘవరావు లక్ష్మిపై నిఘా వుంచమని ఒక మనిషిని నియోగించాడు. హంతకుడు ఆమెను కలుసుకుని హెచ్చరించవచ్చు.

ఇటీవల తను చేపట్టిన కేసులన్నీ విచిత్రమైన మలుపులు తిరిగి తనకు ఇబ్బందిని కలిగిస్తున్నాయి. ఈ సమస్య తన దొక్కడిదేనా, లేక అందరు పోలీసాఫీసర్లకూ వుందా అని ఆలోచిస్తున్నాడు రాఘవరావు. అతనా ఆలోచనల్లో తాత్కాలికంగా జగన్నాథస్వామి హత్యగురించి మరిచిపోయాడు.

# 5

"మీ ఆలోచనల్లో చాలా లోపాలున్నాయి" అన్నాడు సుబ్బారావు.

"చెప్పండి" అన్నాడు రాఘవరావు.

"హంతకుడూ, హత్యాయుధాన్ని కాజేసినవాడూ ఒక్కడే ననుకుందాం. హత్యాయుధాన్ని కాజేయడంలో ధైర్యసాహసాల్ని ప్రదర్శించినా యెంతో తెలివిగా ఎన్నో జాగ్రత్తలుకూడా తీసుకున్నాడతను. అన్ని జాగ్రత్తలు తీసుకునేవాడు హత్యాయుధాన్ని తీసుకువెళ్ళడం వెంటనే చేయక హత్య జరిగిన కొన్ని గంటలకు ఆ పని ఎందుకు చేస్తాడు?" అన్నాడు సుబ్బారావు.

"ఎందుకంటే ఏం చెబుతాం? హత్య అనేది ముందుగా

ఆలోచించుకుని పకడ్బందీగా చేస్తే అది వేరే సంగతి. అలాకాకుండా అప్పటికప్పుడు కలిగిన ఆవేశంలో హత్య జరిగిందనుకోండి. అప్పుడు హంతకుడు గాబరాగా అక్కణ్నించి వెళ్ళిపోవచ్చు. తర్వాత తన పొరపాటు గుర్తించి వుండవచ్చు."

"మీరు చెప్పింది బాగానే వుంది కానీ అప్పటికప్పుడు కలిగిన ఆవేశంలో హత్య చేశాడనుకోండి. అంటే హత్యాయుధం అతనివద్ద సిద్ధంగా వుండిస్తే వుండదు. అందుబాటులో వుండేదాన్ని హత్యాయుధంగా వాడతాడు. దీన్నిబట్టి జగన్నాథస్వామి తన గదిలో హత్య చేయబడ్డానికి పనికివచ్చే ఓ పెద్ద కత్తి వుంచుకుంటున్నాడనుకోవాలి. బాగానే వుంది. అతని కత్తితో అతన్ని చంపినప్పుడు-హంతకుడు హత్యాయుధంగురించి అంతగా భయపడవలసిన దేముంది? దానిమీద తన వేలి ముద్రలుంటాయేమో నన్న భయముంటే అవి జాగ్రత్తగా తుడిచేస్తే సరిపోతుందిగదా! హత్యాయుధాన్ని దొంగిలించడమెందుకూ?" అన్నాడు సుబ్బారావు.

"అలాకాదు. పోనీ హంతకుడు పకడ్బందీగా ప్లాను వేసుకుని వచ్చాడు. కూడా తన కత్తి తెచ్చుకుని వచ్చాడు. హత్యచేశాక వెంటనే ఏదో అలికిడికి భయపడి అక్కణ్నించి పారిపోయాడు. తర్వాత వచ్చి తన హత్యాయుధాన్ని తీసుకు వెళ్ళాడు" అన్నాడు రాఘవరావు.

"అలా అనుకుందామనుకున్నా—హత్యాయుధాన్ని తీసుకు వెళ్ళడానికి పగటి సమయాన్నెందుకు నిర్ణయించుకుంటాడు? పట్టపగలే అంతకు తెగించినవాడు రాత్రి ఆ పని పూర్తి చేసుకోలేడా? అదీగాక రాత్రి ఎక్కడా ఆ వీధిలో ఎవ్వరూ హత్య జరిగినట్లు గుర్తించడం జరగలేదని మీరే అన్నారు. హత్యాయుధాన్ని కాజేసినది హంతకుడే

అయుంటే_అందుకు ఒకే ఒక్క కారణం స్ఫురిస్తోంది"
అని ఆగాడు సుబ్బారావు.

"చెప్పండి!" అన్నాడు రాఘవరావు.

"హంతకుడు సామాన్యుడు కాడు. తన శక్తిసామర్థ్యాలను పోలీసులకు ప్రత్యేకంగా తెలియబర్చి ఓ సవాల్ పారేయాలనుకుంటున్నాడు."

రాఘవరావు పిడికిళ్ళు బిగిశాయి "అదే నిజమైతే వాడికి నిజంగా మూడింది."

"అందుకే నా అనుమానం ఆ కత్తిని తీసుకువెళ్ళింది హంతకుడయుండడని" అన్నాడు సుబ్బారావు.

రాఘవరావు చిత్రంగా సుబ్బారావు కళ్ళలోకిచూసి "అయితే ఎవరయుంటారు? మీరా?" అన్నాడు.

"ఎవరైనప్పటికీ బ్లాక్ మెయిలింగ్ కోసం ఆ పని చేసి వుండవచ్చు."

రాఘవరావు నవ్వి "జగన్నాథస్వామి హత్యకేసులో అనుమానితులు ముగ్గురు. ముగ్గురిలో ఏ ఒక్కణ్ని బ్లాక్ మెయిల్ చేసినా పదిపైసలుకూడా రావుమీకు"అన్నాడు.

"వాళ్ళు అనుమానితులు. అసలు హంతకుడు వేరే వున్నాడేమో - ఆ కత్తి అతణ్ని పట్టివ్వగలదేమో" అన్నాడు సుబ్బారావు.

"మీరు గమనించారో లేదో మన వాదన మళ్ళీ మొదటికొచ్చింది" అని గట్టిగా నవ్వాడు రాఘవరావు.

"కావాలనే అలా చేశాను. లేకపోతే నన్నే బ్లాక్ మెయిలర్ని చేస్తున్నారు మీరు" అని తనూ నవ్వాడు సుబ్బారావు.

# 6

"ఆపు" అందామె.

ఆటో ఆగలేదు. శరవేగంతో ముందుకు దూసుకు

పోతోంది.

"ఏయ్...నిన్నే...ఆపు" అందామె మళ్ళీ.

డ్రైవర్ ఆ మాటలు విన్నట్లులేదు. ఆటో వేగంకూడా తగ్గలేదు.

ఆమె కేక పెట్టింది కానీ ఆటో ఇంజన్ రొదను దాటి అది ఎంత దూరం వెళ్ళిందో తెలియదు. ఆమె కళ్ళల్లో భయం, శరీరంలో వణుకు. ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకొని కూర్చుంది.

ఊరి చివర పాడుపడ్డ ఆలయం దగ్గర ఆటో ఆగింది.

"ఏమిటి నీ వుద్దేశ్యం?" అని కోపంగా డ్రైవర్‌తో అంటూ ఆమె ఆటో దిగింది.

"నా ఉద్దేశ్యం చాలా సింపుల్. నన్ను పరిశీలనగా చూస్తే ఆ విషయం నువ్వే గ్రహిస్తావ్-లీలా!" అన్నాడతను.

"రామం" అంది కంగారుగా లీల "నువ్వా?"

"అవును-నేనే!" అన్నాడు రామం.

"నన్నెందుకిక్కడికి తీసుకొచ్చావ్?" అంది లీల.

"ఎందుకు తీసుకొస్తానో ఊహించలేవా?" అన్నాడు రామం.

"నాకు తెలిసిన రామం చాలా మంచివాడు. నన్ను మనసారా ప్రేమించి నా క్షేమాన్ని కోరుకునే వాడు. కలలోకూడా నాకు అపకారం తలపెట్టనివాడు" అంది లీల.

"అయితే ఆ రామాన్ని పెళ్ళి చేసుకుంటావా?"

"చేసుకోను. పెళ్ళి బాధ్యత నన్ను కని పెంచిన తలిదండ్రులకు వదిలిపెట్టాను. నిన్ను పెళ్ళి చేసుకోవడం నా తలిదండ్రుల కిష్టంలేదు. వాగి కిష్టంలేని పని నేను చేయలేను."

"నీకు నీ తల్లిదండ్రులు కావాలి. నాకు నువ్వు కావాలి. నీ తల్లిదండ్రుల కోసం నువ్వు నన్నే త్యాగంచేశావు. నీ కోసం నేను ప్రాణాలకే తెగించి నిన్నిక్కడకు తీసుకు వచ్చాను" అన్నాడు రామం.

"ఎందుకు?"

"చాలా అమాయకంగా ఈ ప్రశ్న వేసినంత మాత్రాన నువ్వు అమాయకురాలివని నేను నమ్మను. అను కుండా ఐశ్వర్యవంతుల సంబంధం కుదరగానే మన ప్రేమపాఠాలన్నీ మరిచిపోయావు నువ్వు. మాయ మాట లతో నన్ను మభ్యపెట్టాలనుకుంటున్నావు. ఇప్పుడిక్కడ నీతో నాకు ఏం పనో నీకు బాగా తెలుసు" అన్నాడు రామం.

"నిజంగా తెలియదు. ఎంతో మంచివాడైన రామానికి రాత్రివేళ ఈ సమయంలో ఇలాంటి చోట నాతో ఏం పని వుంటుందో నా ఊహక్కూడా అందడంలేదు" అంది లీల.

"రామం ఎంతో మంచివాడని నువ్వే ఒప్పుకుంటు న్నావు కదా! అయితే నీ కళ్ళముందిప్పుడు నిలబడ్డది నీకు తెలియని రామం. నీక్కావలసిన రామాన్ని స్వార్థంతో నీక్కాకుండా చేసినట్లే నీకు తెలిసిన రామం నీకు తెలి యని రామంగా మారడానికికూడా నువ్వే కారణం" అంటూ రామం ఆమె చేయి పట్టుకుని మీదకు లాక్కు న్నాడు.

"రామం ఏమిటిది?" అన్న లీలకు అతనింక మాట్లాడ డనీ చేతల్లోకి దిగాడనీ గ్రహించడానికి కొద్ది క్షణాలు కూడా పట్టలేదు. తన మానసంరక్షణార్థం ఆమె అతన్ని బలంగా తోసి పరుగెట్టింది.

"లీలా! పరుగులోకానీ, బలంలోకానీ నువ్వు నన్ను

గెలువలేవు. తప్పించుకోవడానికి ప్రయత్నించడంవల్ల నీ బట్టలు చిరిగిపోతాయి, నీ శరీరానికి గాయాలవుతాయి. అంతకు మించి ప్రయోజనం లేదు'' అంటూ లీలను హెచ్చరించాడు రామం. అతని హెచ్చరికను లీల లక్ష్యపెట్టలేదు. ఫలితంగా రామం చెప్పినట్లే జరిగింది.

''నీలో ఇంత దుర్మార్గం దాగి వుందని నేననుకోలేదు'' అంది లీల అక్కడ నేలమీద కూర్చుని ఏడుస్తూ.

''ప్రతి మనిషిలోనూ దుర్మార్గం వుంటుంది. అవసరాన్ని బట్టి అది బైటకు వస్తూంటుంది. నువ్వు నా పట్ల వహించిన దుర్మార్గంకంటే ఇది ఎక్కువ కాదులే!'' అన్నాడు రామం.

''ఇలా చేయడంవల్ల నీకు భార్య నౌతాననుకున్నావా?'' అంది లీల ఉక్రోషంగా.

''నిన్ను భార్యగా పొందాలన్న కోరిక నీ కారణంగానే నాలో ఎప్పుడో చచ్చిపోయింది. కాబోయే లక్షాధికారిణితో ఈ మాత్రం పరిచయముండడం మంచిదనిపించి ఇలా చేశాను'' అన్నాడు రామం.

లీల మాట్లాడకుండా ఇంకా ఏడుస్తూ అలా కూర్చుని వుంది.

''ఏడ్చి లాభంలేదు. జరుగవలసింది జరిగిపోయింది. నీ మనసులో ఎలా వున్నా నీకారణంగా నాకు తృప్తి కలిగింది కాబట్టి చెబుతున్నాను. త్వరగా బట్టలు వేసుకో, ఆటోలో ఊళ్ళో దిగబెడతాను'' అన్నాడు రామం.

లీల కదలలేదు. ఆమె ఇంకా ఏడుస్తోంది.

''నేను త్వరగా ఆటోను స్వంతదారుకు అప్పజెప్పాలి. త్వరగా ఆటో ఎక్కు.''

లీలకు ఆ క్షణంలో భయం వేయలేదు. ఆమెకు చాలా ఉక్రోషంగా వుంది. తను సామాన్యుడిగా భావించి తీసి

పారేసిన రామం ఈరోజు తన్ను లోబరచుకుని లోపల కట్టి మాట్లాడుతున్నాడు. ఆమెకు కాస్త పక్కగా ఆమె ఒంటిమీది బట్టలు కుప్పలా పడివున్నాయి.

"ప్రాణాలు తీయడంకంటె పెద్ద ఘోరమే చేశావు. ఇంకా ఏం భయపెడతావ్-పో-ఇక్కణ్నించి" అంది ఆమె వంచిన తల ఎత్తకుండా.

ఆ తర్వాత ఆమెకు రామం మాటలు వినబడలేదు. మరి కొద్ది క్షణాలలో ఆటో స్టార్టయిన శబ్దం వినబడింది. లీల ఉలిక్కిపడి తల ఎత్తింది. ఆమె చూస్తూండగా ఆటో కదిలి వెళ్ళిపోయింది.

అప్పుడు లీల ఉక్రోషం మరిచి ఈ లోకంలోకి వచ్చింది. పరిస్థితి అకళింపు అయిందామెకు. ఊరికి చిట్ట చివర నిర్మానుష్యమైనచోట పరువంలో వున్న ఓ పెళ్ళి కాని పిల్ల మానభంగం కావించబడి నగ్నంగా వుంది. శిథిలావస్థలో ఆమె దుస్తులు అక్కడ పడివున్నాయి. అక్కడ ఆమెకు తోడుగా ఇంకెవ్వరూ లేరు.

ఇప్పుడు తను ఏం చేయాలి?

లీల ఆలోచిస్తూనే వుంది. ఆమెకు ఏ ఉపాయమూ తోచడంలేదు. చిట్టచివరకు ఆమె ఎలాగో అలా అక్కణ్నించి నడిచైనాసరే ఊళ్ళోకి వెళ్ళాలనుకుంది. ఆడదానికి మానభంగానికి మించిన ప్రమాదమేముంటుంది? అది ఎలాగూ తనకు జరగనే జరిగింది ..

లీల లేచి నిలబడి తన బట్టలను సమీపించబోయి చటుక్కున ఆగిపోయింది. ఆమెకు కొంచెం దూరంలో ఎదురుగా ఒక పురుషుడు నిలబడి వున్నాడు. అతను రామం కాదు.

"వెరీగుడ్-చాలా బాగున్నావు" అన్నాడతను.

లీల కుంచించుకుపోయింది. జీవితంలో ఇంత అవ

మానం తనకోరకై కాచుకుని వున్నదని ఆమె ఎన్నడూ ఊహించలేదు. తన బట్టలనందుకోవడం కోసం ఆమె మరో అడుగు ముందుకు వేయబోయి ఆగిపోయింది.

"ఆగు!" అన్నాడతను. ఆ కంఠస్వరం కఠినంగా వుంది.

లీల చటుక్కున చతికిలబడి "ఎవర్నువ్వు?" అంది.

"నే నెవరైనదీ నీకు అనవసరం. నువ్వా బట్టలు వేసుకోవడం నాకిష్టంలేదు. కాబట్టి వేసుకోడానికి వీల్లేదు" అన్నాడు ఆ పురుషుడు.

"నీకు దణ్ణం పెడతాను. దురదృష్టం నన్నింతవరకూ తరుముకు వచ్చింది. ఈ అవమానానికే నేనింకా తట్టుకో లేకుండా వున్నాను. నువ్వు నా జోలికి వచ్చావంటే నా ప్రాణాలు తీసుకుంటాను" అంది లీల.

"ఛ ఛ-ఎంగిలి కూడుకు ఆశించే వాడికింద జమకట్టా వన్నమాట నన్ను..." అంటూ అతను విసుక్కుని- "నేనన్నదేమిటి – నువ్వర్థం చేసుకున్న దేమిటి?" అన్నాడు.

"మరి...మరి...బట్టలు వేసుకోకుండా ఇలా ఎంత సేపు..." ఏం మాట్లాడాలో తెలియక అక్కడితో ఆపి వేసి భయం భయంగా అతనివంక చూసింది లీల.

"నువ్వు పెద్దింటి అమ్మాయివి. అవి నలిగి చిరిగిన బట్టలు. నీలాంటివాళ్ళు అలాంటి బట్టలు వేసుకోవడం ఇష్టంలేక వద్దన్నాను కానీ నిన్ను బట్టలు వేసుకోవద్దన లేదు..." అంటూ అతను ఆమెపైకి ఒక ప్యాకెట్ విసిరాడు.

లీల ఆశ్చర్యంగా చూసింది. ఆ ప్యాకెట్లో ఒక చీర, లంగా, బ్లౌసు, బ్రా వున్నాయి. ఆశ్చర్యమేమిటంటే

లంగా, బ్లౌను, బ్రా-కేవలం తనకోసం కొన్నట్లు చక్కగా సరిపోయాయి.

అతను లేచి ఆమెను సమీపించి-ఆమె పారవేసిన ప్లాస్టిక్ సంచీని తీసుకున్నాడు. నలిగి చిరిగిన ఆమె బట్టలను వీలైనంతలో మడతపెట్టి ఆ ప్లాస్టిక్ సంచీలో పెట్టాడు. లీల ఆశ్చర్యంగా అతనివంక చూసింది.

"ఈ బట్టలు స్టీలుసామానువాళ్ళుకూడా తీసుకోరు. నీకు కొత్త బట్టలిప్పించినందుకు ప్రతిఫలంగా వీటిని నేను తీసుకుంటున్నాను..." అన్నాడతను.

"ఏం చేసుకుంటావ్ వాటిని?" అంది లీల.

"కాబోయే లక్షాధికారిణి భార్యకు జరిగిన మానభంగానికి ఇంతకంటె మంచి సాక్ష్యం వుంటుందా?" అనినవ్వాడతను.

లీల బెదిరిపోయింది. ఇదంతా ఏదో పెద్ద పథకంలా వుంది. తనకు లక్షాధికారి సంబంధం వచ్చిందన్న అసూయతో రామం ఈ పని చేశాడని తను అనుకుంది కానీ ముందుముందు తన జీవితాన్ని నరకప్రాయం చేయడానికి జరుగుతున్న కుట్రగా గుర్తించలేకపోయింది.

"అర్థమైంది. ముందుముందు నన్ను బ్లాక్ మెయిల్ చేసి డబ్బు గుంజాలనుకుంటున్నారు. కానీ నేను సాగనివ్వను. అసలా లక్షాధికారి సంబంధం కాదంటాను. పైసా లేనివాణ్ణి చూసి పెళ్ళిచేసుకుంటాను. అప్పుడు మీరు నన్ను చంపినా పైసాకూడా రాదు..." అంది లీల.

"నిప్పు కాలుతుందిగదా అని దాన్ని వంటచేసుకోడానికి ఉపయోగించడం మానేయడంవల్ల మాదేది నీ కడుపేనని తెలుసుకో..."

"ఎవరునువ్వు?" అంది లీల_"రామానికి బంటువా?"

అతని ముఖం గంభీరంగా అయిపోయింది_ "రామానికి నేను బంటునా అయితేగియితే, ఆ రామామే నాకు బంటు కావాలి!" అన్నాడు.

"ఏదో ఒకటి_ మీ యిద్దరూ యెందుకు లాలూచీ అయ్యారు? రామంతో నీకు సంబంధం ఏమిటి?" అంది లీల.

"నేను దేశసంచారం చేస్తూ నేరస్థుల ఇబ్బందులు తెలుసుకుంటూంటాను. నేరం చేయాలని వుండికూడా పరిస్థితుల ప్రాబల్యంవల్ల, మానసిక దౌర్బల్యంవల్ల నేరాలు చేయలేకపోతున్నవారికి అవసరమైన ధైర్యాన్నీ, ఆర్థిక బలాన్నీ సమకూర్చి వారిని నేరంవైపు పురికొల్పుతాను.

రామానికి నీ మీద పగతీర్చుకోవాలని చాలా కాలంగా వుంది. అది నేను పసిగట్టి అతన్ని ప్రోత్స హించి యీ రోజు మీ ఇద్దరికీ తొలిసమాగమం ఏర్పాటు చేసి మీ ఇద్దరికీ తెలియకుండా దూరాన్నించి గమనిస్తు న్నాను. నీకు మళ్ళీ అమర్యాద లేకుండా వుండడంకోసం బట్టలతో సిద్ధంగా వున్నాను. ఇప్పుడు నిన్ను చూస్తుంటే ఆడది మామూలుగాకంటె బట్టల్లోనే ఎక్కువ అందంగా వుంటుందని అర్థమవుతోంది.

ఇప్పుడు నిన్ను చూస్తోంటే ఎంగిలికూడు అనిపించడం లేదు. నీలాంటిది భార్య అయితే బాగుండుననిపిస్తోంది. అయినా నిన్నేమీ చేయను. కాస్తదూరంలో నా కారుంది. నాతోవస్తే ఊళ్లో దిగబెడతాను. పిచ్చిపిచ్చి అనుమానాలేమీ పెట్టుకోక అనుకున్న సంబంధం హాయిగా చేసుకుని సుఖపడు. నావల్ల నీకేమీ ఇబ్బంది వుండదు" అన్నాడతను.

"అయితే యిదంతా ఎందుకు చేశావు?" అంది లీల.

"జస్ట్ ఫర్ ఫన్. ప్రపంచంలో నేరాలు వరిల్లాలి అన్నది నా కోరిక. నా ఆశలమేరకు అవి వరిఘిల్లటం లేదన్నది నా బాధ" అన్నాడతను.

అతను ఎన్ని చెప్పినప్పటికీ బ్లాక్ మెయిలింగ్ అతని అసలు ఉద్దేశ్యమని లీల ఊహించింది. "నన్ను బ్లాక్ మెయిల్ చేయడానికి ప్రయత్నిస్తే నేనైనా చస్తాను నిన్నైనా చంపుతాను" అంది.

"అంత పనిమాత్రం చేయను. నేను నీకు వస్త్రదానం చేసి ఆలనాటి శ్రీకృష్ణపరమాత్మను మించిపోయాను. నేను నీకు దైవసమానుణ్ణి. నీకు అన్యాయం చేసినది రామం. అతన్ని నువ్వు చంపాలనుకుంటే అది న్యాయం. ఎప్పుడైనా నీకు అటువంటి ఆలోచన పుడితే నాకు చెప్ప కుండా మాత్రం చేయకు. ప్రమాదం లేకుండా హత్యలు చేయడానికి మంచి పథకాలున్నాయి నా దగ్గర" అన్నాడతను.

లీల అతని మాటలకు నివ్వెరబోయినా తమాయించు కుని "అలాగే నీ అడ్రసు చెప్పు" అంది.

"నాకు అడ్రసేమిటి?" అని అతను నవ్వి "ఏమీ యిబ్బంది వుండదు. హత్య చేయాలన్న ఆలోచన నీలో ప్రవేశిస్తే నేను నీకు ఎలాగూ కనబడతాను" అన్నాడు.

## 7

"ఎవరు?" అంటూ ఉలిక్కిపడి లేచాడు సుబ్బారావు.

"నేను బాబాయ్!" అంది లీల తడబడుతూ.

"నువ్వా-ఏంటమ్మా యింత ఆలశ్యంగా వస్తున్నావ్" అంటూ అతను వీధి అరుగుమీద స్విచ్ వేశాడు. దీపం వెలిగింది. సుబ్బారావు కళ్ళు నులుముకుని ఒక పర్యాయం లీలవంక చూశాడు. ఆమెను చూడగానే అతనికి అన్న

కూతురుకు బదులు భార్య గుర్తుకువచ్చింది. లీలముఖంలో చాలా మార్పు వుంది.

"నువ్వు సాయంత్రం నాలుగున్నరకు ఇల్లువదిలిపెట్టావు. స్నేహితురాలితో మొదటిఆట సినిమాకు వెళ్ళి వచ్చేస్తానన్నావు. ఇప్పుడు రాత్రి పన్నెండయింది. మొదటిఆట వదిలిపెట్టి రెండున్నరగంటలకు పైగా అయింది. నీ ముఖం చూస్తుంటే సినిమా చూసి వస్తున్నట్లులేదు. వెళ్ళేటప్పుడు నువ్వు కట్టుకువెళ్ళిన బట్టలువేరు' ఇప్పుడు కట్టుకున్నవి వేరు. ఏదో జరిగింది" అన్నాడు సుబ్బారావు.

బాబాయి సంగతి లీలకు బాగా తెలుసును. అతను ఏ విషయాన్నీ వదిలిపెట్టడు. ప్రతివిషయాన్నీ క్షుణ్ణంగా పరిశీలించి ఆలోచించి అసలుసంగతి ఊహాలో తెలుసుకునేందుకు ప్రయత్నిస్తాడు. అతని కళ్ళబడడం తన దురదృష్టం.

"చెప్పు ఏం జరిగిందో" అన్నాడు సుబ్బారావు.

"ఏముంది బాబాయ్. స్నేహితురాలింటికి వెళ్ళాను. దానికి నా చీర నచ్చింది. దానిచీర నేనూ, నా చీర అదీ కట్టుకున్నాం. సినిమా అయేక కాసేపు వాళ్ళింట్లో గడిపాను. మాటల్లో టైం తెలియలేదు. అంతే_ దీనికి నువ్వు లక్షప్రశ్నలు వేస్తున్నావు" అంది లీల.

"ఎవరా స్నేహితురాలు?" అన్నాడు సుబ్బారావు.

సినిమాకు వెళ్ళడంకోసం ఇంట్లో స్నేహితురాలి పేరు చెప్పింది కానీ ఆమె సినిమా ఒంటరిగానే చూసింది. అందువల్ల ఆమెకు ఏం పేరు చెప్పాలో తెలియక చటుక్కున "నళిని!" అంది.

"అయితే నువ్వు చెప్పే దాంట్లో ఇంకా చాలా అబద్ధాలున్నాయి. నళిని లావులో నీకు రెట్టింపు ఉంటుంది. ఆమె జాకెట్ నీకు సరిపోదు. వెళ్ళేటప్పుడు అనుపచ్చ

చీరమీద మ్యాచింగ్ జాకెట్‌తో వెళ్లావు. వచ్చేటప్పుడు గులాబి రంగు చీరమీద మ్యాచింగ్ జాకెట్‌తో వస్తున్నావు. నిజం చెప్పాలంటే నీ చీర ఇప్పుడే బజార్నించి కొన్న దానిలా ఉంది.'' అన్నాడు సుబ్బారావు.

''అయితే నన్నేం చేయమంటావ్!'' అంది లీల చిరాగ్గా.

సుబ్బారావు ముఖం గంభీరంగా అయిపోయింది. ''వీధిలో అనవలసిన మాటలు కావివి లీలా'' అంటూ అతను స్వరం తగ్గించి ''నీ ముఖం నిండా గాట్లు, రక్కులున్నాయి. నీ మెడమీద కూడా ఉన్నాయి. నువ్వు నా దగ్గర అబద్ధం చెప్పకు. జరిగింది జరిగినట్లు చెప్పేసేయ్. నేను నీకు బాబాయినే కానీ పరాయి వాణ్ని కాదు'' అన్నాడు.

వెంటనే లీల ముఖంమీద చేతులు కప్పుకుంది. ఆమెకు ఏడుపు వస్తున్నట్లు అతను గ్రహించాడు. భారంగా నిట్టూర్చి జేబులోంచి తాళంతీసి తలుపులు తెరిచి లోపలకు వెళ్ళాడు. లీల అతన్ని అనుసరించింది.

సుబ్బారావుకు వీధి అరుగుమీద పడుకోవడం అలవాటు. అటువంటప్పుడు అతను ఇంటికి తాళంపెట్టి తాళం చెవి జేబులో వేసుకుని నిద్రపోతాడు. ఆ కారణంగా లీలకు అతన్ని లేపక తప్పింది కాదు.

సుబ్బారావు లోపలకు వెళ్ళి భార్యను పిలిచి, లీల గురించి తనకున్న అనుమానాలు చెప్పి ''నిద్రపోయినప్పుడు లీల వళ్ళు పరీక్షించు. లాలించో, బెదిరించో లీలచేత నిజం పలికించు'' అన్నాడు. ఆమె సరేనన్నాక అతను మళ్ళీ వీధి అరుగుమీదకు వెళ్ళి తలుపు తాళంవేసి పడుకున్నాడు.

# 8

"రాముం సంగతి అటుంచు– వాణ్ణేమీ చేయలేము. ఆ రెండో వాడి సంగతి ఆలోచించు. వాణ్ని నువ్వు గుర్తు పట్టగలవా?" అన్నాడు సుబ్బారావు.

"గుర్తు పట్టగలను. ముఖం బాగా గుర్తుంది కానీ వాడు మనకు కనపడొద్దూ?" అంది లీల. రాత్రి జరిగిన ఘోరాన్ని పిన్నికి చెప్పుకున్నాక ఆమెకు మనసు కాస్త శాంతించింది. తల్లి వద్దకంటె పిన్నదగ్గరే ఆమెకు చనువు ఎక్కువ. పిన్ని ఉపశమనం వాక్యాలు చెప్పాక ఆమె మనసు మరి కాస్త తేలికపడింది.

"జరిగింది పూర్తిగా మరచిపో. ఇది నువ్వు కావాలని చేసిన తప్పుగాదు. అందుకు నిన్నే పాపమూ అంటదు. నువ్వు పరమపవిత్రురాలివి. ఎటొచ్చీ నిన్నలా భంగపరచి నీ భవిష్యత్తులో ఆడుకోవాలనుకుంటున్న ఆ విధవ సంగతి తేల్చి పారేయాలి. ఇది నా ఊహాశక్తికి పరీక్ష......" అన్నాడు సుబ్బారావు లీలతో.

ఆ సందర్భంలో ఆమె నతను రకరకాల ప్రశ్నలు వేశాడు. తనకు తెలిసిన వాళ్ళ ఫోటోలూ, తను సేకరించిన నేరసుల ఫోటోలూ చూపించాడు. అందులో ఎక్కడా లీల బట్టలు తీసుకున్న మనిషి ఫోటో కనపడలేదు.

సుబ్బారావు బాగా ఆలోచించి "అన్నట్టు నీకు డ్రాయింగ్ వచ్చును కదూ" అన్నాడు.

"వచ్చును కానీ మనుషుల ముఖాలను యథాతథంగా చిత్రించలేను" అంది లీల.

"చిత్ర లేఖనం రావాలి కానీ అదేం బ్రహ్మావిద్యకాదు.

నా బొమ్మ వేసి చూపించు." అన్నాడు సుబ్బారావు.

లీల సుబ్బారావుని ఎదురుగా పెట్టుకుని ఒక బొమ్మ వేసింది.

సుబ్బారావుకు ఆ బొమ్మను చూసి ఏడవాలో నవ్వాలో తెలియలేదు. ఎక్కడా తన పోలికలు రాలేదు. అతని భార్య మాత్రం ఆ బొమ్మ చూసి ఇలాంటి మనిషిని ఎక్కడో చూసినట్లుందండీ" అంది.

"ఎక్కడో చూడ్డమేమిటీ- అది బాబాయి బొమ్మ. అంత బాగా రాకపోయినా దగ్గర పోలికలుండి ఉంటాయి. అందుకే నీకు అలా అనిపించి ఉంటుంది" అంది లీల కాస్త గర్వంగా.

ఆమె పిన్ని మాత్రం లోపలకు వెళ్ళి అయిదు నిమిషాల్లో ఓ ఆల్బం తీసుకుని వచ్చింది.

ఆ ఆల్బంలో ఒక ఫోటోలోని వ్యక్తి అచ్చం లీల గీసిన ఫోటోలోని మనిషిలా ఉన్నాడు.

"వీడా! చాలా దూరపు వరుసలో నాకు తమ్ముడౌతాడు." అన్నాడు సుబ్బారావు.

"మొత్తంమీద మీ అమ్మాయి గట్టిదే. మిమ్మల్ని చూసి మీ బంధువర్గంలోని వాళ్ళఫోటో వేయగలిగింది." అంది సుబ్బారావు భార్య.

"భగవంతుడు సృష్టిలో కొత్తకొత్త పోలికలు తీసుకురావాలనుకున్నప్పుడు లీలవంటి చిత్రకారిణి సాయం తీసుకుంటాడనుకుంటాను" అన్నాడు సుబ్బారావు. అతను జోక్ వేశాడనుకుని భార్య నవ్వింది కానీ అతని ముఖం చాలా సీరియస్‌గా ఉంది. ఆ దుర్మార్గుడెవరో తెలుసుకోవాలని అతనికి ఉంది. కానీ ఇప్పుడున్న అసహాయ పరిస్థితి అతని రక్తాన్ని మరిగిస్తోంది.

# 9

"రాఘవరావుగారూ నేను డిటెక్షన్ ప్రారంభిద్దామనుకుంటున్నాను." అన్నాడు సుబ్బారావు.

"ఎందుకని, మా పోలీసు డిపార్టుమెంటుమీద నమ్మకం లేకనా?" అన్నాడు రాఘవరావు.

"ఎంతమాట? పోలీసుల్ని తప్పుగా అనుకోవడానికి వాళ్ళేం దేవుళ్ళు కాదు కదండీ. మీరూ మాకులాంటి మనుషులే! మీ శక్తి కొద్దీ ప్రయత్నించి నేరస్థుల ఆచూకీ తెలుసుకుంటారు. నేరస్థులు మరీ తెలివి మీరిపోతుంటే మీరు మాత్రం ఏం చేయగలరు? నాకు కొంచెం ఊహా శక్తి ఉన్నది కదా! దాంతో డిటెక్షన్ చేసి ఉడతా భక్తిగా మీకు సాయపడాలని నేను అనుకుంటున్నాను." అన్నాడు సుబ్బారావు.

"చాలా థాంక్సండీ - మాకు సాయపడగలిగినా లేకున్నా మీరు మా గురించి ఓమాటన్నారు. అదే చాలు. ఇంతకీ మీ డిటెక్షన్ ఎట్నించి ప్రారంభిద్దామని?"

"ఇటీవల మీ అనుభవంలోకి వచ్చిన కేసుల్ని బట్టి నాకో చిన్న అనుమానం రేగింది. అది ఇదివరలో నే మీకు చెప్పి ఉన్నాను. ఓ కొత్త బ్లాక్ మెయిలర్ ఊళ్లో ప్రవేశించాడు. వాడు నేరస్థులపై ఓ కన్నువేసి ఉంచి వాళ్ళ బలహీనతలను ప్రోత్సహించి వాళ్ళచేత నేరాలు చేయిస్తున్నాడు. తర్వాత కొన్ని సాక్ష్యాధారాలు సంపాదించి బ్లాక్ మెయిలింగ్ కి ఉపయోగించుకుంటున్నాడు." అన్నాడు సుబ్బారావు.

"ఈ ఆలోచన అంతసమంజసంగా ఉన్నట్లుతోచదు. జరిగిన అన్ని నేరాల్లోనూ బ్లాక్ మెయిలింగ్ కు అవకాశం ఉన్నదనిపించదు" అన్నాడు రాఘవరావు.

"అవుననుకోండి. మీతో నేనూ ఏకీభవిస్తున్నాను. కానీ అసలు విషయం తేలేవరకూ అలా అనుకుందాము. బ్లాక్ మెయిలింగ్ కోసం కాకపోయినా మరెందుకో ఆ వ్యక్తి సాక్ష్యాధారాలు కాజేస్తున్నాడు. అంటే ఇందులో మనకు రెండు విషయాలు అర్ధమవుతున్నాయి. నేరం జరగడానికి అతను ప్రోత్సహిస్తున్నాడు, నేరం జరిగాక నేరానికి సంబంధించిన సాక్ష్యాధారాలు దొంగిలిస్తున్నాడు. దీని ఆధారంగా హంతకుణ్ని నేను ట్రాప్ చేయాలనుకుంటున్నాను. అందుకు మీ సహకారం కావాలి."

"నా సహకారం మీకు తప్పకుండా వుంటుంది. కానీ ఒక్క ప్రశ్న. నేరం జరగడానికి అతనెవరో ప్రోత్సహిస్తున్నాడనీ, నేరం జరిగేక సాక్ష్యాధారాలు దొంగిలిస్తున్నాడనీ మీరెలా అనుకుంటున్నారు?"

ఇన్‌స్పెక్టర్ సూటిప్రశ్నకు సుబ్బారావు తడబడ్డాడు. అవును-తను అలా అనుకోడానికి కారణం లీల అనుభవం! అయితే ఆ విషయం పదిమందికీ చెప్పగలడా! అది తనకూ, లీలకూ, తన భార్యకూ మధ్య మగ్గిపోవలసిన భయంకర రహస్యం.

"ఇదంతా నా ఊహ" అన్నాడు సుబ్బారావు.

"మీరు నా దగ్గర ఏదో దాస్తున్నారు. ఏ ఊహకైనా ఏదో ఆధారముంటుంది. అది మీరు నాకు చెప్పడానికిష్టపడ్డంలేదు" అన్నాడు రాఘవరావు.

సుబ్బారావు అప్పటికి పుంజుకున్నాడు "ఏదైనా వింత కేసు తగిలితే దాని గురించి అదేపనిగా ఆలోచిస్తూంటాను నేను. అలాంటప్పుడు ఒకోపర్యాయం అనుకోకుండా వింత పరిష్కారాలు స్ఫురించవచ్చు. ఇంట్యూషన్ గురించి మీరు ఎరుగరనుకోను."

"మీ ట్రాప్ చెప్పండి" అన్నాడు రాఘవరావు.

"అమ్మయ్య దారికి వచ్చావు" అనుకున్నాడు సుబ్బారావు "చాలా సింపుల్. అయితే నాక్కాదు, మీకు! బహిరంగంగా ఎక్కడైనా నేరానికి ప్రయత్నం జరగాలి. తర్వాత నేరస్థుడు ఆ నేరాన్ని వాయిదా వేసుకుంటూ పోవాలి. వాయిదాలు వేసే ఆ నేరస్థుడివద్దకు మనం వెతుక్కుంటున్న నేరస్థుడు వస్తాడని నా అనుమానం. అదే జరిగితే ఎన్నో కేసులు పరిష్కారమవుతాయి."

"పథకం బాగుంది కానీ నాకు హోప్ లేదు" అన్నాడు రాఘవరావు.

సుబ్బారావు నవ్వి "ఆరంభింపరు నీచమానవులు" అంటూ పద్యం చదివాడు.

"మీరు పద్యం బాగా చదువుతారు. ఎటొచ్చీ తెలుగు నాకు బాగారాదు. అర్థం తెలియదు..." అన్నాడు రాఘవరావు.

"తెలియకపోవడమే మంచిది. కానీ నా పథకం ఫలించదేమోనని అనుమానం పెట్టుకుని మీరు గనుక ప్రయత్నించకపోతే ఈ పద్యానికి మీకు అర్థం చెప్పవలసి వుంటుంది" అన్నాడు సుబ్బారావు.

"ఇందులో పోయిందేముంది? చిన్న ట్రయల్. అంతేగా! చేసేస్తాను. మీ చేత ఆ పద్యానికి అర్థంమాత్రం చెప్పించుకోను" అని నవ్వాడు రాఘవరావు.

## 10

"అతనికి మీతో మాట్లాడ్డం ఇష్టంలేదుట" అన్నాడు రిసెప్షనిస్టు ఫోన్ క్రిందపెట్టేసి.

"అయినా సరే నేను మాట్లాడాలి. ఆ రూం దగ్గరకు వెడతాను" అన్నాడతను.

"మా కస్టమర్స్ ఇష్టపడనివాళ్ళను వాళ్ళ గదికి వెళ్ళడానికి మేము అనుమతించం."

"విషయం చాలా సీరియస్ అవుతుంది. మీ కస్టమర్ పెద్ద నేరస్తుడు" అన్నాడతను.

"అయితే అవనీండి" అన్నాడు రిసెప్షనిస్టు నిర్లక్ష్యంగా.

అతను అసహనంగా "వాడు వాడు...ఆ కృష్ణయ్యగాడితో వున్నది నా భార్య. నా చేత స్వయంగా పుస్తె కట్టుకున్న పెళ్ళాం. వాడిదగ్గరకు నన్ను వెళ్ళొద్దంటే ఎలా?" అంటూ అరిచాడు.

రిసెప్షనిస్టు ఉలిక్కిపడి అతనివంక చూశాడు "చూడండి రమణయ్యగారూ, మీరు చెప్పేదినిజమేనా?"

"నిజం కాకపోతే నాకూ బాగా నేవుందేది. అయినా యిలాంటి అబద్ధాన్ని ఎవ్వడైనా చెప్పుకుంటాడా?" అన్నాడు రమణయ్య.

రిసెప్షనిస్టు మళ్ళీ రిసీవర్ ఎత్తి "హలో కృష్టయ్యగారూ, మీరోసారి క్రిందకు రాకతప్పదు. వచ్చేటప్పుడు మీ భార్యను కూడా తీసుకురండి" అన్నాడు. తర్వాత రమణయ్యవంక చూసి "వాళ్ళిద్దరూ వస్తున్నారు. ఏం మాట్లాడుకుంటారో నెమ్మదిగా మాట్లాడుకోండి. అనవసరంగా కేకలువేసి రభసచేయకండి" అన్నాడు.

"అలాగే థాంక్స్" అన్నాడు రమణయ్య. అయితే కృష్ణయ్యనూ, అతని పక్కన స్త్రీనీ చూసేసరికి రమణయ్యలో ఆవేశం కట్టలు తెంచుకుంది. కృష్ణయ్య మాత్రం రమణయ్యను గమనించకుండా తిన్నగా రిసెప్షనిస్టు దగ్గరకు వెళ్ళి "ఎవరో నా కోసం వచ్చారన్నారు?" అని అడిగాడు.

"ఇదుగో ఈయనే రమణయ్యగారు" అన్నాడు రిసెప్షనిస్టు.

"నమస్కారమండీ– మీకు నాతో ఏం పని?" అని అడిగాడు కృష్ణయ్య మర్యాదగా.

"ఓరి వెధవా– నన్నే ప్రశ్న అడగడానికి నోరెలా వచ్చిందిరా?" అన్నాడు రమణయ్య.

"ఎవరు మీరు? మర్యాద ఇచ్చిపుచ్చుకోవడం కూడా తెలీదా?" అన్నాడు కృష్ణయ్య.

"నీకు మర్యాద యిచ్చేకదా యీ పరిస్థితి తెచ్చుకున్నాను. ఇంకా అలాంటి తెలివితక్కువపని చేయను" అంటూ రమణయ్య అతని వెనుకగావున్న స్త్రీని వుద్దేశించి "ఏమే, ఇద్దరుపిల్లల తల్లివి. ఇప్పుడు నీకు రంకు మొగుడు కావాల్సొచ్చిందేంటే– అవతల పిల్లలెలాగున్నారన్న ఏడుపైనా లేదు నీకు. అయిందేదో అయింది. ఇప్పుడైనా నాతో వస్తావా?" అని అడిగాడు.

"మీరెవరో నాకు తెలియదు" అందా స్త్రీ.

"ఎంతకు బరితెగించిపోయావే దొంగముండా! నీ కొడుకక్కడ నీ కోసం బెంగపెట్టుకుని మూసినకన్నెర క్కుండా పడున్నాడే. కన్నకడుపైనా ఆక్రోశించడం లేదా?" అన్నాడు రమణయ్య.

"నిజంగానా?" అందా స్త్రీ గాభరాగా.

"నమ్మకు మీనాక్షీ! వీడివన్నీ అబద్ధాలు. నిన్ను మళ్ళీ మాయలో పడేయాలని చూస్తున్నాడు" అన్నాడు కృష్ణయ్య.

రమణయ్యకు ఆవేశం కట్టలు తెంచుకుంది. బూతులు కూడా లంకించుకున్నాడు. అతడిని అదుపులో పెట్టడం కష్టమైంది. అతని కేకలకు అప్పటికి అక్కడ కొందరు

జనంచేరారు. వారందరికీ కృష్ణయ్య నెమ్మదిగా యిలా చెప్పుకున్నాడు.

"చూడండి బాబూ- ఈమె పేరు మీనాక్షి. ఈమె నా భార్యకాదు. ఈమెను భార్యగా చేసుకునే వుద్దేశం కూడా నాకు లేదు. నేను యీ రమణయ్య యింట్లో అద్దెకుంటున్నాము. యీ రమణయ్య తాగుబోతు. పెళ్ళాన్ని అష్టకష్టాలు పెడుతున్నాడు. రాక్షసుడిలా హింసిస్తున్నాడు. ఈయన పెట్టేబాధలు భరించలేక ఈమె ఆత్మహత్య చేసుకోబోగా నేను రక్షిస్తే మా ఇద్దరికీ సంబంధం పెట్టాడు. అక్కాతమ్ముళ్ళలా మసలుతున్న మా యిద్దరికీ సంబంధం అంటగట్టిన ఈయన నోటికి అదుపులేదు. ఆఖరికి యింకోదారి కనిపించక ఈమెను ఆ ఇంటినుంచి తీసుకువచ్చేశాను.

ఈమె దగ్గర నగలులేవు, డబ్బులేదు. ఈమె వయసులో నాకంటె మూడేళ్ళు పెద్దది. నా మంచితనాన్ని నిరూపించడానికివి చాలు. ఒక ఆడా, మగా హోటల్ గదిలో అక్కాతమ్ముళ్ళ పేరిట గది తీసుకుంటే హాస్యాస్పదంగా వుంటుందని భార్యాభర్తలమని చెప్పుకుని ఇందులో దిగాము. ఎంత విసిగిపోతే ఒకఆడది అందులోనూ భారతదేశపు స్త్రీ కన్నబిడ్డలనూ, కట్టుకున్న మొగుణ్ణీ వదులుకుని వెళ్ళిపోతుంది? ఇప్పుడీయన మా జాడ పసిగట్టి ఇక్కడకువచ్చేసి మమ్మల్ని అల్లరిపెట్టాలని చూస్తున్నాడు. ఇప్పుడీమెని వదిలిపెడితే ఈమెను చంపేస్తాడు" అంటూ అందరికీ హృదయం కరిగేలా కృష్ణయ్య కథను చెప్పాడు.

అతను చెబుతూంటే మీనాక్షి అతనికి బలాన్నిచ్చింది. రమణయ్య మధ్యలో కలుగజేసుకోబోయాడు కానీ జనం అతన్ని మాట్లాడనివ్వలేదు. కృష్ణయ్య కథ చెప్పడం

పూర్తయ్యాక అక్కడున్న అందరికీ మీనాక్షిమీద అంతులేని జాలి కలిగింది. కృష్ణయ్యపై గౌరవం కలిగింది. అందరూ ఏకగ్రీవంగా రమణయ్యను అభినందించి పొమ్మన్నారు.

రమణయ్య నిస్సహాయంగా అభినందించి కదుల్తూ "మీ ఇద్దరికీ మూడింది. నా చేతుల్లో మీ చావు రాసిపెట్టి వుంది. ఈ వేళ కాకపోతే రేపు" అన్నాడు.

# 11

"నీ పేరేనా రమణయ్య?" అన్నాడతను.

"నా పేరేదైతే నీకెందుకు?" అన్నాడు రమణయ్య చిరాగ్గా.

"పెళ్ళాం లేచిపోయి హోటల్లో మరొకడితో పలుకు తూంటే ఏమీ చేయలేక ఆ హోటల్ ముందు కాపలా వాడిలా పచార్లుచేసే నువ్వు నామీద చిరుబుర్లాడతావేం?" అన్నాడతను కోపంగా.

రమణయ్య పిడికిళ్ళు బిగిశాయి. పళ్ళు కొరికాడు.

"అనవసరంగా ఆవేశపడకు. నేను నీ మిత్రుణ్ణి" అన్నాడతను.

"ఎలా?" అన్నాడు రమణయ్య.

"నువ్వు ఏం చేయాలనుకుంటున్నావో నేనూ నీచేత అదే చేయించాలనుకుంటున్నాననుకో. అప్పుడు మన మిద్దరం స్నేహితులం కాక ఏమవుతాం?" అన్నాడతను.

"నీ పేరు?"

"పిలవడానికి ఏదో ఒక పేరు అవసరం కాబట్టి చెబుతాను. వీర్రాజు" అన్నాడతను.

"వీర్రాజుగారూ_అయితే నేనేం చేయాలనుకుంటున్నానో, మీరేం చేయించాలనుకుంటున్నారో చెప్పండి.'

"మర్డర్ - కృష్ణయ్యనూ, మీనాక్షినీ!" అన్నాడు వీర్రాజు.

రమణయ్య పిడికిళ్ళు మళ్ళీ బిగిశాయి—"అవును" అన్నాడు.

"హత్యలోనూ మామూలు హత్యకాదు.భయంకరమైన హత్య. నీ కసితీరేవిధంగా వాళ్ళిద్దర్నీ హింసించి చంప వచ్చు. హత్యజరిగేక నీమీద ఎవరికీ అనుమానముండదు."

"అలా సాధ్యపడుతుందా?" అన్నాడు రమణయ్య అనుమానంగా.

"నీకు దృఢసంకల్పముండాలి కానీ తప్పక సాధ్య పడుతుంది"

"నేను రెడీ...ఏంచేయాలో చెప్పండి."

"తెలుసుకోవాలంటే హోటల్ శివశంకర్‌లో పది హేడో నంబరుగదికి వెళ్ళు" అన్నాడు వీర్రాజు.

రమణయ్య వెంటనే అక్కణ్నించి బయల్దేరాడు. కొంతదూరం నడిచి ఒక ఆటోఎక్కి "శివశంకర్ హోటల్‌కు పోనీ" అన్నాడు. ఆటో కదిలింది.

ఆటో ఏవేవో సందులు, గొందులు తిరిగి ఒక పెంకు టింటిముందు ఆగింది.

"ఇదేమిటి, ఇక్కడ ఆపావ్?" అన్నాడు రమణయ్య.

"మీరు శివశంకర్ హోటల్ అన్నారు గదా" అన్నాడు ఆటోవాలా.

రమణయ్య ఆశ్చర్యంగా ఇంటివైపు చూశాడు. వీధి గుమ్మానికి "శివశంకర్ హోటల్" అన్న బోర్డు తగిలించి వుంది.

"ఇదా హోటలు?" అన్నాడు రమణయ్య.

"నాకు తెలిసిన శివశంకర్ హోటల్ ఇదే!"అన్నాడు ఆటోవాలా.

"ఇందులో పదిహేడు గదులుంటాయా?"

"పాతిక్కి పైనే వున్నాయనుకుంటాను. ఎన్నుంటేనేం మీకేం- మీ ఒక్కరికీ వొకటి తే చాలుగదా" అన్నాడు ఆటోవాలా.

రమణయ్య ఆటోవాలాకు డబ్బిచ్చి పెంకుటింటి తలుపు తట్టాడు. బాగా ఎత్తుగా పళ్ళున్న ఓ భయంకరాకారుడు తలుపు తీశాడు. రమణయ్య ఆ వ్యక్తిని చూసి ఉలిక్కి పడ్డాడు.

"రూమ్ నెంబరు పదిహేడు కావాలి" అన్నాడు రమణయ్య.

"అలాగే...లోపలకు రా..." అన్నాడు ఎత్తుపళ్ళ వ్యక్తి.

రమణయ్య లోపలకు ప్రవేశించాడు. ఆటోవాలా వెళ్ళిపోయాడు—ఎత్తుపళ్ళవ్య వ్యక్తి కనుసైగలందుకుని.

"ఇదేం హోటలు?" అన్నాడు రమణయ్య.

"నిజమే. ఇది హోటలుకాదు. ఇప్పుడు నువ్వు వెళ్ళబోయేచోటు నీకూ తెలియకూడదు." అన్నాడు ఎత్తుపళ్ళ వ్యక్తి. అతని మాటలు పూర్తయ్యేసరికి రమణయ్య స్పృహాకోల్పోయాడు.

## 12

రమణయ్య కళ్ళు తెరిచేసరికి ఓ గదిలో ఉన్నాడు. అక్కడ అతనికి ఒక మనిషి కనిపించాడు.

"నాపేరు వీర్రాజు కాదు. కానీ మరి కాసేపట్లో నీ భార్యా, ఆమె రంకు మొగుడూ ఇక్కడకు వస్తారు. వాళ్ళు నిస్సహాయ స్థితిలో ఉంటారు. నీకు తోచిన రీతిని వాళ్ళను హింసించి చంపేయ్. నిన్నెవ్వరూ అడ్డలేరు," అన్నాడతను.

"ఎవరు మీరు?" అన్నాడు రమణయ్య.

"నేరస్థులకు సాయపడ్డం నా హాబీ." అని నవ్వాడతను.

"నేనిప్పుడెక్కడున్నాను?"

"నీ కోరిక తీరేచోట."

"నా కోరిక ఏమిటి?"!

"పగ సాధించడం."

"నాకు ఎవ్వరిమీదా పగలేదు. నేను ఎవ్వర్నీ చంపలేను."

"రమణయ్యా. అనవసరంగా చల్లారిపోకు. నీ గుండెల్ని మండించే దృశ్యం చూద్దువుగాని. అప్పుడు నీలో ఎటువంటి భావాలు రేగుతాయో చూడు. మనిషి మనసును అన్ని సమయాల్లోనూ అదుపు చేసుకోనవసరం లేదు." అన్నాడతను. అతని మాటలు పూర్తయ్యేసరికి మళ్ళీ రమణయ్యకు స్పృహ తప్పింది.

అతను అక్కణ్నించి పక్క గదిలోకి వెళ్ళి వాచీ వైపు చూసుకుంటూ కూర్చున్నాడు. సరిగ్గా నలభై అయిదు నిమిషాలలో అక్కడకు కృష్ణయ్య, మీనాక్షి ప్రవేశపెట్టబడ్డారు. వాళ్ళను చూస్తూనే అతను "నేను చెప్పినట్లు వినకపోతే మీరిద్దరూ ఒకే క్షణంలో చచ్చిపోతారు." అన్నాడు.

"ఏమిటి నువ్వు చెప్పేది?" అన్నాడు కృష్ణయ్య.

"ఈ గదిలో ఎవ్వరూ ఉండరు. మీరిద్దరే ఉంటారు. హాయిగా భార్యాభర్తల్లా విహరించండి. అదే మీరు చేయవలసిన పని."

"ఏమిటి మీరనేది? ఈ మీనాక్షి నాకు అక్కవంటిది." అన్నాడు కృష్ణయ్య.

"యూఫుల్‌ - నేను వరుసల గురించి అడగలేదు. చెప్పి

నట్లు విను. నేను గదిలోంచి బయటకు వెళ్ళగానే మీరు ఒకరి నొకరు కౌగలించుకోండి. లేదా ఇద్దరి గుండెల్లోంచీ తుపాకీ గుళ్ళు దూసుకుపోతాయి." అన్నాడతను.

అతను వేళాకోళ మాడడంలేదని కృష్ణయ్యాకూ, మీనాక్షికీకూడా అర్థమయింది.

## 13

మీనాక్షి కౌగలిలో ఉన్న కృష్ణయ్యను రమణయ్య ఇవతలి గదిలోంచి చూస్తున్నాడు.

"నువ్వు తమను గమనిస్తున్నట్లు వాళ్ళకు తెలియదు. వాళ్ళను మాయమాటలుచెప్పి ఇక్కడకు తీసుకువచ్చాను. క్షణం వ్యవధి వచ్చేసరికి వాళ్ళ ప్రవర్తన ఎలాగుందో చూడు."

రమణయ్య గుటకలు మింగుతూ—"నా భార్య నాతో ఇంత ఆదరణగా ఎన్నడూ ప్రవర్తించలేదు. వాటంచూస్తే అది నిజంగానే వాణ్ని ప్రేమిస్తున్నట్లుంది. అంతగా ప్రేమించుకున్న వాళ్ళను కలిసే ఉండనివ్వండి. నాకింకో పెళ్ళాం దొరక్కపోదు." అన్నాడు.

అతను అసహనంగా రమణయ్య వంక చూసి—"నువ్వు తాళికట్టిన భార్య ఇంకోడి చేతుల్లో నలుగుతూంటే నీలో రక్తం మరగడంలేదు. వాళ్ళిద్దరూ ఇప్పుడు అసహాయులు. నువ్వేం చేసినా ఎదుర్కోలేరు. వాళ్ళను ఏదైనాచేయా లనిపించడంలేదూ?" అన్నాడు.

"లేదు. వాళ్ళ మానాన వాళ్ళను బ్రతక నివ్వాలనిపిస్తోంది." అన్నాడు రమణయ్య.

అతను ఆశ్చర్యంగా రమణయ్య వంకచూసి—"నువ్వు. నువ్వు...నిజంగా మీనాక్షికి భర్తవేనా?" అన్నాడు.

"అవును. అదంటే నాకు వల్లమాలిన ప్రేమ. ఎప్పు

డైనా ఆవేశంలో దాన్ని కోప్పడినా దాని ప్రాణాలు తియ్యలేను. అది సుఖంగా ఉండడమే నాక్కావలసింది.'' అన్నాడు రమణయ్య.

''నువ్వు అలా అనుకోవడానికి వీల్లేదు. వాళ్ళను చంపాలి.''

రమణయ్య ఆశ్చర్యంగా అతని వంకచూసి-''నాకు లేని ఆవేశం మీకెందుకు బాబూ—మీనాక్షివల్ల అన్యాయం జరిగితే అది నాకు జరిగింది. నేను సహిస్తాను...'' అన్నాడు.

''కానీ నేను సహించను. నువ్వు వాళ్ళను చంపి తీరాలి.'' అతను అరిచాడు.

''చంపలేను బాబూ—నాకు చేతులురావు.''

''వాళ్ళను చంపని పక్షంలో నువ్వే చస్తావ్!'' అన్నాడతను.

రమణయ్య ఉలిక్కిపడ్డాడు—''ఇదెక్కడి విచిత్రం బాబూ-నన్ను హత్యచేయమని బలవంత పెడతారు?''

''నీ ఆవేశం చూసి మోసపోయి అన్ని ఏర్పాట్లూ చేశాను. కానీ నువ్వు వట్టి చచ్చు రకంలా ఉన్నావు. నా అనుభవంలో ఇలా జరగడం ఇదే ప్రథమం. అనుకున్న ప్రకారం నువ్వు నీవాళ్ళను చంపితే ఇక్కణ్నుంచి బయట పడతావు. లేకపోతే ఇక్కడే నీబ్రతుకు అంతమవుతుంది.''

''వాళ్ళను చంపడంవల్ల మీకేమిటి లాభం?''

''దానికి జవాబు అతనివ్వలేడు రమణయ్యా నేను చెబుతాను.'' అంటూ ఒక వ్యక్తి లోపలకు వచ్చాడు.

లోపలున్న ఇద్దరూ ఆ వ్యక్తికేసి ఆశ్చర్యంగా చూశారు.

# 14

సుబ్బారావు ఎవరికీ తెలియకుండా రమణయ్యమీద పూర్తి నిఘా వేసి ఉంచాడు. వీర్రాజు మాట్లాడిన విష యాలన్నీ అతను విన్నాడు. వీర్రాజును పోలీసులు అను సరిస్తారని అతనికి తెలుసు. అందుకే అతను రమణయ్య అనుభవాలు తెలుసుకో దలిచాడు.

రమణయ్య ఆటో ఎక్కగానే తన స్కూటరుపై అతను దాన్ని అనుసరించాడు. ఆటో ఇరుకు వీధులమ్మట వెళ్ళడం అతనికి ఆశ్చర్యాన్ని కలిగించినా ఎవరికీ అను మానంరాని విధంగా దాన్ననుసరించాడతను. ఒక సామా న్యమైన ఇంటిలోకి రమణయ్య ప్రవేశించడం సుబ్బా రావుకు ఆశ్చర్యాన్ని కలిగించింది. అతనా ఇంటికి ప్రద క్షిణంచేసి చూసి ఆ ఇంటినుంచి బయటపడడానికి ముఖ ద్వారంకాక మరొకటున్నదని గ్రహించాడు. అనువుగా ఉన్న ఒక ప్రదేశాన్ని ఎన్నుకుని అక్కణ్నించి రెండు ద్వారాలనూ పరిశీలించసాగాడు.

కాసేపటికి ఆ రెండవద్వారం నుంచి ఒక మనిషి బయటకు వచ్చాడు. అవతల ఒక కారు సిద్ధంగా వుంది. ఆ మనిషి కారుడ్రైవర్‌తో ఏమేమో మాట్లాడాడు. డ్రైవర్ కారుదిగి ఆ మనిషిని అనుసరించాడు. ఇద్దరూ మళ్ళీ ఇంట్లోకి వెళ్ళి కొద్దినిముషాల్లోనే మూడోమనిషితో తిరిగివచ్చారు. ఆ మనిషికి స్పృహ వున్నట్లులేదు. స్పృహ లేని ఆ మనిషి రమణయ్యయుండొచ్చునని సుబ్బారావు ఊహించాడు.

వాళ్ళిద్దరూ రమణయ్యను కారు వెనకసీట్లో పడుకో బెట్టారు. ఇద్దరూ ముందుసీట్లో కూర్చున్నారు. కారు కది లింది. సుబ్బారావు స్కూటర్ కూడా కదిలింది.

అనుభవం లేకపోయినా సుబ్బారావు కారును బాగానే అనుసరించగలిగాడు. ఆ కార్లో వాళ్ళు తమ నెవరో అనుసరిస్తున్నట్లు అనుమానించలేదు. కారు నెమ్మదిగా, సాఫీగా సాగింది. సుబ్బారావు సావకాశంగా దానిననుసరిస్తున్నాడు.

ఆఖరికి కారు ఒక బంగళాముందు ఆగింది. కారులోని వ్యక్తిలిద్దరూ దిగి రమణయ్యను బంగళాలోకి మోసుకుని వెళ్ళారు. కాసేపు ఆగి ఆ బంగళా ముందుకు వెళ్ళాడు సుబ్బారావు. అది ఒక ప్రైవేట్ నర్సింగ్ హోం-పేరు శాంతి. డాక్టర్ పేరు కరుణాకరం.

కారులోని వ్యక్తులు రమణయ్యను మోసుకుంటూ నిర్భయంగా ఎలా వెళ్ళగలిగారో సుబ్బారావుకు అర్థమైంది. అతను కాసేపు అటూ ఇటూ తచ్చాడాడు. ఏమేమో ఆలోచించాడు. ఈ నర్సింగ్ హోంకూ కొన్ని నేరాలకూ సంబంధముండి తీరాలని అతనికి అనిపించింది.

ఓ పావుగంట గడిచేక సుబ్బారావు సమీపంలోవున్న ఓ కాఫీహోటల్ కు వెళ్ళి-శాంతి నర్సింగ్ హోం గురించి వాకబుచేశాడు. ఆ నర్సింగ్ హోం అక్కడ అయిదారు సంవత్సరాలుగా వుంటున్నదనీ పేషెంట్లను చేర్చుకోవడం అరుదుగా జరుగుతూంటుందనీ అతనికి తెలిసింది. రోజూ సాయంత్రం నాలుగు నుంచి అయిదు వరకు మాత్రం ఔట్ పేషెంట్సు వచ్చివెడతాడు. అవే కన్సల్టింగ్ అవర్స్.

"కొన్ని ప్రైవేట్ విషయాలు ఫోన్లో మాట్లాడాలి. ఇక్కడ వీలవుతుందా?" అనడిగాడు సుబ్బారావు. హోటల్ యజమాని పక్కనేవున్న గది చూపించి "మీ ఇష్టం వచ్చినంతసేపు మాట్లాడండి. కాల్ కు అర్థరూపాయి చొప్పున ఫోన్ కు ఏర్పాటుచేసిన హోల్లో

వేయాలి. అదికాక స్పెషల్ రూం ఛార్జెస్ పావుగంటకు రెండురూపాయలు అదనం'' అన్నాడు.

ఈసదుపాయం బాగున్నదని తోచింది సుబ్బారావుకు. అతను ఆ గదిలోకి వెళ్ళి ఇన్‌స్పెక్టర్ రాఘవకు ఫోన్ చేసి తన అనుభవం చెప్పి శాంతి నర్సింగ్ హోంను సోదా చేస్తే కొన్ని నేరాలు బయట పడవచ్చునని చెప్పాడు. పోలీసులు మఫ్టీలో వస్తే చుట్టు పక్కలవారికి ఏవిధమైన అనుమానమూ ఉండదనీ ప్రస్తుతానికి అది అవసరమని తన ఊహాశక్తికి తోస్తున్నదనీ చెప్పాడు. రాఘవరావు ఫోన్‌లో అతనికి ధన్యవాదాలు చెప్పాడు.

సుబ్బారావు అక్కణ్నించి బయటపడి హోటల్ అతనికి డబ్బు పేచేసి మళ్ళీ వీధిలోకి వచ్చాడు. ఇప్పుడు తను ఏం చేయాలా అని ఆలోచిస్తూండగా ఎవరో అతన్ని పలకరించారు.

''మే ఐ నో యువర్ గుడ్ నేమ్ ప్లీజ్!''

సుబ్బారావు అతని వంక ఆశ్చర్యంగా చూసి_''నా పేరు సుబ్బారావు. మీకు తెలుగువచ్చా!'' అన్నాడు.

''నాకు తెలుగు బాగావచ్చు. నా పేరు కరుణాకరం.'' అన్నాడతను.

''కరుణాకరం అంటే?''

''డాక్టర్ కరుణాకరం. శాంతి నర్సింగ్ హోం నాదే...''

''అయ్‌సీ...''అని ఆగి_''నాతో మీకు పని ఉందా?'' అన్నాడు సుబ్బారావు.

''ఉంది. ఇందాకా మీరు హోటల్ రూంలో ప్రైవేట్‌గా టెలిఫోన్ చేశారే. ఆ సంభాషణంతా నేను విన్నాను...'' అని నవ్వాడతను.

# 15

"ఎవరు మీరు?" అన్నాడతను.

"నేనెవరో రమణయ్య నడిగితే చెబుతాడు..." అంటూ నవ్వాడా కొత్త వ్యక్తి.

"ఇన్‌స్పెక్టరు రాఘవరావుగారా..." అన్నాడు రమణయ్య.

"అవును మఫ్టీలో వచ్చాను" అన్నాడు రాఘవరావు.

అతను కంగారు పడుతూ_"మీకిక్కడ ఏం పని?" అన్నాడు.

"నిజానికి మాకిక్కడ ఏ పనీ లేదు. నువ్వు నాకు పని కల్పించావు. ఒక విధమైన క్రూర పైశాచిక మనస్తత్వం నిన్నావహించగా_ఏదో బలహీన క్షణంలో నేరం చేయా లని అనుకున్న కొందరు దౌర్భాగ్యులను చేరదీసి, ప్రోత్స హించి_వాళ్ళచేత నేరం చేయించి_నీ కళ్ళముందే జరిగిన ఆ నేరాన్ని చూసి ఆనందిస్తున్నావు. నేరాలకు సాక్ష్యా ధారాలు నీవద్దనే ఉంచుకుని ఆ నేరస్థులను బెదిరిస్తు న్నావు. కావాలనుకున్నప్పుడల్లా వాళ్ళచేత నేరాలు చేయించడం కోసం ఈ ఆధారాల నుపయోగించుకుంటు న్నావు." అన్నాడు రాఘవరావు.

"ఇదంతా మీ ఊహ. ఇలాంటి ఊహ మీకెందుకు వచ్చిందో నాకు తెలియడంలేదు." అన్నాడతను.

"ఇది ఊహకాదు, వాస్తవం. అందుకు ఈ రమణయ్యే సాక్షి. రమణయ్య, కృష్ణయ్య, మీనాక్షి_మేము నియో గించిన మనుషులు. నిన్ను అనుమానించి బయటపెట్టడం కోసం మేమాడిన నాటకం ఫలించింది." అన్నాడు రాఘవరావు.

అతని మాటలు పూర్తికాగానే అక్కడున్న మనిషి అదే పనిగా నవ్వసాగాడు. "రాఘవరావుగారూ-మీ ఊహ పెడత్రోవ పట్టింది. మీరు మమ్మల్ని తప్పుగా అర్థంచేసుకున్నారు. నిజానికి మేమొక సినిమా తీస్తున్నాం. సినిమా పేరు చంపకపోతే చస్తావ్! ఈ సినిమా టైటిల్సుకు ముందు ఒక వాస్తవిక సన్నివేశాన్ని ప్రవేశపెట్టాలనుకున్నాం. పేపర్లో రమణయ్య, కృష్ణయ్యల గురించి చదివి ఆ సన్నివేశం వీరిచేత నటింపజేయాలనుకున్నాం. ఈ సన్నివేశంలో తన భార్య మరొకడితో చనువుగా ఉండడం చూసి ఒకడు ఆవేశపడి హత్యచేస్తాడు. రమణయ్య, కృష్ణయ్య, మీనాక్షిలకు ముందు ఈ విషయం చెప్పకపోవడం ద్వారా సన్నివేశం సహజంగా తయారవుతుందనుకున్నాం. అయితే కథ తప్పుదారిలో వెళ్లింది.

అతను తన కథను నిజమని నిరూపించడానికి ఆ గదిలో ఉన్న ఏర్పాట్లు చూపించాడు. అక్కడా, ఆ పక్కగదిలోనూ ఉన్నవి బొమ్మ తుపాకులు, బొమ్మ పిస్తోళ్ళు. గదిలో మూవీ కెమేరా ఉంది.

"నేను నమ్మలేను." అన్నాడు రాఘవరావు.

"మీరు నమ్మినా నమ్మకపోయినా ఈ విషయాలు బయటి ప్రపంచానికి చెప్పవద్దు. మా సినిమా ఎలా తయారవుతున్నదీ ఎవరికీ తెలియకూడదు." అన్నాడతను.

"ఏమైనా మిమ్మల్ని అరెస్టు చేయక తప్పదు. ముగ్గురు మనుషుల్ని ఎత్తుకుని వచ్చారు మీరు." అన్నాడు రాఘవరావు.

"విషయాలన్నీ రహస్యంగా ఉంచితే మీరనుకునే నేరస్థుల్ని బయటపెట్టడానికి కృష్ణయ్య, మీనాక్షి, రమణయ్య ఇంకా పనికొస్తారు. అందువల్ల మీకే ప్రయోజనం?" అన్నాడతను.

# 16

సుబ్బారావుకు ముచ్చెమటలు పోశాయి.

కరుణాకరం, సుబ్బారావు వంకచూసి, "అయినా నాకు మీపైన కోపంలేదు. ఎందుకంటే అడ్వాన్సుగా మీ సంభాషణంతా విన్నాను. కాబట్టి అడ్వాన్సుగా మా వాళ్ళకు సంకేతాలుగూడా ఇచ్చేశాను. అవసరమైన జాగ్రత్తలు వాళ్ళు పడుతున్నారు. పోలీసులవల్ల వాళ్ళకే ఇబ్బందీ ఉండదు. ఎటొచ్చీ ఇంక నేను మీ గురించి తెలుసుకోవలసి ఉంది. ఎవరు మీరు. పోలీసు ఆఫీసరా?" అన్నాడు.

"కాదు. కానీ బాధ్యతగల సామాన్య పౌరుణ్ని." అన్నాడు సుబ్బారావు.

"మీకు కుక్క, గాడిద కథ తెలియదనుకుంటాను. యజమాని ఇంట్లో దొంగ పడుతూంటే కుక్క చూస్తూ ఊరుకుందిట. గాడిద గుర్తుచేసినా అది తన బాధ్యతను నిర్వహించనని మొండికేసి కూర్చుందిట. అప్పుడు కుక్క బాధ్యతను కూడా తనే నిర్వహిద్దామని గాడిద ఓండ్ర పెడితే_యజమాని కోపంగా నిద్రలేచి గాడిదను చావ బాదాడట. ఈ కథలోని నీతి ఏంటంటే ఇతరుల బాధ్యతను మనం స్వీకరించకూడదని. అర్థమయిందా?"

సుబ్బారావు ముఖం మాడిపోయింది. అయినా అతను నెమ్మదిగా__"ఇందులో నా స్వంత బాధ్యతకూడా ఉంది" అన్నాడు.

"ఏమిటది?"

"చెప్పను."

కరుణాకరం నవ్వి-"అది నువ్వు చెప్పలేవని నాకు తెలుసు. నాతోకూడా వస్తే - నువ్వెంత బాధ్యతారహి

తంగా ప్రవర్తిస్తున్నావో నీకే తెలుస్తుంది.'' అన్నాడు.

సుబ్బారావు ఆలోచనలు పరిపరి విధాలపోతున్నాయి. అతను కరుణాకరాన్ని అనుసరించాలని నిర్ణయించుకున్నాడు.

ఇద్దరూ కలిసి సుబ్బారావు స్కూటర్ మీదే కరుణాకరం ఇంటికి వెళ్ళారు.

కరుణాకరం సుబ్బారావును తన ఇంటి పడక గదిలోనికి తీసుకువెళ్ళి ''ఇది గోడలా కనబడుతోంది కాని ఇందులో తలుపువుంది. అక్కడొక రహస్యపు గది ఉంది. అందులోని వింతలు చూద్దురుగాని పదండి!'' అన్నాడు.

కరుణాకరం ఆ గది తలుపు ఎలా తెరిచాడో సుబ్బారావుకు తెలియలేదు. కానీ అతని వెనకనే ఆ గదిలో మాత్రం ప్రవేశించాడు.

ఆ గది చాలా విశాలంగా ఉంది. చూడ్డానికి ఒక చిన్న సైజు మ్యూజియంలా ఉంది. గది గోడల నానుకుని చుట్టూ ఉడెన్ టేబుల్సున్నాయి. టేబుల్స్పైన చిన్న చిన్న అద్దాల షో కేసులున్నాయి. ప్రతి టేబుల్కూ సొరుగులున్నాయి.

కరుణాకరం సుబ్బారావును ఒక షో కేస్ వద్దకు తీసుకువెళ్ళి ''మీ పేరు సుబ్బారావ్ని మీరు చెప్పక పూర్వమే నాకు తెలుసు. ఎందుకంటే మీరు లీలకు బాబాయి గనుక.'' అన్నాడు.

సుబ్బారావు ఉలిక్కిపడి. ''అంటే?'' అన్నాడు.

''లీలమీదకు రామాన్ని ప్రోత్సహించిన వాడిని నేనే! ఆ సన్నివేశానికి ఫొటోలు తీసి ఉంచుకున్నాను. ఆ సన్నివేశానికి గుర్తుగా అప్పుడు నలిగి చిరిగిన ఆమె బట్టలు నావద్ద ఉన్నాయి.'' కరుణాకరం ఒక్క క్షణం ఆగి

"లీల గురించీ, ఆమె కుటుంబ సభ్యుల గురించీ నా దగ్గర ఫొటోలతో వివరాలున్నాయి. ఆమెకూ రామానికీ సంబంధించిన వివరాలున్నాయి. ఏ పరిస్థితుల్లో నేరం జరిగిందో, ఎలా జరిగిందో వివరాలున్నాయి. మానభంగం కావించబడిన యువతి ప్రతిఘటనకు చిహ్నమైన ఆమె బట్టల అవస్థ యధాతథంగా నావద్ద భద్రపర్చబడి ఉంది." అన్నాడు.

"ఇదంతా ఎందుకు, బ్లాక్ మెయిలింగ్ చేయడానికా?" అన్నాడు సుబ్బారావావేశాన్ని అణచుకుని.

"ఎంత మాత్రమూ కాదు. తపాలా బిళ్ళలు సేకరించే హాబీ కొందరి కున్నట్లే నేరానికి సంబంధించిన వస్తువులను సేకరించడం నాహాబీ. వీలైనంతవరకూ ఆ వస్తువుల చరిత్రను కూడా సేకరిస్తూంటాను. నా హాబీని నాతో పాటు పంచుకునేవారు బహుకొద్దిమంది. అందరిలోనూ నావద్దనే ఎక్కువ కలెక్షన్ ఉండేది. ఇటీవల నా స్నేహితుడు కలెక్షన్లో నన్నుమించిపోయాడు. వాడిని అధిగమించడం కోసం నాకు నేనై నేరస్థులను ప్రోత్సహించి నేరాలకు దోహదంచేసి వస్తు సేకరణ చేయడం ఇటీవలే ఆరంభించాను."

సుబ్బారావు నోరు తెరిచి కరుణాకరం వంక చూస్తున్నాడు.

"ఇదేదో పిచ్చితనంలా కనబడుతోంది కదూ నీకు." కానీ వీటి విలువ నీకు తెలియదు. ఒక ఫారినర్ ఒక వస్తువుకు యాభై వేల డాలర్ల దాకా ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాడు. ఎందుకంటే ఇలాంటి వస్తు సేకరణ సులభ సాధ్యంకాదు." అన్నాడు కరుణాకరం.

"అయితే ఇదంతా నాకెందుకు చూపిస్తున్నావు? అందువల్ల నీ రహస్యం బయటపడిపోయినట్లే కదా!" అన్నాడు సుబ్బారావు.

"ఇంకా అర్థం కాలేదా? నా రహస్యం బయటపడితే నీ కుటుంబానికి ఎంత అవమానం? నేను నేరస్థుడిగా కోర్టులో నిలబడ్డానంటే లీలవంటి ఎందరో అభాగ్యురాండ్ర బ్రతుకులు వీధి కెక్కుతాయి. వాళ్ళ బ్రతుకులు వీధి కెక్కించే ఉద్దేశ్యం నాకు ఏ మాత్రమూ లేదు. అంతా నీలో ఉంది." అన్నాడు కరుణాకరం.

సుబ్బారావుకు నోటమాట రాలేదు. కరుణాకరం ఉద్దేశ్యం అతనికి అర్థమయింది. అతను బయటపడితే లీల బ్రతుకు కుక్క చింపిన విస్తరి అవుతుంది. చూస్తూ చూస్తూ తను అందుకు ఎలా పూనుకోగలడు?

"మిస్టర్ సుబ్బారావ్! ఇది నా హాబీ. ప్రమాదకరమైనదే అయినా నాకు చాలా సరదాగా ఉంది. నువ్వు బహుశా లీలా ద్వారా జరిగినది తెలుసుకుని పోలీసులకు సాయపడాలనుకుని ఉంటావు. ఆ ఆలోచన మానుకో. లీలకు ఏ ప్రమాదమూ ఉండదు. లీలకూ కూడా చెప్పాను. రామం కనుక ఆమెను బ్లాక్ మెయిల్ చేయడానికి ప్రయత్నిస్తే వాణ్ణి హత్యచేసే ఉపాయం కూడా చెబుతానని. కండిషన్ మాత్రం హత్యాయుధాన్ని నాకిచ్చేయాలని! ఈ ప్రపంచంలో ఎన్నో మ్యూజియాలున్నాయి. వాటిలో యుద్ధాల్లో ఉపయోగించబడ్డ ఆయుధాలున్నాయి. సమకాలీన హత్యాయుధాలనూ, నేర చిహ్నాలనూ సేకరించిన ఘనత మాత్రం నాకే దక్కుతుంది. నువ్వు నా జోలికి రావనీ, రాలేవనీ ఆశిస్తున్నాను." అన్నాడు కరుణాకరం.

సుబ్బారావు నిస్పృహగా అక్కణ్నించి కదిలాడు.

మర్నాడు రాఘవరావు అతన్ని కలిసి—"దొంగలు దొరికినట్లే దొరికి తప్పిపోయారు. ఇందుకు కారణమేమిటో మీ అద్భుత ఊహాశక్తితో చెప్పగలరా?" అనడిగాడు.

"పక్కన బరులు గాడిద అరిస్తే—దానికి మిగిలేవి చావు దెబ్బలే. నామానాన నన్ను బ్రతకనిద్దురూ—" అన్నాడు సుబ్బారావు.

రాఘవరావు ఆశ్చర్యంగా అతని వంక చూశాడు. తర్వాత వారిద్దరి మధ్యా మరెన్నడూ పరిశోధనల గురించిన సంభాషణలు నడవలేదు.

—:ఐపోయింది:—

# ఐదో హత్య?

**అజీజ్**

"డిటెక్టివ్ ఉత్తమ్ కుమార్ స్పీకింగ్!"

"నేను ప్రొఫెస్సర్ పాండురంగాన్ని మాట్లాడుతున్నాను."

"చెప్పండి!"

"ఫోన్‌లో చెప్పే విషయం కాదు. దయచేసి మీరు తక్షణం నా ఇంటికి బైలుదేరివస్తే బావుంటుంది!"

"ఆల్ రైట్! అడ్రస్ ఏమిటి?"

"లక్ష్మీ విలాస్, మాంబళం!"

"ఓ. కే. వస్తున్నాను." అంటూ రిసీవర్ దించి వెనుదిరిగాడు ఉత్తమ్ కుమార్ "ఎక్కడిదీ ఫోన్?" అడిగాడు అతని అసిస్టెంట్ సంజయ్, ఉత్తరాలకు స్టాంపులు అంటిస్తూ.

"ప్రొఫెస్సర్ పాండురంగం పిల్చాడు. చూద్దాం పద!" అంటూ కారు తాళం చెవులందుకుని బైటికి నడిచాడు ఉత్తమ్ కుమార్.

ఇద్దరూ తమ గ్రాబ్డిన్ కారెక్కి పావు గంటలో చేరుకున్నారక్కడికి. అధునాతనమైన, విశాలమైన భవనం అది. పోర్టికోలో పచార్లు చేస్తూ కనిపించాడు పాండురంగం. నలభై ఏళ్ళుంటాయతనికి. బట్ట తల. మంచి ఒడ్డూ పొడుగు. గ్లాస్కో పంచ సిల్కు చొక్కా.

అతని పక్కనే బెదురు చూపులు చూస్తూ నిల్చున్నాడో నౌఖరు.

కారు దిగుతూ టైం చూసుకున్నాడు ఉత్తమ్‌కుమార్.

సాయంత్రం నాలుగున్నర!

వాళ్ళని చూడగానే పాండురంగం గబగబ ముందుకు వచ్చి, "రండి. లోపలికి రండి" అంటూ ఇద్దర్నీ ఇంట్లోకి తీసికెళ్ళాడు. విశాలమైన హాలు. కింద మెత్తని మఖమల్ తివాచీ. హాలు కుడిపక్కన డ్రాయింగ్ రూం! వాళ్ళను డ్రాయింగ్ రూంలోకి తీసికెళ్ళాడు పాండురంగం.

లోపల అడుగు పెట్టగానే, ఊపిరి ఆగిపోయినట్టు స్థాణువులయ్యారు డిటెక్టివ్‌లు. నేలమీద, మఖమల్ తివాచీమీద వెల్లకిలా పడుందో శవం!

అందమైన యువతి శవం!!

సరిగ్గా ఛాతీలో రెండు వక్షోజాల నడుమ, పిడివరకూ దిగి ఉంది కత్తి!

పదునైన కత్తి!!

ఆ గాయం నించి చారలు చారలుగా కారి, పమిట మీదా, తివాచీమీదా గడ్డకట్టిన రక్తం! కళ్ళు రెండూ అరమోడ్పులుగా మూసి ఉన్నాయి. అరవడానికి తెరిచినట్టు నోరు సగం తెరిచి ఉంది!

అక్కడ అమర్చి ఉన్న వస్తువుల తీరునిబట్టి, హంతకుడి మధ్యా, హంతకుడి మధ్యా ఎటువంటి పెనుగులాటా జరగలేదని స్పష్టమౌతోంది.

శవాన్ని, గదినీ క్షుణ్ణంగా పరిశీలించి, పాండురంగం వైపు తిరిగి, "ఎవరీమె?" అడిగాడు ఉత్తమ్ కుమార్.

"నా కొత్త పిక్చర్లో పనిజేస్తున్న సైడ్ హీరోయిన్! రమ!"

"ఇంట్లో హత్య జరిగితే, ఎవ్వరైనా వెంటనే పోలీసులకు ఫోన్ చేస్తారు. మీరు చేశారా!"

"లేదు!"

"ఏం! పోలీసులకు తెలీజెయ్యకుండా, సరాసరి నాకు ఫోన్ చేసి పిలిపించారంటే, ఈ హత్యకూ, మీకూ సంబంధం ఉందని అనుకోవచ్చా?"

"ప్రమాణపూర్వకంగా చెబుతున్నాను. నాకీ హత్యతో ఎలాటి సంబంధంలేదు. పోలీసుల సంగతి మీకు తెలియంది కాదు. హత్య నా ఇంట్లో జరిగింది. పైగా ఇంట్లో ఎవ్వరూ లేరు. ఆ లెఖన వాళ్ళ దృష్టిలో నేనే టార్గెట్ నాతానని భయపడి, ముందు మీకు ఫోన్ చేశాను."

"ఆల్ రైట్! ఈమె మీ ఇంటి కెప్పుడొచ్చింది? ఎందుకొచ్చింది?"

"నా పిక్చర్లో పనిజేస్తున్న దృష్ట్యా తరుచూ వస్తూ ఉంటుంది. ఈ మధ్యాహ్నం ఒంటి గంటకు నేను డైనింగ్ హాల్లో భోంజేస్తున్న సమయంలో వచ్చింది. నాతోబాటు ఆమెనీ భోజనానికి పిల్చాను. భోజనాలయ్యాక ఇద్దరం ఇక్కడే డ్రాయింగ్ రూంలో కూర్చుని గంట సేపు మాట్లాడుకున్నాం.

మధ్యాహ్నం పూట కాసేపు పడుకునే అలవాటుంది నాకు. నిద్ర వస్తోందనీ, వెళ్ళిపడుకుంటాననీ చెప్పానామెతో. సరేనంది. మేడమీదికెళ్ళి పడుకున్నాను. నాలుగ్గంటలకు లేచివచ్చిచూస్తే ఈదృశ్యం కనిపించింది."

"మీరు వెళ్ళినా, ఆమె ఇక్కడే ఎందుకు కూర్చుంది?" అడిగాడు ఉత్తమ్ కుమార్ ఆశ్చర్యంగా.

"నన్ను వెళ్ళి పడుకోమనీ, తానొకరికి ట్రంకాల్ చేసి, మాట్లాడి వెళ్ళిపోతాననీ చెప్పింది."

"మీ కెవ్వరిమీదైనా అనుమానం ఉందా?"

"చెప్పలేను! ఖచ్చితంగా ఏమీ చెప్పలేను."

"పాండురంగంగారూ! మీ కథనం నన్ను జోకొట్ట వచ్చుగానీ, పోలీసుల్ని మభ్యపెట్టలేదు. నన్ను మీ డిఫెన్స్ కోసం వాడుకోవాలనుకున్నారు గనక, జరిగింది జరిగినట్టు నిజం చెప్పండి. ఈమె ఇక్కడికెందుకొచ్చింది?"

జవాబివ్వడానికి క్షణం తటపటాయించాడు పాండురంగం. తరవాత ఏమనుకున్నాడో ఏమో, తలెత్తి—

"డబ్బుకోసం వచ్చింది!" అన్నాడు.

"ఇచ్చారా?"

"లేదు!"

"ఏం?"

"రెండు రోజుల తరవాత ఇస్తానన్నాను."

"ఎందుకు? ఆమెకోరినంత డబ్బు మీ దగ్గర లేకా?"

"ఔను. నిజానికి ఆమెతో కుదుర్చుకున్న కాంట్రాక్ట్ పైకం ఎప్పుడో చెల్లించాను. ఐనా, అడపా దడపా నా దగ్గర డబ్బు దులపడానికి ప్రయత్నించేది?"

"అంత ధైర్యం, చనువూ ఎలా వచ్చాయామెకు?"

పాండురంగం పలకలేదు. కాసేపు తటపటాయించి, "నన్ను బ్లాక్ మెయిల్ చేసేది!" అన్నాడు నీర్సునముల్తూ.

డిటెక్టివ్ లిద్దరూ ఒకరి ముహాలొకరు చూసుకున్నారు.

"ఎందుకు జేసేది!" అడిగాడు ఉత్తమ్ కుమార్ సిగరెట్ అంటిస్తూ.

"ఇక మీ దగ్గర ఏమీ దాచకూడదు. రెండేళ్ళ క్రితం నేనో కొత్త పిక్చర్ ప్రారంభించనున్నట్లు తెలిసి, మా ప్రొడక్షన్ ఆఫీసుకువచ్చి నన్ను కలుసుకుంది రమ. తాను మంచి డాన్సర్ననీ, భరత నాట్యంలోనూ ప్రవేశం ఉందనీ, నా పిక్చర్లో డాన్సర్ గా అవకాశం కల్పించమనీ ప్రాధేయపడింది.

ఫోటో జెనిక్ ఉందో, లేదో చూద్దామని స్క్రీన్ టెస్ట్ జరిపించేను. డాన్స్ చేయించేను. నచ్చాయి. పిక్చర్లో తీసుకున్నాను. ఆ చిత్రం బాగానే నడిచింది. అలా పునాది పడింది ఆమె సినీ జీవితానికి. అంతేకాదు, రోజు రోజుకూ నాకు దగ్గర కాసాగింది.

తొలి సినిమా ఛాన్సు ఇచ్చినందుకు కృతజ్ఞతగా ఒక రోజు శరీరాన్నే అర్పించింది నాకు. ఆనాటినించీ ప్రారంభమైంది మా మధ్య రహస్య భాగోతం! ఈ మధ్య నేను ప్రారంభించిన మరో పిక్చర్లో ఆమెకు సైడ్ హీరోయిన్ రోల్ ఇచ్చాను. అక్కణ్ణించి ప్రారంభమైంది నా కష్టకాలం!

నా మెతకదనాన్నీ, బలహీనతనీ అలుసుగా తీసుకుని అడపాదడపా డబ్బు గుంజడం ప్రారంభించింది. ఓ రోజు ఊహించని పెద్ద మొత్తం అడిగితే ఇవ్వడానికి నిరాకరించేను. అప్పుడు చూపించింది ఫోటోలు! మేమిద్దరం కామకేళీ విలాసాల్లో మునిగి ఉన్న నగ్న ఫోటోలు!!

అప్పుడు బైటపడింది దాని నిజనైజం! తను కోరినంత డబ్బివ్వకుంటే, ఆ ఫోటోలు తక్షణం పత్రికా ప్రముఖులకివ్వబడతాయనీ, ఆ విధంగా నా పరువూ ప్రతిష్ఠా బజారు పాలయి, ప్రజల్లో నాపట్ల జుగుప్స ఏర్పడి, నా సినీ వ్యాపారం గంగలో కలుస్తుందనీ బెదిరించింది. అలా

ఇరుక్కున్నాను దాని సాలెగూడులో!'' అన్నాడు పాండురంగం నీరసంగా.

"తవ్వుతున్న కొద్దీ కొత్త విషయాలు బైటపడుతున్నాయి. ఈ మాత్రం వివరాలు పోలీసులకు తెలిస్తే చాలు. అరక్షణంలో మీ చేతులకి అరదండలు తగిలి, వెంటనడిగా కోర్టులో హాజరు పర్చబడతారు.''

"అందుకే మీ సహాయం అర్థిస్తున్నాను. నన్ను వాళ్ళ వలయంలో పడకుండా కాపాడే బాధ్యత మీది!'' అన్నాడు పాండురంగం దీన దృక్కులతో.

ఉత్తమ్ కుమార్ సాలోచనగా తలూపి, "మీరీ ఇంట్లో ఒంటరిగా నివసిస్తున్నారా?'' అడిగాడు.

"ఔను. నా భార్య వైదేహి మహాబలిపురంలో ఉంటుంది. అక్కడ మాకు భారీ వ్యవసాయం అదీ ఉన్నాయి. నిసీ వ్యాపకం దృష్ట్యా నేనిక్కడుంటున్నాను. ఆమె అప్పుడప్పుడూ వచ్చి పోతూంటుంది.

బహుశా, మీకు నా గత జీవితం తెలీదనుకుంటాను. ఇరవై ఏళ్ళ క్రితం నేను కడు పేదవాణ్ని. అష్టకష్టాలూ పడి, బి. ఏ. పట్టం పుచ్చుకుని, ఉద్యోగం వెతుక్కుంటూ కాలే కడుపుతో మహాబలిపురం జేరాను. అక్కడ అష్టైశ్వర్యాలతో తులతూగే ఓ విధవరాలి దగ్గర గుమాస్తా ఉద్యోగం లభించింది.

అనతికాలంలోనే ఆమె ఆదరాభిమానాలు చూరగొనగలిగేను. క్రమేపీ ఆమె నాపట్ల ఆసక్తి కనపరచసాగింది. ఆ తరవాత పరిస్థితులు క్రమేపీ ఎలా మలుపుతిరిగాయంటే వెంటనే మేము దంపతులమైపోయాం! ఆమే వైదేహి!!

నేను రమకు భయపడటానికి గల కారణాల్లో ఆమె కూడా ఒకర్తి. ఆ ఫోటోలు గనక నా భార్య కంట

బడ్డాయంటే, నే నామెనించే గాక, ఆమె అపార ఐశ్వర్యానికీ దూరమౌతాను. ఆ ఆస్తిపాస్తులన్నీ ఇప్పుడు ఆమె పేరే ఉన్నాయి మరి!"

"మీ భార్య ఎప్పుడైనా రమని చూసిందా?"

"చూసింది! స్టూడియో సెట్స్‌లో!"

"మీ ఇద్దరిమీద ఆమెకు చూచాయగానైనా అనుమానం కలగ లేదంటారా?"

"ఈ ప్రశ్నకు జవాబు ఖచ్చితంగా చెప్పడం కష్టం! కలగ లేదనే నేననుకుంటాను."

"ఇప్పుడు చెప్పండి. ఈ హత్యకు కారణం ఏమై ఉంటుంది?"

"ఆమె దుర్మార్గురాలే! ఆమె క్యారెక్టర్ హేయమైనది. నాలాగే ఇంకెందర్ని బ్లాక్ మెయిల్ జేస్తోందో తెలీదు. వాళ్ళలో నే ఎవ్వడో అవకాశం చూసి, ఈమెనిక్కడ హత్యజేసి, లేదా చేయించి ఉంటాడు.ఆ విధంగా నూటికి నూరుపాళ్ళు హత్యానేరం నామీదపడి, తాను సేఫ్ అవుతానని ఆశించి ఉంటాడు."

"రమ ఎక్కడ నివసించేది?"

"ఆలివర్ రోడ్‌లో, డోర్ నెంబర్ 3-1-146."

"ఒంటరిగానా?"

"కాదు. ఆమె తల్లి కూడా వెంట ఉండేది."

"మీ కొత్త పిక్చర్లో ఆమె రోల్ ఇంకా ఎంత వరకూ మిగిలి ఉంది?"

"పాచ్ వర్క్ తప్పించి, అంతా ముగిసినట్టే!"

'ఈమెకు మీతో అక్రమ సంబంధం ఉన్నట్టు మీ ప్రొడక్షన్ యూనిట్‌లో ఎవ్వరికైనా తెలుసా?"

"తెలుసు?"

"ఎవ్వరికి?"

"హీరోషు!"

"ఎవరా హీరో?"

"శ్రీకాంత్!"

"అతనికీ విషయం ఎలా తెలిసింది?"

పాండురంగం నవ్వి—"ఆమెను నా పిక్చర్లో బుక్ చేసుకోమని రికమెండ్ చేసింది అతనే!"

"అంటే, వాళ్ళిద్దరికీ పెుదటినించే పరియముందన్న మాట!"

"ఔను! కాని, ఈ మధ్య వాళ్ళకేదో విషయంలో మనస్పర్థ లొచ్చుంటాయి. మాట్లాడుకోడం లేదు. కారణం అడిగితే ఇద్దరూ ఏమీ చెప్పలేదు నాతో."

"ఆల్ రైట్! శ్రీకాంత్ అడ్రస్ చెప్పండి!"

పాండురంగం చెప్పిన అడ్రస్ని డైరీలో నోట్ చేసుకున్నాడు సంజయ్.

"మీ నౌఖర్ని కూడా కొన్ని ప్రశ్నలడగాలి. దయ చేసి మీరు బైటికెళ్ళి అయన్ని లోనికి పంపండి." అన్నాడు ఉత్తమ్ కుమార్ పూర్తయిన సిగిరెట్ని ఏష్ ట్రేలో నొక్కుతూ.

అతను వెళ్ళి, బైట నిల్చున్న నౌఖర్ని పంపేడు.

## 2

"నీ పేరేమిటి?"

"మల్లయ్యండి!"

"ఈ శవం ఇక్కడ పడుండటం నువ్వే చూశావా ముందు?"

"లేదండి. అయ్యగారే చూశారు."

"అంతవరకూ నువ్వెక్కడున్నావ్?"

"వంట గదిలో వంట మనిషికి సాయపడుతున్నానండి. మధ్యాహ్నం అయ్యగారు భోంచేసే వేళ టాక్సీలో వచ్చారండీమె. అయ్యగారీమెని డైనింగ్ హాల్లోకి తీసుకెళ్ళున్నారండి. ఇద్దరూ కలిసే భోంజేశారండి. తరవాత ఇక్కడికొచ్చి కూర్చున్నారండి. నేను కంచాలవీ తీసికెళ్ళి వంట గదిలో తోమడంలో మునిగిపోయానండి. తరవాత నేనూ ఇంత తిని, అయ్యగారు లేవగానే టిఫినందివ్వటానికి పెసరట్ల కోసం ఉల్లిగడ్డలు తరుగుతూ ఉండిపోయానండి. ఈ వైపు రానేలేదండి. అయ్యగారు కేకేసే వరకూ."

"సరే, మీ అమ్మగారికీ, అయ్యగారికీ ఎప్పుడైనా, ఏవిషయంలోనైనా పోట్లాట జరగడం చూశావా నువ్వు?"

"లేదండి. ఆవిడ నెలకు రెండు మూడుసార్లే వస్తారండిక్కడికి. అయ్యగారు కూడా అప్పుడప్పుడూ మహాబలిపురం వెళ్ళొస్తారు. వాళ్ళ మధ్య పోట్లాట జరగడం నేనెరగను."

"ఆమె వయసెంతుంటుంది?"

నౌఖరు కాస్త ముందుకు వంగి, రహస్యం చెబుతున్నట్లు "వయసులో ఆమె అయ్యగారికంటే ఏడేళ్ళు పెద్దవారేనండి." అన్నాడు.

"వీళ్ళకు పిల్లా జల్లా లేరా?"

"ఉన్నారండి. ఒకే కొడుకు. ఐతే, ఆయన అయ్యగారి సొంత కొడుకు కారండి!"

"అంటే!"

"అమ్మగారి మొదటి భర్త కొడుకండి!"

"అతను తల్లితో మహాబలిపురంలోనే ఉంటాడా?"

"కాదండి. ఇక్కడే మద్రాసులోనే ఉంటారు!"

"ఏసీ, అతని వయసెంతుంటుంది?"

"పాతికేళ్ళుంటాయండి. హీరోలా ఉంటాడు."

"మీ అమ్మగారు మద్రాసు వచ్చినప్పుడు అతన్ని కలుసుకుంటారా?"

"లేదండి. అతనికి తల్లంటే పడదండి."

"ఎందుకూ? ఈ ఇంటికూడా రాడా అతను?"

"అయ్యగార్ని పెళ్ళి చేసుకున్నందువల్లే కదండీ, అతనికి తల్లిమీద ద్వేషం!" అన్నాడు నౌఖరు మళ్ళీ స్వరం తగ్గించి.

"ఆల్ రైట్! అతనెక్కడుంటాడో తెలుసా నీకు?"

"తెలుసండి. గ్లోబ్ కంపెనీ బిల్డింగ్ పై అంతస్తులో ఉంటాడు. ఎందుకంటే, ఆ కంపెనీ అతనిదే!"

"అతని పేరేమిటి?"

"వంశీనాథ్!"

"ఆల్ రైట్! నువ్వింక వెళ్ళొచ్చు." అంటూ హాలువైపు నడిచాడు ఉత్తమకుమార్.

హాలుమధ్య సోఫాలో కూర్చుని, చేత్తో నుదురు రాసుకుంటున్నాడు పాండురంగం. వాళ్ళని చూడగానే లేచి నిల్చున్నాడు.

"నా ప్రాథమిక దర్యాప్తు ఇంతటితో ముగిసినట్టే. ఇక పోలీసుల్ని పిలవడమే తరువాయి. మీరు నిజంగా నిర్దోషులని నాకు నమ్మకం కలిగిన పక్షంలో మీకెలాటి హానీ జరక్కుండా చూసే పూచీ నాది!" అంటూ సంజయ్ వైపుతిరిగి, "క్రైంబ్రాంచ్‌కి ఫోన్ చేసి, ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డిని రమ్మను" అన్నాడు ఉత్తమకుమార్.

టీపాయ్‌మీద టెలిఫోన్ అందుకున్నాడు సంజయ్.

పదినిమిషాల్లో హుటాహుటిన వచ్చి ఆగాయి పోలీస్

వాహనాలు. అరడజనుమంది సిబ్బందితో దిగారు ఇన్స్పెక్టర్ రాజారెడ్డి, సార్జంట్ డేవిడ్‌లు.

డిటెక్టివ్ ద్వయాన్ని చూడగానే, "మాకంటే ముందే ప్రత్యక్షమయ్యారన్నమాట!" అన్నాడు రాజారెడ్డి చిరునవ్వుతో.

వాళ్ళతో అతనికి పాతపరిచయం వుంది. అనేక కేసుల్లో కలిసి పనిచేశారు కూడా.

ఉత్తమకుమార్ అతనికి తను సేకరించిన వివరాలు చెప్పి, "మీ రొటీన్ వర్క్ పూర్తిచేసి, శవాన్ని మార్చ్యురీకి పంపండి. నేను రమతల్లితో మాట్లాడి వస్తాను" అంటూ సంజయ్‌తో బైటికి నడిచాడు.

అప్పటికే సాయంత్రం ఆరుగంటలవుతోంది కనక, వీధుల్లో లైట్లు వెలుగుతున్నాయి. గ్రాబ్డిన్ కారెక్కి ఇద్దరూ అలివర్ రోడ్ వైపు బైలుదేరారు.

# 3

రమ హత్యజరిగిందని విని ఆమె తల్లి శిలాప్రతిమై పోయింది. మొదట నమ్మలేదు. తరవాత గొల్లున ఏడవడం ప్రారంభించింది. ఆమెను ఓదార్చడం తమ శక్తికిమించిన పనిలా తోచింది డిటెక్టివ్‌లకు.

ఐనా చివరి ప్రయత్నంగా, "మీ బిడ్డను చంపిన హంతకుడింకా పట్టుబడలేదు. మీరిలా ఏడుస్తూ కూర్చుంటే అవతల హంతకుడు మా దృష్టినించి యింకా దూరమయ్యే ప్రమాదముంది. అందుకే, మేమడిగే ప్రతిప్రశ్నకూ దాచకుండా జవాబులిచ్చి మాతో సహకరించడం మంచిది" అన్నాడు ఉత్తమకుమార్.

కాసేపటికి ఆమె తేరుకుంది. పైటతో మొహం తుడుచుకుంటూ "చెప్పండి!" అంది డగ్గుత్తికతో.

"వ్యక్తిగతంగా మీకు ఎవ్వరిమీదైనా అనుమానం వుందా?"

"లేదు!"

"మీ అమ్మాయికి అత్యంత సన్నిహితులైన స్నేహితు లెవ్వరైనా వున్నారా?"

"ఒకేఒక స్నేహితురాలుంది. పద్మజ!"

"ఎవరామె?"

"క్లబ్ డాన్సర్! ఆ ముదనష్టపుదానివల్లే బంగారం లాంటి నా బిడ్డ బ్రతుకు నాశనమైంది!"

"కాస్త వివరంగా చెప్పండి!" అన్నాడు ఉత్తమ్ కుమార్ సిగరెట్ అంటిస్తూ.

"నాలుగేళ్ళ క్రితం మేము కోయంబత్తూర్‌లో వుండే వాళ్ళం! స్కూల్ ఫైనల్ పాసయ్యాక అమ్మాయి అభీష్టాన్ని కాదనలేక, ఓ డాన్స్‌స్కూల్లో భరతనాట్యం నేర్చుకుంటానంటే చేర్పించాము. పద్మజది కూడా ఆ ఊరే! అది కూడా ఆ స్కూల్లోనే నాట్యం నేర్చుకునేది.

దానికి మొదటినించీ సినిమాలపిచ్చి ఎక్కువ. మాయ మాటలతో నా బిడ్డని సినిమావ్యామోహంలో పడేసింది. నాట్యం నేర్చుకోడం పూర్తికాగానే, ఇద్దరూ చెప్పా చెయ్యకుండా మద్రాసు వచ్చేశారు. హీరో శ్రీకాంత్‌తో పరిచయం సంపాదించుకున్నారు. వాడు వీళ్ళిద్దరికీ నానా దురలవాట్లూ నేర్పి, వదిలేడు.

రమ సినిమాల్లో ఎలాగో చిన్నచిన్న వేషాలు సంపాదించగలిగింది. అది మాత్రం క్లబ్బుల్లో ఒళ్ళూపుకుంటూ బ్రతుకుతోంది. ఇవన్నీ తెలిసి, నా భర్త కుమిలి కృశించి ఏడాదిక్రితం చనిపోయారు. నాకు వెనకా ముందూ ఎవ్వరూ లేక, ఇక్కడ కూతురుపంచన చేరాను..." అంటూ తిరిగి భోరుమందామె.

ఉత్తమకుమార్ కాసేపు మౌనం వహించి, సడన్‌గా ఏదో ఆలోచన తట్టి—"మీ అమ్మాయి ఎవరినైనా ప్రేమించినట్టు చెప్పిందా మీతో?" అడిగాడు.

"అలాటిదేమీ చెప్పలేదు. కానీ, రెండు నెలల నించీ దానిలో ఏదో మార్పు వచ్చినట్టు తోచింది నాకు. అంతే కాదు, త్వరలో తాను పెళ్ళిచేసుకుని ప్రస్తుత వ్యాపకానికి తిలోదకాలిస్తానని చెప్పసాగింది!"

"అలాగా! ఆమె తన వెంట యెప్పుడైనా మగవాళ్ళను కూడా తీసుకొచ్చేదా ఇక్కడికి?"

"మగాళ్ళు తరుచూ వచ్చేవారు. కాని, వాళ్ళలో ప్రొడ్యూసర్ పాండురంగం, హీరో శ్రీకాంతులు తప్ప నాకెవ్వరూ తెలీదు."

"ఆల్ రైట్! ప్రస్తుతం పద్మజ ఏ క్లబ్బులో డాన్స్ చేస్తోంది?"

"క్వాలిటీ క్లబ్బులో!"

ఆమెదగ్గర సెలవుతీసుకుని కారెక్కుతూ, టైం చూసుకున్నాడు ఉత్తమకుమార్.

రాత్రి ఎనిమిది గంటలు!

## 4

"రమ హత్యజరిగిందా? మైగాడ్! ఈ రోజు మధ్యాహ్నమే నన్ను కలుసుకుని వెళ్ళిందే! అంతలోకే..." పద్మజ కళ్ళల్లో నీళ్ళుతిరిగాయి.

"మధ్యాహ్నం ఎన్నిగంటలకి వచ్చింది నీ దగ్గరికి?"

"పన్నెండు గంటలకు!"

"ఎందుకు వచ్చింది?"

"రోజూ మధ్యాహ్నం వచ్చిపోతూంటుంది!"

"అదే ఎందుకూ అని అడుగుతున్నాను?"

"మా స్నేహం అటువంటిది! ఒక్క రోజు కూడా ఒకర్నొకరం చూసుకోకుండా ఉండలేము. ఈ లోకంలో రమతప్ప నాకు ఆత్మీయులంటూ ఎవ్వరూ లేరు."

"ప్రాణస్నేహితుల మధ్య రహస్యాలుండవంటారు. రమ తన రహస్యాలు నీతో చెప్పేది కాదా?"

"చెప్పేది నేదే అనుకుంటాను."

"ప్రొడ్యూసర్ పాండురంగంతో తనకు సంబంధం వున్న సంగతి చెప్పిందా నీతో?"

"చెప్పింది!"

"ఈమధ్య పాండురంగాన్ని బ్లాక్ మెయిల్ చెయ్యడం ప్రారంభించానని కూడా చెప్పిందా?"

"నో! ఆ విషయం మాత్రం నాకు చెప్పలేదు."

"పాండురంగంలాగే హీరో శ్రీకాంత్ తోనూ ఆమెకు సంబంధం వుండేదా?"

"ఉండేది! ఒకప్పుడు! ఐతే, ఈ మధ్య వాళ్ళ సంబంధాలు భిన్నాభిన్నమయ్యాయి. మాట్లాడుకోడం లేదు."

"కారణం చెప్పలేదా?"

"నేను అనేకసార్లు అడిగిచూశాను. చెప్పలేదు. అడిగినప్పుడల్లా మాట మార్చేది."

"మీరిద్దరూ సినిమా వ్యామోహంలోపడి, మహాబలిపురం నించి మద్రాసు వచ్చి ఒకేసారి ప్రైవేశారు. మరి రమకి మాత్రమే సినిమాల్లో ఛాన్సు దొరికి, నీవు క్లబ్బుల్లో డాన్సర్ గా మారడానికి కారణం?"

"రమ స్క్రీన్ టెస్టులో కుదురుగా వచ్చింది. నాది ఫోటోజెనిక్ ఫేస్ కాదు. అందుకే యీ వృత్తి చేపట్టాను."

"వంశీనాథ్ తెలుసా నీకు?"

"తెలుసు!"

"ఎలా?"

"ఒకసారి రమ అతన్నిక్కడికి తీసుకువచ్చి నాకు పరిచయం చేసింది!"

"అతను పాండురంగానికి స్టెప్ సన్ అవుతాడని కూడా తెలుసా నీకు?"

"తెలుసు!"

"ఐతే, రమకి అతనితో స్నేహం ఏమిటి?"

"వాళ్ళమధ్య అంత చెప్పుకోతగ్గ స్నేహంవున్నట్టు నాకనిపించలేదు."

"ఈ రోజు ఒంటిగంట తరవాత అంటే, రమ నిన్ను కలుసుకుని వెళ్ళిన తరవాత నువ్వెక్కడున్నావ్?"

"ఇక్కడే! నా గదిలోనే. మధ్యాహ్నం భోంచేశాక నిదరపోయే అలవాటుంది నాకు. రెండు గంటలనించీ, సాయంత్రం ఐదుగంటల వరకూ నిశ్చింతగా నిద్రపోయి, ఫ్రెష్ అవుతాను. కారణం, నా వృత్తి అటువంటిది. నిద్రపోయి లేచాక, మొహంలో కాస్త కళవస్తుంది. రాత్రి పదిగంటలవరకూ క్లబ్‌లో డాన్స్‌ప్రోగ్రామ్స్ వుంటాయి మరి. అలసట వుండదు."

"ఆల్ రైట్! రమ ఎప్పుడైనా తను త్వరలో పెళ్ళి చేసుకోబోతున్నట్టు చెప్పిందా నీతో?"

"చెప్పింది!"

"ఎవర్ని చేసుకోవాలనుకుందిట?"

"అదే చెప్పలేదు. సస్పెన్సులో వుంచింది. అనేకసార్లు తరిచి తరిచి అడిగితే శుభలేఖ చేతిలో పెట్టాక, ఎలాగూ తెలుస్తుందిగా అని దాటవేసేది."

"సరే. అవసరమైనప్పుడు మళ్ళీవచ్చి కలుసుకుంటాను" అంటూ ఆ మెదగ్గర సెలవుతీసుకుని అక్కణ్నించి బైలు దేరాడు ఉత్తమ్‌కుమార్.

కారు స్టార్ట్ చేసి, "ఇప్పుడెక్కడికి?" అడిగాడు సంజయ్.

"గ్లోబ్ కంపెనీకి! వంశీనాథ్‌ని కలుసుకోవాలి" అంటూ రిస్టువాచీ చూసుకున్నాడు ఉత్తమ్‌కుమార్.

రాత్రి తొమ్మిదింబావు.

"కారు ముందుకు పోనిచ్చి, ఆక్సిలేటర్ నొక్కాడు సంజయ్.

# 5

గ్లోబ్ కంపెనీ పైఅంతస్తులోనే వుంది వంశీనాథ్ నివాసం! తలుపుమీద అతని పేరు చెక్కిన ఇత్తడి నేమ్ ప్లేట్ బిగించివుంది. కాలింగ్ బెల్ నొక్కాడు సంజయ్.

రెండునిమిషాల తరావాత తలుపు తెరుచుకుంది. ఖాకీ నిక్కరూ, షర్టూ తొడుక్కున్న నౌకరు కుర్రాడు ప్రశ్నార్థకంగా చూసేడు వాళ్ళని.

"వంశీనాథ్ వున్నారా?" అడిగేడు సంజయ్.

"ఉన్నారు."

ఉత్తమ్‌కుమార్ విజిటింగ్ కార్డుతీసి అందించాడతనికి.

అతను లోనికెళ్ళి, క్షణంలో తిరిగివచ్చి, "రండి పిలుస్తున్నారు" అన్నాడు వినయంగా.

డిటెక్టివ్‌లిద్దరూ లోన అడుగుపెట్టారు. ఎదురుగా సోఫాలో కూర్చున్న పాతికేళ్ళ యువకుణ్ణి చూడగానే గ్రహించారు, వంశీనాథ్ అతనే అయ్యుంటాడని. ఉంగరాలజుత్తు. అందమైన కళ్ళు. పచ్చగా, పొడుగ్గా, అమ్మాయిలా వున్నాడు మనిషి.

వాళ్ళని చూడగానే లేచి, "ప్లీజ్, కమిన్! మీ గురించి పేపర్స్‌లో అప్పుడప్పుడూ చదువుతూంటాను. ఈరోజు ఊహించని విధంగా మీ విజిటింగ్ కార్డు చూసి ఆశ్చర్యపోయాను - నన్ను వెదుక్కుంటూ వచ్చారేమిటా అని" అన్నాడు సోఫాలు చూపుతూ.

వాళ్ళు కూర్చున్నాక, "చెప్పండి. నేను మీకే విధంగా సహాయపడగలను?" అన్నాడు.

"నా ప్రశ్నలకి సూటిగా జవాబిస్తే చాలు. మీరు చివరిసారిగా మీ నాన్నగార్ని, అంటే పాండురంగంగార్ని ఎప్పుడు కలుసుకున్నారు?" అడిగాడు ఉత్తమ్‌కుమార్ అసలు విషయానికి వస్తూ.

"నేనా? ఆయన్ని కలుసుకోడమా? నో. ఇంతవరకూ ఒక్కసారి కూడా కలుసుకోలేదు. నేనాయన్ని నా బంధువుగా ఎన్నడూ అనుకోలేదు."

"మీ అమ్మగార్ని కూడా కలుసుకోలేదా?"

"ఆవిడే యిక్కడికి వచ్చి నన్ను చూసిపోతూంటుంది."

"చివరిసారిగా ఆవిడ మిమ్మల్నెప్పుడు కలుసుకుంది?"

"వారంరోజుల క్రితం!"

"వాళ్ళిద్దరూ యిప్పటికీ అన్యోన్యంగానే వుంటున్నారా?"

"వాళ్ళనెప్పుడూ కలుసుకోనిదే ఎలా తెలుస్తుంది వాళ్ళ అన్యోన్యత గురించి? ఇంతకీ మీరిలాటి ప్రశ్నలు ఎందుకడుగుతున్నారు నన్ను?"

"మీతోనూ, మీ కుటుంబంతోనూ పరిచయమున్న ఒక యువతి హత్య చెయ్యబడింది గనక!"

"ఎవరా యువతి?" వంశీనాథ్ కంఠంలో ఆత్రుత.

"సినీతార రమ!"

"రమ హత్య చెయ్యబడిందా? ఎందుకు? ఎవరు చేశారు?" ఆశ్చర్యంతో అతనికళ్లు పెద్దవయ్యాయి.

"హత్య ఎందుకు జరిగిందో, ఎవ్వరుచేశారో యింకా తేలలేదుగానీ, ఆమె పాండురంగం యింట్లో చంప బడింది!"

"ఐతే, ఆ యింటికీ, నాకూ ఏమిటి సంబంధం?"

"ఆ యింటికీ మీకూ సంబంధం లేకున్నా, రమతో మీకు పరిచయం వున్నట్టు మా దర్యాప్తులో తేలింది! నిజమేనా?"

"నిజమే! అంత మాత్రాన..."

"నా ఉద్దేశం అదికాదు. అడిగిందానికి సూటిగా జవా బివ్వండి. ఆమెకు పాండురంగంతో కూడా స్నేహం వుందేదని మీకు తెలుసా?"

"తెలీదు!"

"ఆమెతో మీకూ స్నేహంవున్న సంగతి మీ అమ్మ గారికి తెలుసా?"

"తెలీదనుకుంటాను."

"పాండురంగంతో రమకి అక్రమసంబంధం వుందేదని మీ అమ్మగారికి తెలుసా?"

"నాకు తెలీదు!"

"రమ త్వరలో పెళ్ళి చేసుకోబోతోందని మీకు తెలుసా?"

"తెలీదు."

"ఎప్పుడైనా ఆమె మీ దగ్గర డబ్బు అడిగిందా?"

"లేదు. ఎప్పుడూ అడగలేదు."

"మీ రామెని చివరిసారి ఎప్పుడు చూశారు?"

"ఈ రోజు ఉదయం!"

"ఎన్ని గంటలకు?"

"పది గంటలకు!"

"ఎక్కడ?"

"ఇక్కడే. నా ఆఫీసులోనే!!"

"ఆమె ఇక్కడికెందుకొచ్చింది?"

"నేనే ఫోన్ జేసి పిలిపించాను."

"ఎందుకు?"

"నిజానికి, నేనూ ఓ పిక్చర్ తీసే ప్రయత్నంలో ఉన్నాను. అందులో ఈనాడు బాక్సాఫీస్ హిట్ హీరోగా చలామణీ అవుతున్న శ్రీకాంత్ను బుక్ జేసుకోవాలనుకుంటున్నాను. ఆ చిత్రంలో సైడ్ హీరో పాత్ర స్వయంగా నేనే వేసి, వెండి తెరకు పరిచయం కాబోతున్నాను.

ఆ వేసేదేదో హీరోగానే ఎందుకు వెయ్యకూడదని మీరడగవచ్చు. సినీ పరిశ్రమ స్టార్ ఇమేజ్ మీద నడిచే బిజినెస్. లక్షలు గుమ్మరించి, మొదటి చిత్రంలో నేనే హీరో పాత్ర వేస్తే, ప్రజలు దాన్ని తిప్పికొడితే చివరికి చిప్ప చేతికొస్తుంది.

అదే శ్రీకాంత్ని హీరోగా పెట్టి, అతని పంచన నేనూ నలుగురి దృష్టిలో నాని, నటుడిగా ఓ గుర్తింపు తెచ్చుకుంటే, ఆ తరవాత పరిశ్రమలో పాతుకు పోవచ్చు. అదీ సంగతి!

శ్రీకాంత్తో నాకు వ్యక్తిగత పరిచయం లేదు. అందుకే అతని అలవాట్లూ, వ్యక్తిత్వమూ ఎటువంటివో, నిర్మాతలతో ఏవిధంగా వ్యవహరిస్తాడో తెలుసుకుందామని రమని పిలిపించాను."

"ఏమంది?"

"మంచివాడు కాదనీ, అహంకారుడనీ కాల్ షీట్స్ సరిగ్గా ఫాలో అవడనీ, షూటింగ్స్‌కి చాలా ఆలస్యంగా వస్తాడనీ ఐనా, ప్రజల కతనిమీదున్న ఇమేజ్ దృష్ట్యా నిర్మాతలు అతన్ని భరిస్తూ బుక్ జేసుకుంటున్నారనీ చెప్పింది!"

"ఆల్ రైట్! క్వాలిటీ క్లబ్‌లో డాన్సర్‌గా పనిజేసే పద్మజ తెలుసా మాకు?"

"ఒక రోజు టైంపాస్ కోసం నేనా క్లబ్‌కెళ్తే, అక్కడ రమ కనిపించి, ఆమెను పరిచయం జేసింది. అంతే!"

"దట్సాల్! ఇక వస్తాము." అంటూ లేచాడు ఉత్తమ్ కుమార్.

"అరె! కాఫీ, టిఫిన్ తీసుకోకుండానే. ప్లీజ్. కూర్చోండి." అన్నాడు వంశీనాధ్ వారినూ.

"మళ్ళీ వచ్చినప్పుడు తప్పక తీసుకుంటాం!" అంటూ సంజయ్‌తో బైటికి నడిచాడు ఉత్తమ్ కుమార్.

అక్కణ్ణించి తిన్నగా క్రైంబ్రాంచ్ హెడ్ క్వార్టర్స్ జేరుకున్నారిద్దరూ.

ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి ఇంకా తన ఆఫీసులోనే ఉన్నాడు. డిటెక్టివ్‌లను చూడగానే సాదరంగా ఆహ్వానించాడు.

"శవం మార్చ్యురీ రిపోర్టు అందిందా మీకు?" అడిగాడు ఉత్తమ్‌కుమార్ కూర్చుంటూ.

ఇన్‌స్పెక్టర్ బల్లమీది ఫైలుతీసి అతని ముందుంచాడు.

రమ శవ పరీక్ష జరిపి, పోలీస్ డాక్టర్ రాసిన ఆ రిపోర్టు చదవగానే ఉత్తమ్‌కుమార్ బుర్ర గిరగిర తిరిగి పోయింది! కారణం, అంతవరకూ అతని మస్తిష్కంలో

రూపు దిద్దుకుంటున్న హంతకుడి రూపాన్ని ఆ రిపోర్టు ఛిన్నాభిన్నం చేసి వేసింది.

అందులోని వివరాలు ఇలా ఉన్నాయి.

హత్య జరక్కముందు ఆమె వట్టి మనిషి కాదు.

మూడు నెలల గర్భిణి!

హత్య మధ్యాహ్నం మూడూ, నాలుగు గంటలమధ్య జరిగింది. ఆరంగుళాల పదునైన కత్తి ఛాతీని చీలుస్తూ పిడివరకూ దిగబడింది గుండె పక్కన. ఆ ఒక్క పోటుకే ఆమె ప్రాణం పోయింది. అంతేకాదు, రసాయన పరీక్షల వల్ల హత్యకు కొద్ది నిమిషాల ముందు ఆమెను బలాత్కరించినట్టు కూడా స్పష్టమయింది.

అంతేకాదు, హతురాలికి మత్తుపానీయాలు సేవించే అలవాటు కూడా ఉండేదని స్పష్టమైంది.

ఆ పోస్ట్‌మార్టం రిపోర్ట్ చదివాక, ఉత్తమ్ కుమార్ మస్తిష్కంలో అసంఖ్యాకమైన ప్రశ్నలు సముద్రపు కెరటాల్లా ఉవ్వెత్తున లేచి పడసాగాయి.

ఆ రిపోర్టు ద్వారా రమ వ్యక్తిత్వం, జుగుప్సాకరజీవితం బట్టబయలవుతోంది. అంతవరకూ అతను కలుసుకున్న వాళ్ళెవ్వరూ చూచాయగానైనా రమ గర్భవతి అని చెప్పలేదు!

ఆమె కడుపులో రూపు దాల్చిన బిడ్డకు తండ్రి ఎవరు? ఆమె పెళ్ళిచేసుకోబోతున్నట్టు ప్రచారం చేసుకున్న వ్యక్తేనా అతను? హత్యకు ముందు ఆమెను అనుభవించింది హంతకుడేనా? ఆమె ఆమోదం మీదే ఆ పని జరిగిందా?

గతంలో ఆమెను కత్తితో ఎవరు పొడిచారు? ఎందుకు పొడిచారు? తను గర్భం ధరించినట్లు ఆమె తన ప్రాణ స్నేహితురాలితో చెప్పడం అటుంచి, కన్నతల్లితో కూడా ఎందుకు చెప్పలేదు?

ఉత్తమ్ కుమార్ నీరసంగా లేచి ఉదయం మళ్ళీవస్తా వని ఇన్‌స్పెక్టర్ దగ్గర సెలవు తీసుకుని సంజయ్‌తో కారెక్కాడు.

# 6

టీపాయ్‌మీది టెలిఫోన్ గణగణ మోగడంతో ఉలిక్కిపడి నిదరలోంచి కళ్ళు తెరిచాడు ఉత్తమ్ కుమార్.

బైట పిచుకల కిచకిచారావాలు వినిపిస్తున్నాయి. మంచంమీద పక్కకి ఒరిగి రిసీవరందుకున్నాడు.

"హలో, ఉత్తమ్‌కుమార్ స్పీకింగ్!"

"నేను ఇన్స్‌పెక్టర్ రాజారెడ్డిని మాట్లాడుతున్నాను. మీరు వెంటనే క్వాలిటీ క్లబ్బుకు బైలుదేరి రావాలి!"

"ఏం జరిగిందక్కడ?" ఆతృతగా అడిగేడు డిటెక్టివ్.

"హత్య!"

"ఎవరిది?"

"ప్రొద్దున్నే ఫోన్లో యిలాటి పాడుకబుర్లు చెప్పడం బావుండదు. రండి. ఇక్కడే తెలుస్తుంది" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఆల్ రైట్! వస్తున్నాం!" అంటూ రిసీవర్ క్రెడిల్ చేసి, ఒక్క ఉదుటున మంచం దిగి, పక్కనే యింకా గుర్రుకొడుతున్న సంజయ్‌ని నాలుగుచరిచి లేపాడు.

పావుగంటలో డిటెక్టివ్‌ల కారు క్వాలిటీ క్లబ్బ చేరుకుంది. పోలీస్ సిబ్బందితో కిటకిటలాడుతోంది క్లబ్బ ఆవరణ.

వాళ్ళని చూడగానే ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి ముందుకు వచ్చి, "రండి. శవం పైగదిలో వుంది" అంటూ వాళ్ళని వెంటబెట్టుకుని లోనికి నడిచాడు.

పై అంతస్తులో ఓ గదిముందు క్లబ్బు మేనేజరూ, సార్జంట్ డేవిడ్, ఫోటోగ్రాఫర్స్, ఫింగర్ ప్రింట్ ఎక్స్‌పర్ట్స్ నిల్చునున్నారు. ఇన్‌స్పెక్టర్ వెంట గదిలో అడుగు పెట్టారు డిటెక్టివ్‌లు.

మంచంమీద వెల్లకిలా పడుంది శవం!

వేరే ఎవ్వరిదో కాదు.

క్లబ్బుడాన్సర్ పద్మజ శవం!!

సరిగ్గా ఛాతీమధ్య కత్తి!

పిడివరకూ దిగిన కత్తి!!

కళ్ళురెండూ రెప్పవెయ్యకుండా గదికప్పును చూస్తున్నట్టున్నాయి. ఉల్లిపొరలాంటి గులాబీరంగు స్లీపింగ్ గౌన్‌లో ఆమె బిగువైన పచ్చని అవయవాలు మసక మసకగా కనిపిస్తున్నాయి.

"శవాన్ని మొదట ఎవ్వరు చూశారు?" అడిగాడు ఉత్తమకుమార్.

"నేనే!" అన్నాడు క్లబ్బు మేనేజర్.

"మీరు ఎన్ని గంటలకు వచ్చారిక్కడికి?"

"ఉదయం ఏడుగంటలకు!"

"రోజూ అదేటైంకు వస్తారా?"

"ఔను!"

"మీరు వచ్చినప్పుడు యిక్కడ ఎవరెవరున్నారు?"

"గేటుదగ్గర నైట్‌వాచ్‌మెన్, లోపల మురళీ వున్నారు!"

"మురళీ ఎవరు?"

"మా కౌంటర్ క్లర్క్!"

"ఇక్కడేం చేస్తున్నాడు?"

"అతనుండేది ఇక్కడే! పద్మజలాగే అతనికీ ఓ గది కేటాయించాం!"

"అంటే, రాత్రి క్లబ్బు కట్టేశాక, యిక్కడుండేది వాళ్ళిద్దరేనన్నమాట?"

"ఔను."

"అతని క్యారెక్టర్ ఎటువంటిది?"

"మంచిదేనని నా అభిప్రాయం!"

"రాత్రిళ్ళు ఇద్దరూ ఒంటరిగా వుంటారుగనక, వాళ్ళ మధ్య..."

"చెప్పలేను. అటువంటి భాగోతం వుందో లేదో ఖచ్చితంగా చెప్పలేను!" అన్నాడు మేనేజర్ వెంటనే.

"ఆల్ రైట్ మురళిని పిలిపించండి" అన్నాడు ఉత్తమ్ కుమార్ సిగరెట్ అంటిస్తూ.

మేనేజర్ బైటికెళ్ళి అతన్ని పిల్చుకొచ్చాడు. గత రాత్రి తమని గ్రీన్ రూంలో వున్న పద్మజ దగ్గరకి తీసి కెళ్ళింది అతనేనని గ్రహించాడు ఉత్తమ్ కుమార్.

"రాత్రి మీ క్లబ్బు ఎన్నిగంటలకు మూయబడింది?" అడిగాడతన్ని.

"రెండుగంటలకు!"

"ఆ తరవాత నువ్వెక్కడున్నావ్?"

"పడుకోడానికి నా గదికెళ్ళాను."

"నీ గది ఎక్కడుంది?"

"పద్మజ గది పక్కన నాలుగోగది!"

"అప్పుడామె ఏంచేస్తోంది?"

"చూళ్ళేదు. తలుపు మూసుంది. లోపల లైటు వెలుగుతోంది!"

"అంత రాత్రివేళ ఆమె గదిలో లైటువెలగడం నీకాశ్చర్యాన్ని కలిగించలేదా?"

"లేదు! ఎందుకంటే ఆమెగదిలో రాత్రంతా లైటు వెలుగుతూనే వుంటుంది?"

"ఎందుకు?"

"చీకట్లో పడుకునే అలవాటు లేదట ఆమెకు!"

"మేము రాత్రి పద్మజతో మాట్లాడి వెళ్ళాక, ఆమెను కలుసుకోడానికి ఇంకెవ్వరైనా వచ్చారా?"

"తెలీదు. నేను గమనించలేదు."

"ఆమెకోసం ఇక్కడికి ఎవ్వరూ రారా?"

"చాలామందే వచ్చేవారు. ఐతే, వాళ్ళలో ప్రొడ్యూసర్ పాండురంగం, హీరో శ్రీకాంత్, రమ తప్ప నాకెవ్వరూ తెలీదు."

"ఈ క్లబ్బు యజమాని ఎవ్వరు?"

"పాండురంగంగారే!"

ఉత్తమ్‌కుమార్‌తో బాటు సంజయ్, ఇన్‌స్పెక్టర్లు కూడా ఉలిక్కిపడ్డారు ఆ జవాబు విని!

"ఐసీ, ఐతే పాండురంగం రోజూ వస్తుంటారన్న మాట ఇక్కడికి?"

"రోజూ రారు. రెండు మూడురోజుల కొకసారి వచ్చి, అకౌంట్స్ చూసిపోతుంటారు."

"ఒంటరిగా వచ్చేవాడా?"

"అప్పుడప్పుడూ ఆయన వెంట రమ కూడావుండేది."

"ఐతే పద్మజతోనూ అతనికి మంచి టరమ్స్ వుండి వుంటాయి."

"ఔను. అప్పుడప్పుడూ ఆమెతోనూ ఏకాంతంగా గడిపేవారు!"

"ఆల్ రైట్! ఇక నువ్వు వెళ్ళొచ్చు" అంటూ ఇన్‌స్పెక్టర్ వైపు తిరిగి. "మీ రొటీన్ వర్క్ చూసుకోండి. మేము పాండురంగం ఇంటికెళ్ళొస్తాం! మిమ్మల్ని

హెడ్ క్వార్టర్స్‌లో కలుసుకుంటాను. పద్మజ పోస్ట్ మార్టం రిపోర్ట్ చూడాలి" అన్నాడు ఉత్తమ్‌కుమార్.

ఇన్‌స్పెక్టర్ తలూపేడు.

డిటెక్టివ్‌లిద్దరూ గ్రాబ్లిన్ కారెక్కి బైలుదేరారు.

# 7

పావుగంట తరవాత పాండురంగం ఇంటి పోర్టికోలో ఆగింది వాళ్ళ కారు. కారుదిగి, బూట్సులు టకటక చప్పుడు చేసుకుంటూ గుమ్మాన్ని సమీపించారు.

హాలుమధ్య సోఫాలో కూర్చునున్నాడు పాండురంగం. అతని ఎదురుగా ఓ అందమైన యువకుడు కూడా వున్నాడు. ఇద్దరూ తీవ్రంగా ఏదో తర్కించుకుంటున్న వాళ్ళల్లా డిటెక్టివ్‌లను చూసి ఉలిక్కిపడ్డారు.

పాండురంగం చటుక్కున లేచి, "రండి. దయ చెయ్యండి" అన్నాడు తెచ్చిపెట్టుకున్న ఉత్సాహం కనబరుస్తూ.

ఆ యువకుడు మాత్రం అలాగే కూర్చుని కన్నార్పకుండా చూస్తున్నాడు వాళ్ళని.

అతనెవ్వరో వెంటనే పోల్చుకున్నాడు ఉత్తమ్ కుమార్.

హీరో శ్రీకాంత్ అతనే!

"పాండురంగంగారూ! మీ క్లబ్ డాన్సర్ పద్మజ హత్యగురించి యింకా తెలియలేదా మీకు?"

"తెలిసింది! అరగంట క్రితం మేనేజర్ ఫోన్ చేసి చెప్పాడు. పోలీసులకూ, మీకూ ఫోన్ చేసి అక్కడికి పిలిపించమని సలహా ఇచ్చాను."

"మీరెందుకు రాలేదక్కడికి?"

"ఆ వార్త వినగానే నా బుర్ర పనిచెయ్యడం మానేసింది. నిన్న నా ఇంట్లో రమహత్య! ఈ రోజు క్లబ్బులో పద్మజ హత్య!! పోలీసులూరుకుంటారా? నన్ను రాబందుల్లా పీక్కుతినరూ? అందుకే, శ్రీకాంత్‌ని పిలిపించి, తర్జనభర్జన పడుతున్నాను" అన్నాడు పాండురంగం నీరసంగా.

"ఆల్ రైట్! మీతో ఏకాంతంగా మాట్లాడాలి."

"రండి. డ్రాయింగ్ రూంలో కూర్చుందాం!" అంటూ అతన్ని వెంటబెట్టుకుని డ్రాయింగ్ రూంలోకి నడిచాడు పాండురంగం.

ఉత్తమకుమార్ సిగిరెట్ అంటించి, "చనిపోక ముందు రమ గర్భవతని తెలుసా మీకు?" అడిగాడు సూటిగా.

పాండురంగం వులిక్కిపడి, "గర్భవతా? నో! నాకు తెలియదు" అన్నాడు బెదురుచూపులు చూస్తూ.

"అంతేకాదు, హత్య జరక్కముందు ఆమె రేప్ కూడా చెయ్యబడింది!"

"రేప్ చెయ్యబడిందా? నో! నేన్నమ్మను. హత్య జెయ్యబోయే వాడికి రేప్ చెయ్యాలన్న ఆలోచన వస్తుందంటే ఎవరైనా నమ్ముతారా?"

"మతిస్థిమితం, విచక్షణాజ్ఞానం లేనివాళ్లు హత్యలు చేస్తారు. అటువంటి కేసులిదివరకు చాలా జరిగాయి... సరే, రమ త్వరలో తను పెళ్ళి చేసుకోబోతున్నట్టు ఎప్పుడైనా చెప్పిందా మీతో?"

"రమకి పెళ్ళా?" పాండురంగం నవ్వి "చేసుకుంటానన్న ప్రబుద్ధుడెవ్వడో గానీ, నాకు మాత్రం తెలీదా సంగతి. ఆమె చెప్పనూలేదు."

"ఏసీ, పద్మజా, కమలతో మీ కొడుకు వంశీనాథ్ కూడా స్నేహం వుండేదని తెలుసా మీకు?"

"వాళ్ళ మధ్య స్నేహమా? నాకు తెలీదే! ఎవరు చెప్పారు మీతో?" అడిగాడు పాండురంగం ఆశ్చర్యంగా.

"ఎవరో చెప్పడం ఏమిటి? స్వయాన వంశీనాథే చెప్పాడు. నిన్న పద్మజకూడా చెప్పింది. మిస్టర్ పాండురంగం! ఇంతవరకూ నేను జరిపిన పరిశోధనలో ప్రతి వివరం మీకు విరుద్ధంగా వేలెత్తి చూపుతోంది. ఆల్ రైట్! నేనొకసారి మహాబలిపురం వెళ్ళి, మీ భార్యని కలుసుకోవాలనుకుంటున్నాను."

"మీకా ప్రయాస అక్కర్లేదు లెండి!"

"ఏం?"

"వైదేహి ఇక్కడే ఉంది!"

"ఇంట్లోనా?"

"ఔను. నిన్న ఇక్కడ రమ హత్యజరిగిందని తెలియగానే మహాబలిపురం నించి హుటాహుటిన వచ్చేసింది, నేను ఏ చిక్కుల్లో ఇరుక్కున్నానో అని!"

"వెరీ గుడ్! పదండి. ఆమెతో విడిగా మాట్లాడాలి." అన్నాడు ఉత్తమ్ కుమార్ పూర్తయిన సిగిరెట్ని ఏష్ ట్రేలో నొక్కుతూ.

పాండురంగం అతన్ని వెంటబెట్టుకుని, హాలుగుండా మేడమీదికి తీసికెళ్ళాడు.

## 8

మేడమీద తలుపులు తెరిచి వున్న ఓ గదిలో ప్రవేశించారిద్దరూ.

సోఫాలో కూర్చునుంది వైదేహి. ఆమెను చూసి ఆశ్చర్యపోయాడు ఉత్తమ్‌కుమార్. వయసులో ఆమె

పాండురంగం కంటే చాలా పెద్దగా కనిపిస్తోంది. ఐనా, అవసరానికి మించిన మేకప్‌తోనూ, తళుకు బెళుకుల దుస్తులతోనూ ఆ పెద్దరికాన్ని కప్పిపుచ్చడానికి ప్రయత్ని స్తోంది, శాయశక్తులా.

పాండురంగం ఆమె కతన్ని పరిచయం చేసి, మళ్ళీ వస్తానని వెళ్ళిపోయాడు.

ఉత్తమ్‌కుమార్ ఆమె కెదురుగా కూర్చుని, "వైదేహి గారూ! హత్యచేయబడ్డ రమ తెలుసా మీకు?" అడిగాడు అసలు విషయానికి వస్తూ.

"తెలుసు! మావారు తీసే సినిమా షూటింగ్స్ చూట్టా నికి అప్పుడప్పుడూ స్టూడియోల కెళ్తుంటాను. అక్కడ పరిచయమైంది. అంతే!"

"మీవారు నడిపే క్వాలిటీ క్లబ్ డాన్సర్ పద్మజ కూడా తెలుసా మీకు?"

"తెలుసు!"

"ఎలా?"

"ఆమె రమ స్నేహితురాలట. అప్పుడప్పుడూ షూటింగ్స్ చూట్టానికి వచ్చేది. అలా పరిచయం!"

"ఆ ఇద్దరు యువతులతో మీ వారికి క్లోజ్ టరమ్స్ వుండేవని కూడా తెలుసా మీకు?"

వైదేహి నిట్టూర్చి, "తెలుసు!" అంది భారంగా.

"ఆ విషయంమీద మీ భర్తతో ఎప్పుడూ తగాదా పడలేదా మీరు?"

"లేదు!"

"కనీసం బాధపడటం కూడా జరగలేదా?"

"జరిగింది! కట్టుకున్న భర్త జీవితంలో పరస్త్రీ ప్రవే శించడం ఏ భార్యకూడా సహించదు. బాధపడేదాన్ని.

లోలోపలే! ఐతే, ఎన్నడూ ఆయన ముందు ఆ ప్రస్తావన ఎత్తలేదు!''

''మీ అబ్బాయి వంశీనాథ్ కూడా ఆ యువతులతో స్నేహం వుందేదని తెలుసా మీకు?''

''తెలుసు! వాళ్ళతో స్నేహం చెయ్యమని నేనే వాడితో చెప్పాను!''

ఉత్తమ్ కుమార్ నోరు తెరిచి, ''ఎందుకు?'' అడిగాడు ఆశ్చర్యంగా.

''వారికీ, ఆ యువతులకీ మధ్య ఎటువంటి సంబంధం వుందో కనుక్కోడానికి, ఐ మీన్, ఆ యువతుల మన స్తత్వం స్టడీ చెయ్యడానికి. మరో కారణంకూడా వుంది. వరసకి కొడుకయ్యే వంశీనాథ్, ఆ యువతులతో స్నేహం చెయ్యడం చూసైనా మా వారు ఆ అమ్మాయిలకు దూరంగా వుంటారని ఆశించాను.''

''వంశీనాథ్ వాళ్ళ మధ్య వున్న సంబంధాల గురించి కనిపెట్టాడా?''

''కనిపెట్టాడు!''

''ఐనా, మీరు మీ వారి ముందు ఆ ప్రస్తావన ఎత్తలేదా?''

''లేదు!''

''ఎందుకు?''

వైదేహి విషాదంగా నవ్వి—''ఎందుకంటే, నా గదిలో ఓ నిలువుటద్దం వుంది. అది రోజూ నా ప్రతిబింబాన్నీ, ఉడిగిపోతున్న నా అందచందాలనీ, వయసునీ నాకు స్పష్టంగా చూపుతూ వుంటుంది. అందుకే, ఆ అందమైన యువతుల ముందు నా ఓటమిని అంగీకరించి, మౌనం వహించాను. వారు కూడా ఎంతకాలం సాగిస్తారిలాటి

వ్యవహారాలు? ఏదో ఒకరోజు అలసిపోయి, డస్సిపోయి, చేష్టలుడిగి చతికిల బడవలసిందే కదా?" అంది వేదాంత ధోరణిలో.

ఉత్తమ్ కుమార్ సాలోచనగా తలూపి, "సరే, వస్తాను. మీరిప్పుడప్పుడే మహాబలిపురం వెళ్ళడంలేదు కదా?" అడిగాడు లేస్తూ.

"లేదు. ఇంకో నాల్గురోజులుంటానిక్కడే!"

శ్రీకాంత్ ను కలుసుకోడానికి గబగబ బైటికి నడిచాడు ఉత్తమ్ కుమార్.

# 9

అతను మెట్లుదిగి హాల్లోకి రాగానే, పాండురంగం లేచి, శ్రీకాంత్ కు డిటెక్టివ్ అని పరిచయం చేశాడు.

"గ్లాడ్ టు మీట్ యూ మిస్టర్ శ్రీకాంత్! నేను తెలుగు సినిమాలు చూసేది బహుతక్కువ. ఐనా, మీరు నటించిన చిత్రాలు ఒకటి రెండు చూసినట్లు జ్ఞాపకం...! ప్రస్తుతం నేను మీతో కాస్త ఏకాంతంగా మాట్లాడా లనుకుంటున్నాను."

"మీరు పాండురంగంగార్ని విడిగా తీసికెళ్ళి మాట్లాడి నప్పుడే అనుకున్నాను, నాతోనూ అలా మాట్లాడతారని. అందుకే, నా గుండె దడదడ కొట్టుకుంటోంది."

"ఎందుకూ?"

"డిటెక్టివ్ లూ, పోలీసులూ నాతో మాట్లాడాలనుకోడం ఇదే మొదటిసారి గనక."

ఉత్తమ్ కుమార్ నవ్వి—"రండి, డ్రాయింగ్ రూంలో కూర్చుందాం!" అన్నాడు.

"ఫరవాలేదు. నేనే వెళ్ళిపోతాను. మీరిక్కడే కూర్చొని మాట్లాడండి." అంటూ లేచి, మేడమీది కెళ్ళి పోయాడు పాండురంగం.

ఉ తమ్‌కుమార్ సోఫాలో చతికిలబడి, "మిస్టర్ శ్రీకాంత్! పద్మజా, రమ సినిమాల్లో ప్రయత్నించడానికి మద్రాసువచ్చి, మొట్ట మొదటిసారి మిమ్మల్నే కలిశారని, అందులో రమని మీరే సినిమాలకు రెకమెండ్ జేశారనీ విన్నాను. నిజమేనా?" అడిగాడు.

శ్రీకాంత్ తలూపి, "నిజమే!" అన్నాడు.

"వాళ్ళిద్దరితో మీకు మంచి స్నేహంకూడా వుండేదనీ, ఐతే, మీకూ, రమకీ ఈ మధ్య అభిప్రాయభేదాలువచ్చి, మాట్లాడుకోడం మానేశారని కూడా విన్నాను. అదీ నిజమేనా?"

"నిజమే!"

"దాంతో ఆమె ఈమధ్య అందరి ముందూ మీగురించి చెడుగా ప్రచారం చెయ్యసాగింది."

"ఒప్పుకుంటాను!"

"మీ మధ్య మనస్పర్థలు రావడానికి కారణం?"

"ఒకరోజు నేనామె మంచి కోరి ఓ సలహా ఇచ్చాను. అంతే! అలిగిపోయింది. నిజం ఎప్పుడూ నిష్ఠూరంగానే వుంటుంది కదా?"

"ఏమిటా సలహా?"

"డబ్బు వ్యామోహంలోపడి, తనని తాను చవకబారు జేసుకోవద్దనీ, క్యారెక్టర్ మేంటినెన్స్ జెయ్యమనీ చెప్పాను. అదే తప్పయింది!"

"ఆల్‌రైట్! ఆమె కడుపులో పెరిగే పాపకు తండ్రి ఎవ్వరో చెప్పగలరా మీరు?"

"ఏమిటీ, రమ గర్భవతా? నాకు తెలీదే! బావుంది. ఆమె కడుపుకు కారణం ఎవ్వరో నేనెలా చెప్పగలను?" అన్నాడు శ్రీకాంత్ ఆశ్చర్యంగా.

"ఆమెతో మీ టరమ్స్ ఎప్పుడు చెడిపోయాయి?"

"చాలా రోజుల క్రితం! ఆమెకు నామీద కోపం కలగ డానికి మరో కారణంకూడా వుంది. ఈ మధ్య నాతో ఎక్కువ చిత్రాల్లో బుక్ అవుతున్న హీరోయిన్ కల్పన దగ్గరికి నేను మాటిమాటికీ వెళ్ళడం మానెయ్యాలంది రమ. నేను పట్టించుకోలేదు. దాంతో, ఆమెకు నామీద కోపం ఉధృతమవసాగింది."

"ఓహో! ఐతే, ఆమె మీ ప్రేమలో పడిందన్న మాట. మీరు కల్పనకు చేరువ కావడం ఇష్టంలేక, ఈర్ష్యతో అలా అనుంటుంది."

"మీరలా అనుకున్నా నాకభ్యంతరం లేదు. ఈ ఫీల్డులో బ్రతుకుతున్న మేము, మాతో పనిజేసే ప్రతి అమ్మాయిని ప్రేమించడం మొదలు పెడితే ఇక అయినట్టే! మీరే చెప్పండి, నా హీరోయిన్లతో నేను కలిసి మెలిసి ఉండక పోతే, వాళ్ళ సహకారం ఎలా లభిస్తుంది నాకు? నా స్టార్ ఇమేజ్ ఎలా నిలుస్తుంది."

"ఈ విషయం కల్పనక్కూడా తెలుసా?"

"ఒకసారి నేనే చెప్పాను."

"అప్పుడామెలో ఎటువంటి భావాలు చెలరేగాయి?"

"రమమీద ఎక్కడలేని కోపం వచ్చిందామెకు ప్రొడ్యూసర్లతో చెప్పి, ఆమె నెవ్వరూ పిక్చర్లో బుక్ జేసుకోకుండా జేస్తానంది. ఒకరిద్దరితో చెప్పిందికూడా!"

ఉత్తమ్ కుమార్ కాసేపు తీవ్రంగా ఆలోచించి— "వంశీనాథ్ తెలుసా మీకు?" అడిగాడు.

"తెలుసు! అతనూ ఓ పిక్చర్ తియ్యబోతున్నాడనీ, అందులో నన్నే హీరోగా తీసుకోవాలనుకుంటున్నాడనీ విన్నాను."

"రమ హత్యకు కారణం ఏమై వుంటుంది?"

"ఆమెవల్ల తీవ్రంగా పీడించబడుతున్న వాళ్ళెవ్వరో! చేసుంటారా, పని! ఎవరుచేసి వుంటారో మాత్రం చెప్పలేను. మొత్తానికి రమది చాలా హేయమైన వ్యక్తిత్వం ఇటు పాండురంగంతో ప్రణయ కలాపాలు సాగిస్తూ అటు అతనికి వరసకు కొడుకయ్యే వంశీనాథ్‌తోనూ స్నేహం చెయ్యడానికి ఏ మాత్రం సిగ్గుపడలేదామె!"

"రమతో మనస్పర్థలు వచ్చినా, ఆమె స్నేహితురాలు పద్మజతో మీ స్నేహం చెడలేదు కదా? ఆమెను చివరి సారి ఎప్పుడు కలుసుకున్నారు మీరు."

"నిన్న రాత్రే!"

"ఏ సమయంలో?"

"సాయంత్రం ఆరుగంటలకు! ఆమె ప్రోగ్రాం ఇంకా స్టార్ట్ కాలేదప్పుడు. స్టూడియోలో నా రికార్డింగ్ పోర్షన్ పూర్తి చేసుకుని ఇంటికెళ్తూ, దార్లో ఆమెని కలుసుకున్నాను."

"మేముకూడా నిన్న సాయంత్రమే ఎనిమిది గంటల ప్రాంతంలో ఆమెను కలుసుకున్నాం! అప్పుడామె మీరు వచ్చి వెళ్ళారని మాతో చెప్పలేదే?"

"నేనే చెప్పాను. ఎవ్వరికీ చెప్పొద్దని. కారణం, ఈ మధ్య హీరోయిన్ కల్పన మనిషొకడు నీడలా నన్ను వెంబడిస్తూ నా గతి విధులు గమనిస్తున్నాడు. రమనిగానీ, పద్మజనుగానీ నేను మళ్ళీ కలుసుకోడం గనక జరిగితే తాను సహించేదిలేదని ఆమె అనేకసార్లు చెప్పిందినాతో. ఐనా, ఉండబట్టలేక, నేను పద్మజను కలుసుకోడానికెళ్ళానని కల్పనకు తెలిస్తే, మా సంబంధాలు చెడిపోయే ప్రమాదముంది. అందుకే రహస్యంగా కలుసుకున్నానామెని!"

"కల్పన నియమించిన మనిషెవ్వరో తెలుసా మీకు?"

"తెలుసు. వాడిపేరు రణధీర్! పేరు మోసిన రౌడీ!!"

"వాడా! అటువంటివాణ్ని మీ వెనక నియమించిందా కల్పన?!"

"ఔను. ఇప్పుడు వాడామె పర్మనెంట్ ఉద్యోగి. అక్కడే వుంటాడు!"

"ఐసీ, అందుకే ఈ మధ్య వాడిపేరు వినిపించడం లేదు ఎక్కడా! ఆల్ రైట్. కల్పన ఇంటి అడ్రస్ చెప్పండి." అన్నాడు ఉత్తమ్ కుమార్ లేస్తూ.

శ్రీకాంత్ చెప్పిన అడ్రస్ నోట్ చేసుకుంటూ లేచాడు సంజయ్.

# 10

అక్కణ్నించి హుటాహుటిన కల్పన ఇంటికెళ్ళారిద్దరూ.

గేటుదగ్గర గూర్ఖా వున్నాడు. కారుకు అక్కడే బ్రేకు వేశాడు సంజయ్. అప్పుడు పడింది వాళ్ళదృష్టి, ఇంటి లాన్‌లో పచార్లుచేస్తున్న కల్పన మీద. చేతులు వెనక కట్టుకుని ఏదో తీవ్రంగా ఆలోచిస్తూ పచార్లు చేస్తున్నదల్లా కారు శబ్దంవిని, ఇటు తిరిగింది.

డిటెక్టివ్ ఉత్తమ్‌కుమార్ తన విజిటింగ్ కార్డు తీసి గూర్ఖాకందించాడు.

అతను గబగబ వెళ్ళి దాన్ని కల్పన కిచ్చాడు. కార్డు చూడగానే ఆమె కనుబొమ్మలు ముడిపడ్డాయి. క్షణం ఆలోచించి. వాళ్ళను రాన్నివ్వమన్నట్టు సైగ చేసింది.

గూర్ఖావచ్చి గేటు పూర్తిగా తెరిచాడు.

కారు లోపలికి పోనిచ్చి,పోర్టికోలో ఆపి దిగారిద్దరూ.

"డిటెక్టివ్‌లకు నాతో ఏమిటిపని?" అడిగిందామె కుతూహలంగా.

"రెండు హత్యల సందర్భంలో మీతో మాట్లాడాలని వచ్చాము."

"ఎవరి హత్యలు?"

చెప్పాడు ఉత్తమకుమార్.

"వాళ్ళకూ, నాకూ ఏమిటి సంబంధం?"

"నా పరిశోధనలో, రమపట్ల మీరు శత్రువైఖరి ప్రదర్శించారని తెలిసింది. ఆమెను పిక్చర్స్‌లో బుక్ చేసుకోవద్దని ప్రొడ్యూసర్లతో చెప్పినట్లు కూడా తెలిసింది."

"అంతమాత్రాన నేనే ఆమెను హత్యచేయించి వుంటానని ఎలా అనుకున్నారు."

"అలా అనుకోడం మా వృత్తిధర్మం! అంతమాత్రాన మీరే వాళ్ళను హత్యచేయించారనడం సబబుకాదు... వాళ్ళిద్దర్నీ ఎన్నడూ కలుసుకోవద్దని మీరు శ్రీకాంత్‌ను ఆదేశించారు కదూ?"

"ఔను!"

"అంతటితో ఆగక, అతన్ని ఓ కంట కనిపెట్టడానికి రణధీర్ అనే మనిషినికూడా నియమించారు కదూ?"

కల్పన ఉలిక్కిపడి "ఇవన్నీ ఎలా తెలిశాయిమీకు?" అంది ఆశ్చర్యంగా.

"అన్యులు తెలుసుకోలేని విషయాలు తెలుసుకోడమే మా వృత్తిసూత్రం! నా ప్రశ్నకి సూటిగా జవాబివ్వండి!"

"ఔను. నియమించాను."

"రణధీర్ ఎన్నాళ్ళనించి మీదగ్గర పనిచేస్తున్నాడు?

"ఆరు నెలల్నించి!"

"అతన్ని మీ దగ్గర ఉద్యోగంలో పెట్టుకోడానికి గల కారణం?"

"నా ఆత్మరక్షణకోసం!"

"ఏం మిమ్మల్నెవ్వరైనా చంపుతానని బెదిరించారా?"

"నో! నో! అలాంటిదేం లేదు. పేరుపొందిన సినిమా స్టార్స్‌కు స్నేహితులతోబాటు శత్రువులుకూడా వుంటారని మీకు వేరే చెప్పనవసరం లేదనుకుంటాను."

"రణధీర్ ఒకప్పుడీ చుట్టుపక్కల పేరుమోసిన రౌడీ అని బహుశా మీకు తెలియదనుకుంటాను."

"తెలుసు! అందుకే కదా, అతన్ని నా బాడీగార్డ్‌గా నియమించాను."

"నిన్న సాయంత్రం కూడా అతను శ్రీకాంత్‌ని వెంబడించాడు కదూ?"

"ఔను!"

"ఆ తరవాత మీకేమి రిపోర్టిచ్చాడు?"

"శ్రీకాంత్ స్టూడియోనించి తిన్నగా క్వాలిటీ క్లబ్ కళ్ళాడనీ, పద్మజ గదిలో వున్నాడనీ చెప్పాడు."

"అప్పుడు మీరేం చేశారు?"

"ఏమీ చెయ్యలేదు. శ్రీకాంత్ మీద పట్టరాని కోపం వచ్చింది నాకు."

"ఏం? పద్మజ మీద రాలేదా?"

"ఇందులో ఆమె తప్పేముందని? తప్పంతా శ్రీకాంత్‌దే! వాళ్ళను మళ్ళీ ఎన్నడూ కలుసుకోనని ప్రమాణాలుచేసి, సిగ్గులేకుండా చాటుమాటుగా వెళ్ళి కలుస్తుంటాడు..."

"ఇవన్నీ తెలిశాక మీరతనితో తెగతెంపులు చేసుకోలేదా?"

"లేదు! కానీ, అతన్ని పెళ్ళి చేసుకోవాలన్న నా నిర్ణయాన్ని మాత్రం మార్చుకున్నాను."

"మీ నిర్ణయాన్ని అతనితో చెప్పారా?"

"చెప్పేశాను."

"ఏమన్నాడు?"

"కాళ్ళా వేళ్ళాపడి, నన్ను మభ్యపెట్టడానికి ప్రయత్నించేడు. ఐనా, నే నతన్ని పట్టించుకోలేదు. ఒక నిర్ణయానికి వచ్చేకానంటే, దానికి మరి తిరుగు వుండదు."

"ఆల్ రైట్! రణధీర్ ఎక్కడున్నాడిప్పుడు?"

"ఇక్కడే వున్నాడు."

"పిలిపించండి!"

నౌఖరు ద్వారా కబురంపింది కల్పన.

రెండు నిమిషాల తరవాత ఇంట్లోంచి బైటికి వచ్చాడు రణధీర్. అక్కడ నిల్చున్న డిటెక్టివ్‌లని చూడగానే ఉలిక్కిపడ్డాడు! మద్రాసులో నివసించే డిటెక్టివ్‌లూ, పోలీసాఫీసర్లూ అతనికి బాగా తెలును. అలాగే, ప్రతి డిటెక్టివ్‌కూ, పోలీసుకూ అతను సుపరిచితుడే!

మద్రాసులోని గుండాలందర్లోకీ వాడు పేరు మోసిన రౌడీ! వాడు చెయ్యని నేరంలేదు. రెండు మూడుసార్లు హత్యకేసుల్లో అరెస్టయి, సాక్ష్యాల బలం లేక, విడుదలయ్యాడు.

"డిటెక్టివ్ ఉత్తమ్ కుమార్ నీతో మాట్లాడాలంటున్నారు." అంది కల్పన అతనికి డిటెక్టివ్‌లని పరిచయం కేస్తూ.

"పరిచయం అవసరంలేదు మేడమ్! వీళ్ళు నాకు బాగా తెలును!" అన్నాడు రణధీర్ తెచ్చిపెట్టుకున్న నవ్వుతో.

"ఔనౌను. నీవు చేపట్టిన మార్గాలటు వంటివి మరి... మిస్ కల్పనా! నేనితనితో ఇక్కడ మాట్లాడ దలచుకోలేదు. నా వెంట తీసికెళ్ళ దలచాను."

"ఎక్కడికి?"

"క్రైం బ్రాంచ్ హెడ్‌క్వార్టర్స్‌కి!"

"అలాగా, ఐతే నా లాయర్ని కన్సల్ట్ చేసేవరకూ మీరతన్ని తీసికెళ్ళడానికి వీల్లేదు."

"మీరు లాయర్ని కలుసుకునే వరకూ కాచుకునే ఓపిక నాకులేదు. కావలస్తే ఆయన్ని హెడ్క్వార్టర్స్‌కు వచ్చి మాట్లాడ మనండి. రణధీర్! కారెక్కు!" అన్నాడు ఉత్తమ్ కుమార్ గంభీరంగా.

కోపంతో కల్పన మొహం ఎర్రబడింది.

"ఇంతకీ, నేను చేసిన నేరం ఏమిటి?" అడిగాడు రణధీర్ ఖంగారుగా.

"చెబుతాను. ఇక్కడకాదు. అక్కడ! మేము నిన్ను అరెస్ట్ చెయ్యడంలేదు. 'విచారణ'కోసం తీసికెళ్తున్నాం! క్రైం బ్రాంచ్ హెడ్క్వార్టర్స్‌కు రావడం నీకిది కొత్త కాదు." అన్నాడు ఉత్తమ్ కుమార్ నవ్వుతూ.

"విచారణ" అనే పదం వినగానే రణధీర్ ఒళ్ళు రవంత కంపించింది. ఆ పదానికర్థం ఏమిటో అతనికి బాగా తెలుసు!

"భయపడక! నీవు మా ప్రశ్నలకు సరైనసమాధానా లిచ్చావంటే, నీమీద ఈగకూడా వాలదు. ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డితో మాకున్న స్నేహం ఎటువంటిదో నీకుబాగా తెలుసు. మాతో రావడానికి మొండికేశావంటే, ఇద్దరం కలిసి నీ ఎముకలు కొబ్బరి చట్నీచేసి మరీ తీసికెళ్ళాల్సి వస్తుంది జాగ్రత్త!" అన్నాడు ఉత్తమ్ కుమార్ హెచ్చరిస్తూ.

రణధీర్ క్షణం ఆలోచించి, "సరే, పదండి!" అన్నాడు కారువైపు నడుస్తూ. అతన్ని బాక్ సీట్లో కూర్చోబెట్టి, డిటెక్టివ్ లిద్దరూ ఫ్రంట్ సీట్లో కూర్చున్నారు. కారు స్టార్ట్ చేసి ముందుకు పోనిచ్చాడు సంజయ్. కల్పన కొయ్య

బొమ్మలా నిల్చుని వెళుతున్న కారువైపే చూస్తుండి పోయింది.

కారు ఆ ఇంటినించి ఫర్లాంగు దూరం వచ్చాక, రణ ధీర్‌తో కబుర్లు ప్రారంభించాడు ఉత్తమ్ కుమార్.
"కల్పన నీకు జీతం ఏమిస్తోంది?"
"వెయ్యి రూపాయలు! తిండీ, బట్టా, వసతీ ఉచితం!"

"ఇంకేం కావాలి? నీ పాత జీవితం కంటే, ఇదే లక్షు రెట్లు నయం కదూ?"
"ఔను."
"ఆమె బాడీ గార్డ్‌గానే గాక, గూఢచారిగానూ వ్యవహరిస్తున్నావన్న మాట?"
"ఔను. ఆమె ఏపని చెప్పినా చెయ్యడం నా డ్యూటీ. ఇరవై నాలుగ్గంటల నౌఖర్ని!"

కారు స్పీడ్ స్లో అవడంతో రోడ్డు వైపు చూశాడు ఉత్తమ్ కుమార్. ఎదురుగా నాలుగు రోడ్ల కూడలి వస్తోంది. వీళ్ళవైపు రెడ్ సిగ్నల్ వెలుగుతోంది. అనేక వాహనాలు బారులుదీరి ఆగిపోతున్నాయి. సంజయ్ కూడ బ్రేకు వేశాడు తమ కారుకు. అంతే!

వెనక డోర్ తెరుచుకున్న చప్పుడు విని, ఉలిక్కిపడి వెనుదిరిగి చూశారు డిటెక్టివ్‌లు. అప్పటికే జరగవలసింది జరిగిపోయింది. రణధీర్ మెరుపులా కాన్నించి బైటికిదూకి, కన్నుమూసి తెరిచేలోగా అదృశ్యమయ్యాడు.

సంజయ్ చటుక్కున డోర్ తెరిచి కారు దిగబోయాడు.
ఉత్తమ్ కుమార్ అతన్ని వారించి, "లాభంలేదు. వాడీ పాటికి మనం ఊహించనంత దూరం వెళ్ళిపోయుంటాడు" అన్నాడు డోర్ మూస్తూ.

# 11

ఇన్‌స్పెక్టరు రాజారెడ్డి ఆఫీసులోనే వున్నాడు. డిటెక్టివ్‌లని చూడగానే, "రండి. పద్మజ పోస్టుమార్టం రిపోర్టు యిప్పుడే అందింది" అన్నాడు ఓ ఫైలు తిరగేస్తూ.

డిటెక్టివ్‌లు కూర్చున్నాక ఫైలు వాళ్ళముందుంచేడు. దాన్నందుకుని రిపోర్ట్ చదివి నిర్ఘాంతపోయేడు శ్యామ్ కుమార్. అందులోని వివరాలు యిలా వున్నాయి.

హత్య రాత్రి రెండూ, మూడు గంటలమధ్య జరిగింది.

ప్రాణాలు కత్తిపోటువల్లే పోయాయి.

మరణానికి ముందు ఆమె మగాడితో సంభోగం జరిపింది!

అంతేకాదు, మరణించే సమయానికామె రెండు నెలల గర్భిణి!!

కత్తిపిడిమీద ఎటువంటి వేలిముద్రలూ లేవు.

"చాలా ఆశ్చర్యంగా వుంది. రమ పోస్టుమార్టం రిపోర్టుకూ, దీనికీ ఏమాత్రం తేడాలేదు. కేవలం రమ మూడు నెలల గర్భిణీ అయితే; ఈమెది రెండో నెల! అంతే! ఇద్దరి హత్యలూ కత్తితోనే జరిగాయి. ఆ రెండు హత్యాయుధాల మీదా హంతకుడి వేలిముద్రలు లేవు. బహుశా గ్లవుస్ వాడివుంటాడు.

హతురాళ్ళిద్దరూ హంతకుడితో ఎటువంటి పెనుగులాట జరపలేదు. మరణానికి ముందు ఇద్దరూ తమ అభీష్టంతోనే మగవాడితో సంభోగం జరిపారు..." అంటూ తాము పాండురంగం ఇంటికెళ్ళడం, అక్కడ జరిగిందీ, తర్వాత కల్పన యింటికి వెళ్ళి అక్కడ రణధీరును కారెక్కించుకుని బైలుదేరడం, దార్లో వాడు కారుదూకి పారిపోడం మొదలైన వివరాలు ఇన్‌స్పెక్టర్‌కు వివరించి,

"వెంటనే మీ సిబ్బందిని నగరంలోకి వదిలి, రణధీర్ కోసం గాలించండి. అంతేకాదు, మీ డిపార్ట్‌మెంటులో కొమ్ములుతిరిగిన మఫ్టీ కానిస్టేబుళ్ళని ఎన్నుకుని, శ్రీకాంత్ పాండురంగం, వంశీనాథ్, కల్పనల ఇళ్ళముందు కాపలా వుంచండి.

వీళ్ళలోనే ఎవ్వరో ఆ హత్యలు చేసివుంటే, లేదా రణధీర్ ద్వారా చేయించివుంటే, వాడు తప్పకుండా ఏదో ఒక రూపంలో వీళ్ళను కలుసుకోడానికి వెళతాడు. లేదా, వీళ్లే ఎక్కడో వాణ్ని కలుసుకోడానికి బైలుదేరతారు" అన్నాడు ఉత్తమకుమార్.

ఇన్‌స్పెక్టర్ క్షణం వృధా చెయ్యకుండా తన సిబ్బందిని పిలిచి ఆదేశాలు జారీచేశాడు.

అప్పుడు తట్టింది సంజయ్‌కు ఓ ఆలోచన! అంతవరకూ ఉత్తమకుమార్‌కు గానీ, ఇన్‌స్పెక్టర్‌కు గానీ తట్టని ఆలోచన!!

"సార్! ఈ కేసులో మీరు మరో కోణంనించి ఆలోచించడం మరిచారు. కోయంబత్తూర్ నివాసులైన రమ, పద్మజల గతజీవితాన్ని విస్మరించారు. వాళ్ళు కోయంబత్తూర్‌లో వున్నప్పుడు దోరవయసులో వున్న యువతులు. అక్కడ వాళ్ళు ఏ యువకులనైనా ప్రేమించి వుండవచ్చు గదా?

సినీవ్యామోహంలో పడి ఆ అమ్మాయిలు యిక్కడికి వచ్చి పతనమయ్యారనీ, జుగుప్సాకర జీవితం గడుపుతున్నారనీ తెలిసి, ఆ యువకుల హృదయాలు ఛిద్రమై ఉండవచ్చు కదా? వాళ్ళమీద కసితో, ద్వేషంతో ఆ యువకుల్లో ఎవ్వరో ఇక్కడికి వచ్చి ఈ విధంగా పగ తీర్చుకునుండవచ్చు కదా?" అన్నాడు.

"వెల్! ఈ మోటివ్ మీద నేనాలోచించ నేలేదు. వెంటనే కార్లో కోయంబత్తూర్ వెళ్ళి వాకబ్ చెయ్యి!" అన్నాడు ఉత్తమ్‌కుమార్, సంజయ్ వీపు తడుతూ.

"నాకూ ఈ పాయింట్ తట్టలేదుసుమా! వెంటనే బైలుదేరండి. విష్ యూ బెస్టాఫ్ లక్!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ అభినందిస్తూ.

వాళ్ళదగ్గర సెలవుతీసుకుని బైటికి నడిచాడు సంజయ్.

## 12

సాయంత్రం ఆరుగంటల ప్రాంతంలో, కోయంబత్తూర్ నించి తిరిగివచ్చాడు సంజయ్.

"ఏమైనా తెలిశాయా?" అడిగాడు ఉత్తమ్‌కుమార్.

"తెలిశాయి! నా అంచనా నిజమే అయింది. రమ, పద్మజ ఒకేస్కూల్లో చదువుకున్నారు. ఆ స్కూలు ప్రక్కనే ఓ డిగ్రీ కాలేజ్ వుంది. అందులో అప్పుడు ఇద్దరు విద్యార్థులు బి.ఏ. సెకండియర్‌లో చదివేవారు. వాళ్ళమధ్యా, వీళ్ళమధ్యా ప్రేమలేఖల భాగోతం జరిగింది. ఆ విద్యార్థుల యిళ్ళుకూడా ఆ ఊళ్ళోనే ఉన్నాయి. ఆ ప్రేమాయణం ఊరంతా ప్రాకినా, ఆ కుర్రజంటలు లోకానికి వెరవక, పెద్దల కళ్ళుగప్పి నిర్భయంగా కలుసు కుంటుండేవారు.

అంతలో నాట్యకళ పూర్తిచేసుకున్న ఆ అమ్మాయి లిద్దరూ హఠాత్తుగా ఊళ్ళోంచి అదృశ్యమయ్యారు. దాంతో ఆ అబ్బాయిలకు మతిపోయినంత పనయిందట... చాలాకాలం తరవాత, ఆ యువతులిద్దరూ మద్రాసులో హేయమైన జీవితం గడుపుతున్నారని తెలిసిందట ఊరి వాళ్ళకి.

అప్పటికే ఆ అవమానంతో కృశించి రమతండ్రి పోయాడు. తల్లి ఆమెను వెతుక్కుంటూ మద్రాసు వచ్చే

సింది. పద్మజను ప్రేమించిన ప్రసాదరావనే యువకుడు మతిస్థిమితం తప్పి, ఏడాదిక్రితం ఎటో వెళ్ళిపోయాడట. అతనింటికిప్పుడు తాళం వేసుంది.

రమని ప్రేమించిన రవీందర్ అనే యువకుడు మాత్రం రెండునెలల క్రితం ఇంట్లో చెప్పాచెయ్యకుండా ఎక్కడికో వెళ్ళాడట. అతనికోసం బంధువులింకా గాలిస్తూనే వున్నారు'' అన్నాడు సంజయ్ సోఫాలో చతికిలబడుతూ.

''ప్రస్తుతం మనం తయారుచేసిన అనుమానితుల లిస్టులో అతన్నికూడా చేర్చుకోవచ్చు. రమతోబాటు, ఆమెలో సినిమా వ్యామోహం రేపి, తనకు దూరంచేసిన పద్మజను కూడా చంపడానికి వీలుంది.

''ఆల్ రైట్! అతని సంగతి రేపుచూద్దాం! ఇప్పటికే నువ్వు బాగా అలసిపోయుంటావ్. భోంచేసి పడుకో. నాకూ నిదర ముంచుకొస్తోంది''అన్నాడు ఉత్తమ్‌కుమార్ లేస్తూ.

ఇద్దరూ డైనింగ్ హాల్లో భోజనాలు కానిచ్చి, బెడ్ రూంలో పక్కలమీద వాలారు.

# 13

తెల తెలవారుతుండగా గణగణ మోగింది టెలిఫోన్!

ఉత్తమ్‌కుమార్ ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు. రిసీవరందుకుని, ''ఎస్, ఉత్తమ్ స్పీకింగ్!'' అన్నాడు విసుగ్గా.

''హలో, గుడ్ మార్నింగ్! నేను ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి మాట్లాడుతున్నాను.''

''మీరా! ఏం జరిగింది?''

''ఫోన్‌లో చెప్పే విషయం కాదు. వెంటనే హీరో శ్రీకాంత్ యింటికి బయలుదేరి రండి'' అన్నాడు ఇన్‌స్పెక్టర్ అవతలినించి.

"ఓ.కే! ఇప్పుడే వస్తున్నాను" రిసీవర్ రెస్టుమీదుంచి లేచాడు ఉత్తమ్‌కుమార్.

అరగంటలో డిటెక్టివ్‌ల కారు శ్రీకాంత్ యింటి ముందాగింది.

పోర్టికోలో వాళ్ళకోసమే ఎదురుచూస్తున్న ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి, వాళ్ళను వెంటబెట్టుకుని, మేడ మీదికి తీసికెళ్ళాడు. మేడమీద ఓ గదిముందు పోలీస్ డాక్టర్, ఫోటోగ్రాఫర్లూ, మిగతా మందీమార్బలం మూగివున్నారు.

గదిలో అడుగుపెట్టిన డిటెక్టివ్‌లని, మంచంమీద కనిపించిన దృశ్యం స్తబ్ధుల్ని చేసింది!

మంచంమీద బోర్లా పడుంది శవం!

శ్రీకాంత్ శవం!!

సరిగ్గా వీపులో కత్తి! పిడివరకూ దిగిన కత్తి!!

ఎడం చెంప దిండు కానించి, కళ్ళు తెరిచి, తలుపు వైపు చూస్తూ పడుకున్నట్టే వున్నాడు. అనుమానితుల్లో ఒకడైన శ్రీకాంత్ కూడా చంపబడతాడని ఆ అపరాధ పరిశోధకు లెవ్వరూ ఊహించలేదు.

"సాయంత్రం శ్రీకాంత్ నెవ్వరైనా కలుసుకోడానికి వచ్చారేమో, ఈ ఇంటి ముందు నిఘాకోసం నియమించిన మఫ్టీ కానిస్టేబుల్ని ప్రశ్నించారా?" అడిగాడు ఉత్తమ్ కుమార్ ఇన్‌స్పెక్టర్ని.

"ప్రశ్నించాను. సాయంత్రం ఆరుగంటల ప్రాంతంలో ఓ యువకుడు టాక్సీలో వచ్చాడట. ఆ సమయంలో శ్రీకాంత్ ఇంటి ముందు లాన్‌లో కూర్చుని పేపర్ తిరగేస్తున్నాడు. ఆ యువకుడు కూడా కాసేపు అక్కడే కూర్చుని, శ్రీకాంత్‌తో మాట్లాడి వెళ్ళిపోయాడట!"

"ఎలా వుంటాడతను!"

"సుమారు పాతికేళ్ళుంటాయట. డార్క్ బ్లూ కలర్ సూటు ధరించాడుట. కళ్ళకి వెడల్పాటి బ్లాక్ కలర్ జోడు పెట్టుకోడంవల్ల అతని రూపురేఖలు సరిగ్గా చూడ లేకపోయానని చెప్పాడు కానిస్టేబుల్. మొత్తానికి ఎర్రగా పొడుగ్గా, అందంగానే వున్నాడట మనిషి!"

"ఈ ఇంట్లో ఎంతమంది నివసిస్తున్నారు?"

"శ్రీకాంత్ తోబాటు నలుగురు నౌఖర్లుకూడా ఇక్కడే వుంటారు. రాత్రి ఎనిమిది గంటల ప్రాంతంలో శ్రీకాంత్ భోంచేశాడట. భోజనంచేస్తూ రోజూ కంటే, కాస్త ఎక్కువ మోతాదులో విస్కీ పుచ్చుకున్నాడట.

తరవాత మేడమీది కళ్ళిపడుకున్నాడట. అతని బెడ్ రూంలో లైటారి పోగానే, నౌఖర్లు కింది తలుపుమూసేసి, తమ గదుల్లో పడుకున్నారుట. డాక్టర్ అంచనా ప్రకారం హత్య రాత్రి ఒంటి గంట ప్రాంతంలో జరిగింది!"

"అంటే, హంతకుడు తలుపుగుండా ఇంట్లో ప్రవేశించ లేదన్నమాట!" అంటూ చుట్టూ కలియజూశాడు ఉత్తమ్ కుమార్.

ఆ గదికి బాల్కనీ వుంది. డిటెక్టివ్ లు ముగ్గురూ అటు నడిచారు. బాల్కనీ పిట్టగోడ అంచుని పరిశీలించగానే వాళ్ళ సందేహం పటాపంచలైంది. బాల్కనీ పక్కనే వుంది నీటి గొట్టం! పిట్టగోడ అంచుమీద మట్టి మరకలు! హంతకుడు తప్పకుండా ఆ దారినే గదిలో ప్రవేశించి వుంటాడని నిర్ధారించుకున్నారు.

"నిన్న సాయంత్రం శ్రీకాంత్ ను కలుసుకున్న యువతి ఎవ్వరో మీ మనుషుల ద్వారా ఆరాతీయించండి. ఇక్కడి మీ రొటీన్ వర్క్ పూర్తి చేసి, శవాన్ని మార్చ్యురీకి పంపిం

చండి. మేమింకా కాలకృత్యాల తీర్చుకోలేదు. పన్నెండు గంటల ప్రాంతంలో హెడ్ క్వార్టర్స్‌వచ్చి మిమ్మల్ని కలుసుకుంటాం!'' అన్నాడు ఉత్తమ్ కుమార్ గదిలోంచి బైటికి నడుస్తూ.

అదే సమయంలో ప్రొడ్యూసర్ పాండురంగం కొంప లంటుకు పోయినట్టు హడావుడిగా వచ్చాడక్కడికి. మంచంమీద పడున్న శ్రీకాంత్ శవాన్ని చూడగానే గుండెలు బాదుకుంటూ, ''నేను మునిగిపోయాను. నిండా మునిగిపోయాను. నా పిక్చర్లో ఇంకా ఇతని రోల్ ఎంతో మిగిలి వుంది. ఇప్పుడా పిక్చర్ ఎలా పూర్తి జేసేది?'' అంటూ నెత్తీ నోరు బాదుకోసాగేడు.

అతన్ని ఓదార్చే పని ఇన్‌స్పెక్టర్ కప్పగించి బైటికి నడిచారు డిటెక్టివ్‌లు. ''నిన్న సాయంత్రం టాక్సీలో వచ్చి, శ్రీకాంత్‌ను కలుసుకున్న యువకుడు రమ మాజీ ప్రియుడు రవీంద్రే అయుంటాడని నా అనుమానం! ఐతే, అతనికి శ్రీకాంత్‌ను హత్యజేసే అవసరం ఏమిటి?'' అడిగాడు సంజయ్ కారు నడుపుతూ.

''పగ! ద్వేషం! రమ పద్మజలు సినిమా ఛాన్సుకోసం మద్రాసువచ్చి, మొదట కలుసుకున్నది శ్రీకాంత్‌నేకదా! వాళ్ళ పతనానికి పునాది వేసింది కూడా అతనే కదా? హత్యకు కారణం ఆ మాత్రం చాలదూ?'' అన్నాడు ఉత్తమ్‌కుమార్.

# 14

పన్నెండు గంటల ప్రాంతంలో క్రైంబ్రాంచ్ హెడ్ క్వార్టర్స్‌కు బైలుదేరబోతుండగా టెలిఫోన్ మోగింది.

రిసీవరందుకున్నాడు ఉత్తమ్ కుమార్.

"హలో, ఉత్తమ్! వెరీ గుడ్ న్యూస్ ఫర్ యూ! మా మనుషులు రౌడీ రణధీర్‌ను పట్టుకున్నారు." అన్నాడు అవతలినించి ఇన్‌స్పెక్టర్ ఉత్సాహంగా.

"థాంక్ గాడ్! ఇప్పుడే వస్తున్నాం!" అంటూ రసీవర్ దించి, సంజయ్‌తో కారెక్కాడు డిటెక్టివ్.

పది నిమిషాల్లో చేరుకున్నారు హెడ్ క్వార్టర్స్‌కి.

ఇన్‌స్పెక్టర్ ఆఫీసులో వున్నాడు రణధీర్. వాళ్ళని చూడగానే చమటలు కక్కుతూ తల దించుకున్నాడు.

ఉత్తమ్ కుమార్ సిగరెట్ అంటించి, "మా కార్లోంచి ఎందుకు పారిపోయావ్?" అడిగాడు సూటిగా.

రణధీర్ నీళ్ళు నమిలి—"పారిపోడానికి ఛాన్సు దొరికింది. పారిపోయాను." అన్నాడు తలెత్తకుండా.

"దీన్నిబట్టి, ఆ రెండు హత్యలతో నీకు సంబంధం వుందనుకోవచ్చా?"

రణధీర్ చటుక్కున తలెత్తి "భగవంతుడి సాక్షిగా చెబుతున్నాను. నా మాట నమ్మండి సార్! ఆ హత్యలతో నాకెలాంటి సంబంధంలేదు. మీరు మక్కెలిరగ తంతారన్న భయంతోనే కార్లోంచి పారిపోయాను. అనవసరంగా నన్ననుమానిస్తున్నారు సార్!" అన్నాడు వణుకుతూ.

"అనవసరంగా నేనెవ్వర్నీ అనుమానించను. నీవంటి కొమ్ములు దిరిగిన రౌడీని కల్పన తన ఉద్యోగిగా నియమించుకుంది. హత్య చెయ్యబడ్డ ఆ ఇద్దరు యువతులతోనూ ఆమెకు మనస్పర్ధలున్నాయి. నిన్ను శ్రీకాంత్ మీద నిఘాకోసం నియమించింది. నిన్న మధ్యాహ్నం నువ్వు మా కార్లోంచి పారిపోడం, రాత్రి శ్రీకాంత్ హత్య జరగడం అన్నీ నా అనుమానాలు ధృవీకరిస్తున్నాయి."

"ఏమిటీ శ్రీకాంత్ చంపబడ్డారా? మై గాడ్... ఐతే, ఇక మీ దగ్గర ఏమీ దాచకూడదు...ఇంతవరకూ మీరు నన్ను కల్పన ఉద్యోగినే అనుకుంటున్నారు కదూ?"

"ఔను. ఏం?"

"అది నిజం కాదు. నన్నామె దగ్గర ఉద్యోగం చెయ్యడానికి నియమించింది శ్రీకాంత్ గారే!"

"అంటే, నువ్వు వాళ్ళిద్దరి దగ్గరా జీతాలు తీసుకుంటూ ఒకరికి విరుద్ధంగా మరొకరి తరఫున పని చేశావన్న మాట."

"ఔను."

"పద్మజ హత్య జరిగిన రోజు సాయంత్రం నువ్వు శ్రీకాంత్‌ను వెంబడిస్తూ క్వాలిటీ క్లబ్ కెళ్ళావా?"

"వెళ్ళాను."

"శ్రీకాంత్ పద్మజ గదిలో వున్నంతసేపూ, నువ్వక్కడే వున్నావా?"

"ఔను. ఓ విస్కీ బాటిల్ తెప్పించుకుని, తాగుతూ కూర్చున్నాను."

"అతనామె గదిలోంచి బైటికెళ్ళగానే నువ్వూ లేచి వెళ్ళిపోయావా?"

"లేదు. ఆ విస్కీ బాటిల్ పూర్తయ్యేవరకూ అక్కడే కూర్చున్నాను. శ్రీకాంత్ గారు వెళ్ళిన కొద్దిసేపటికే మరో వ్యక్తిని పద్మజ గదిలో కెళ్ళడం చూశాను."

"ఎవరతను?"

"తెలీదు.'

"మనిషి ఎలా వుంటాడు?"

"యువకుడే. సుమారు పాతికేళ్ళుంటాయి. డార్క్ బ్లూ కలర్ సూటులో వున్నాడు. కళ్ళకి వెడల్పాటి నల్ల కళ్ళద్దాలు పెట్టుకున్నాడు. ఎర్రగా పొడుగ్గా అందంగా వున్నాడు."

షాక్ తగిలినట్లు వులిక్కిపడ్డాడు ఉత్తమ్‌కుమార్. సరిగ్గా అటువంటి యువకుడే, నిన్న సాయంత్రం శ్రీకాంత్‌ను కలుసుకుంది.

ఎవరతను?

ఎవరు? ఎవరు?

"ఇన్‌స్పెక్టర్! నగరమంతా మీ మనుషుల్ని వదిలి, ఆ పోలికలు గల యువకుడి కోసం ఆరాతీయించండి. చిన్నా, పెద్దా హోటళ్ళూ, లాడ్జింగులూ ఏవీ వదల కుండా గాలించండి. ఈ కేసు ముగిసేవరకూ రణధీర్‌ను మీ కస్టడీలోనే వుంచండి. రేపు మళ్ళీవచ్చి కలుసు కుంటాను. దెన్ గుడ్ బై!" అంటూ లేచాడు ఉత్తమ్.

# 15

మర్నాడు మళ్ళీ తెలతెలవారు తుండగా టెలిఫోన్ గణగణమోగి, డిటెక్టివ్‌లను నిద్రలేపింది.

ఉత్తమ్ కుమార్ రిసీవరందుకుని, "ఎస్, స్పీకింగ్" అన్నాడు వినుగ్గా.

"వెరీ బ్యాడ్ న్యూస్ మిస్టర్ ఉత్తమ్! వెంటనే పాండురంగం ఇంటికి బైలుదేరి రండి." అవతలనించి విని పించింది ఇన్‌స్పెక్టర్ కంఠం.

"మళ్ళీ ఎవండికైనా మూడిందా?"

"పొద్దున్నే పాడు కబురు ఫోన్లో చెప్పడం బావుం డదు."

"కొంపదీసి ఈసారి పాండురంగం హత్య జరగలేదు కదా?" అన్నాడు ఉత్తమ్ కుమార్ వుండబట్టలేక.

"రండి. ఇక్కడే చూద్దురుగాని!" అవతల క్లిక్ మంది.

అదరాబాదరాలేచి, పావు గంటలో పాండురంగం ఇంటి ముందు కారు దిగారు డిటెక్టివ్‌లు.

ఇన్‌స్పెక్టర్ వాళ్ళను తిన్నగా, మేడమీదికి తీసి కెళ్ళాడు. అక్కడో గది ముందు పోలీస్ పటాలంమూగి వుంది. వాళ్ళను చూడగానే పక్కకి తప్పుకున్నారు.

గదిలో అడుగుపెట్టి, ఎదురుగా కనిపించిన దృశ్యం చూసి నిర్ఘాంతబోయారు డిటెక్టివ్‌లు.

మంచంమీద వెల్లకిలా పడుంది శవం!

పాండురంగం భార్య వైదేహి శవం.

వెనకటిలా ఛాతీలోనూ, వీపులోనూ దిగబడలేదు కత్తి.

గొంతు ఈ పక్కనించి ఆ పక్కకి పొడిచి వుంది బాకు.

పరుపంతా రక్తసిక్తం.

ఆ గదికి బాల్కనీ లేదుగానీ, కిటికీవుంది. కిటికీ అంచు మీద మట్టి మరకలూ, దాని పక్కనే వున్న నీటి గొట్టం, హంతకుడు ఆ దారినే వచ్చాడని నిర్ధారించాయి.

"రిగర్ మార్టిస్నిబట్టి హత్య రాత్రి రెండూ రెండు న్నర మధ్య జరిగి వుంటుందని నా అభిప్రాయం." అన్నాడు పోలీస్ డాక్టర్.

ఉత్తమ్ కుమార్ పాండురంగాన్ని ఏవో అడగా లను కుంటుండగా, వైదేహి కొడుకు వంశీనాథ్ సుడి గాలిలా ప్రవేశించాడు గదిలోకి.

రాగానే పాండురంగాన్ని నిప్పులు కక్కే కళ్ళతో చూస్తూ, "నా తల్లిని వీడే హత్యచేశాడు. నా తండ్రి

సంపాదించి పెట్టిన ఆ స్థిపాస్తుల్ని ఇష్టం వచ్చినట్టు ఖర్చు పెట్టింది చాలక, ఇప్పుడు మిగిలి వున్నది కూడా వారిద్దామని నా తల్లిని చంపేశాడు. నీచుడా.'' అంటూ పూనకం పట్టినట్టు పాండురంగం మీదికి దూకి పిడికిళ్ళతో ఎడా పెడా గుద్దసాగేడు వంశీనాథ్.

ఇన్‌స్పెక్టర్, ఉత్తమ్ కుమార్లు మెరుపులా అతన్ని ఒడిసి పట్టుకున్నారు.

సంజయ్, పాండురంగాన్ని పక్కకి నెట్టేశాడు.

''మిస్టర్ వంశీనాథ్! మా కళ్ళముందే నీవు చట్టాన్ని ఉల్లంఘించి, ఒక వ్యక్తిమీద చెయ్యిచేసుకుంటున్నావు. ఇన్‌స్పెక్టర్, ఇతన్ని కస్టడీలోకి తీసుకోండి.'' అన్నాడు ఉత్తమ్ కుమార్ జేవురించిన మొహంతో.

వంశీనాథ్ తల కిందికి వాలిపోయింది. ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి జేబులోంచి హాండ్ కప్స్ తీసి, వంశీనాథ్ చేతులకి బిగించాడు. అక్కడి తతంగాన్ని సార్జంట్ డేవిడ్ కప్పగించి, వంశీనాథ్‌తో హెడ్‌క్వార్టర్స్ చేరుకున్నారు డిటెక్టివ్‌లు.

అంతా ఇన్‌స్పెక్టర్ ఆఫీసులో ఆసీనులయ్యాక, ఉత్తమ్ కుమార్ సిగరెట్ అంటించి. ''ఇతన్ని అరెస్ట్ చెయ్యమని ఊరికే అనలేదు ఇన్‌స్పెక్టర్! దానికి మరో కారణం కూడా వుంది.'' అన్నాడు నవ్వుతూ.

''ఏమిటా కారణం?'' అడిగాడు రాజారెడ్డి ఆశ్చర్యంగా.

''ఈ నాలుగు హత్యలకు మూలకారకుడైన హంతకుడు ఈ రాత్రి ఐదో హత్యకూడా చెయ్యబోతూ మనకు పట్టుబడతాడని నాకు గట్టి నమ్మకం వుంది. అతనీ రాత్రి హత్య చెయ్యడానికి ప్రయత్నించేది ఎవర్నో కాదు. వంశీనాథ్‌నే.

ఈ విధంగా వంశీనాథ్‌ను అరెస్టుచెయ్యడానికి మనకు సాకు దొరికింది గనక, ఈ రాత్రి ఇతన్ని మీ లాకప్‌లో వుంచి, మనమంతా ఇతను నివసించే గ్లోబ్ బిల్డింగ్‌ని చుట్టుముట్టి, చీకట్లో పొంచివుండాలి. ఆ అంచనా సరైనదై తే? హంతకుడు తప్పకుండా దొంగదారిన, వంశీనాథ్ పడగ్గదిలో ప్రవేశించడానికి ప్రయత్నిస్తాడు. మిస్టర్ వంశీనాథ్, ఆ బిల్డింగ్ పైన మీ పడగ్గది ఎక్కడుంది" అడిగాడు ఉత్తమ్ కుమార్.

"పడమటివైపు నాలుగో గది!"

"దానిపక్క నీటిగొట్టం కూడా వుందా?"

"లేదు. బాల్కనీ పక్కనుంది!" చెప్పాడు వంశీనాథ్.

అతన్ని లాకప్‌లో వుంచి, ఆ రాత్రి చీకటిపడగానే నల్లదుస్తులు ధరించి, రివాల్వర్లు సిద్ధంచేసుకుని, గ్లోబ్ బిల్డింగ్ చేరుకున్నారు.

ఆ బిల్డింగ్ చుట్టూ చిన్నకాంపౌండ్ వుంది. బిల్డింగ్ వెనక రకరకాల చెట్లున్నాయి. వాళ్ళు తమ వాహనాన్ని బిల్డింగ్ ఆవరణలో కాక, కంపౌండ్ వెనకవైపు చీకట్లో ఆపి, కంపౌండ్ గోడదూకి, చెట్లమాటున నక్కి, వంశీనాథ్ పడగ్గదివైపు చూస్తూ కూర్చున్నారు.

## 16

రాత్రి పన్నెండు గంటల ప్రాంతంలో ఓ ఆకారం అడుగులో అడుగు వేసుకుంటూ బిల్డింగ్ వైపు వస్తుండటం గమనించాడు ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి.

వెంటనే తన అనుచరులకి అటు సైగచేసి చూపాడు. అందరూ ఊపిరి బిగబట్టి చూడసాగారటు. ఆ ఆకారం బల్లిలా గోడకతుక్కుని నడుస్తూ సరిగ్గా వంశీనాథ్ పడగ్గది

బాల్కనీ కిందికి వచ్చి ఆగింది. కాసేపు చేతులు రుద్దుకుని దానిపక్కనే వున్న నీటిగొట్టం అందుకుంది. అంతే!

డిటెక్టివ్‌లు నలుగురూ పిస్తోళ్ళందుకుని పిడుగుల్లా అటు పరిగెత్తారు.

అడుగుల శబ్దానికి అదిరిపడి వెనుదిరిగిందా ఆకారం!

అప్పటికే అతన్ని చుట్టుముట్టేశారు వాళ్ళు.

ఇన్‌స్పెక్టర్ టార్చి వెలిగించి అతని మొహంమీద వేశాడు. అంతే!

అందరికళ్ళూ ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి.

అతను ఎవ్వరోకాదు.

అక్షరాలా వంశీనాథ్!

పోలీస్ లాకప్‌లో వున్న వంశీనాథ్ యిక్కడికెలా వచ్చాడు?

అతన్ని ఈడ్చుకుంటూ జీప్ దగ్గరికి తీసికెళ్ళి, క్షణాల మీద చేరుకున్నారు హెడ్‌క్వార్టర్స్. ఇన్‌స్పెక్టర్ వెంటనే లాకప్‌లోవున్న వంశీనాథ్‌ను అక్కడికి తీసుకొచ్చాడు.

ఆ వంశీనాథ్‌లిద్దరూ ఒకర్నొకరు భయంభయంగా చూసుకోసాగారు.

"ఇప్పుడు చెప్పండి. మీ ఇద్దర్లో ఎవరు వంశీనాథ్?" అడిగాడు ఇన్‌స్పెక్టర్ తీక్షణంగా.

గ్లోబ్ బిల్డింగ్‌నించి పట్టుకొచ్చిన వంశీనాథ్ తల వంచుకుని "నేనే నకిలీ నాథ్‌ని!" అన్నాడు చమట్లు కక్కుతూ.

"ఐతే, ఈ నాటకమంతా ఏమిటిది"

అతను చటుక్కున తలెత్తి అసలు వంశీనాథ్ వైపు నిప్పులుచెరిగే కళ్ళతో చూస్తూ, "వీడివల్లే నేనీ రొంపిలో

యిరుక్కుంది. ఈ మహానుభావుడు త్వరలో తన స్వంత సినిమా ప్రారంభించబోతున్నట్టు మీకు తెలిసిందే కదా? అందులో ఇతనిది ద్విపాత్రాభినయం.

దానికి ఒక డూప్ అవసరమౌతాడు గనక, ఆ డూప్ అచ్చు తనలాగే వుండాలన్న ఉద్దేశంతో రష్యా వెళ్ళి, అక్కడ మాస్కులు తయారుచేసే ప్రఖ్యాత సినీ స్టూడియోలో తన రూపాన్ని పోలిన మాస్కు తయారు చేసుకువచ్చాడు.

అప్పుడు తట్టిందతనికీ హత్యల పథకం!

నేను తెలుగువాణ్ణే అయినా, బొంబాయిలో స్థిరపడి అక్కడ సినీఫీల్డులో ఎక్స్ట్రా వేషాలేసుకు బ్రతుకుతున్నాను. తన ఒడ్డూ పొడుగులో సరిగ్గా సరిపోయే నన్ను తన పథకానికి ఎరగా ఎన్నుకున్నాడు. విపరీతమైన ధనాన్ని చూపి, మద్రాసు తీసుకొచ్చాడు...

ఎలిబీకోసం నాకు తన మాస్కు తొడిగి, హత్యలు జరిగిన సమయాల్లో తను ఫలానాచోట వున్నట్టు నన్ను అక్కడక్కడా వుంచి, తానే స్వయంగా వెళ్ళి, రమనీ, పద్మజనూ, శ్రీకాంత్‌నూ, తుదకు తన తల్లినికూడా చంపేశాడు. రమ, పద్మజా గర్భవతులయింది ఇతనివల్లే! ఆ రహస్యం మరో ప్రాణికి తెలీకుండా వాళ్ళ ప్రాణాలనే తీసి, ఆ నేరం పాండురంగం మీదికి వచ్చేలా పథకం అల్లాడు...

హీరో శ్రీకాంత్‌ని చంపితే, ఈ నాడు తిరుగులేని ధృవతారగా వెలుగుతున్న అతను ఆరిపోయి, ఆ స్థానాన్ని తాను ఆక్రమించాలని ఆశించాడు. అందుకే, తనమీద అనుమానం రాకుండా, తన స్వంత పిక్చర్లో హీరోగా శ్రీకాంత్‌నే ఎన్నుకున్నట్టు ప్రచారంచేశాడు...

తల్లిమీద యితనికి మొదటినించీ తీవ్రమైన కసివుంది. పాండురంగంవంటి వ్యక్తిని కట్టుకుని, తనని అశ్రద్ధచేసి, తండ్రి ఆస్తినంతా పాడుచేస్తోందని ఆమెమీద ద్వేషం వుంది. ఆ విధంగా ఆమెకూడా అంతమొందితే, ఆ నేరం పాండురంగంపైకి నెట్టి, ఆస్తికి తానే సర్వాధికారిని కావాలనుకున్నాడు...

ఇంతలో—నాలోనూ ప్రవేశించింది ఓ విషబీజం! ఇన్నిరోజులు యితనిలా చలామణీ అవుతున్న నేను, శాశ్వతంగా ఆ స్థానాన్ని ఎందుకు ఆక్రమించకూడదు? అన్న ఆలోచన వచ్చింది. వంశీనాథ్‌ను తుదముట్టించి, ఆతని శవాన్ని నామరూపాలు లేకుండాచేసి, రేపటి నించి నేనే వంశీనాథ్‌గా చెలామణీ అవ్వాలనుకున్నాను.

అందుకే, గ్లోబ్ బిల్డింగ్‌లో నిద్రిస్తున్న అతన్ని చంపాలని అక్కడికెళ్ళాను. ఇతనిక్కడ మీ లాకప్‌లో వున్నట్టు నాకు తెలీదు'' అన్నాడు నకిలీ వంశీనాథ్ తల వంచుకుంటూ.

—: ఐపోయింది: —

సీరియల్

# అడుగు ముందుకు వేస్తే భస్మాన్!



వసుంధర

(ఐదవ భాగము)

ఆడవిలో మూడుకిలోమీటర్ల దూరం వెళుతూ వచ్చాక వారికి ఒక విచిత్రజంతువు కనపడి ఆగిపోయారు.

అది నిలువెత్తు వున్నది. కళ్ళు యెర్రగా వున్నాయి. ఒక చేయి కుడిపక్కగా జాపివుంది. రెండో చేయి పొట్ట మీదవుంది. చాలా భయంకరంగా అగుపిస్తున్న ఆ జంతువును చూసి బృందమంతా కాస్తదూరంలోనే ఆగిపోయింది.

ఆ జంతువు వీళ్ళను సమీపిస్తుందని చాలాసేపు కదలకుండా వాళ్ళలా అక్కడే నిలబడిపోయారు.

రామేశం ఆలోచిస్తున్నాడు. అది ఏజాతి జంతువు.

సాధారణమయిన ఈ అరణ్యంలోకి అదెలా వచ్చింది? ఈ అరణ్యంలో చరిత్రకందని జంతుజాలమున్నదా?

బృందం ఈ విషయాన్ని చర్చించారు కానీ వారికి అంత తృప్తిగా లేదు. భారతదేశపు టరణ్యాల్లోని జంతు జాలం గురించిన సర్వేలో విచిత్ర జంతువులున్నట్లు ఎక్కడా అభివర్ణించబడలేదు. చాలాసేపు అక్కడా గేక టాక్సీవాలా ధైర్యంచేశాడు. ఏమయితే అయిందని, తాను ముందుకువెళ్ళి దానిసంగతి చూస్తానన్నాడు. యెవ్వరూ అతన్ని వారించలేదు. ప్రోత్సహించలేదు.

టాక్సీవాలా అడుగులో అడుగు వేసుకుంటూ ఆ జంతువును సమీపిస్తున్నాడు. అది యెర్రటి కళ్ళతో అతని వైపే చూస్తున్నది కానీ కదలడంలేదు. టాక్సీవాలాలో క్రమంగా ధైర్యం హెచ్చింది.

అతనా జంతువును సమీపించి గట్టిగా కేక పెట్టాడు "హేయ్ అంతా ఇలా రండి—ఇది బొమ్మ!"

అతడి కేకలు విని అంతా పరుగెత్తుకువచ్చారు. నిజంగానే అది బొమ్మ. కానీ జీవకళ ఉట్టిపడుతోంది. కదలిక లేని కారణంగా తప్పితే దాన్ని బొమ్మ అని గ్రహించడం కష్టం.

"అయితే ఈ బొమ్మ ఇక్కడికెలావచ్చింది? ఎవరు దీనినిక్కడ ఉంచారు? ఎందుకుంచారు?" అన్నాడు రామేశం. అంతా ఆలోచనలో పడ్డారు. కాని సరియైన సమాధానం ఎవరికీ దొరకలేదు.

"ఈ బొమ్మచేయి ఒకటి ఒకవైపుగా సూచిస్తోంది. అటు వెడితే ఏమైనా వింత మనకళ్ళబడవచ్చు" అన్నాడు జోగారావు.

అందరికీ అది సబబుగా తోచింది. రామేశం మాత్రం 'బొమ్మ సూచించినవైపు వెడితే మనం కాలిబాటను

వదిలిపెట్టాల్సివుంటుంది. ఆ తర్వాత దారి మరిచిపోతే ఈ అరణ్యంలో మనం చిక్కుపడిపోతామేమో ఆలోచించండి" అన్నాడు.

అయితే మిగతా అందరికీ బొమ్మ సూచించినవైపు వెళ్ళాలని వుంది. ఆ మాటకొస్తే అనుమానాన్ని వెలిబుచ్చిన రామేశానిక్కూడా అటు వెళ్ళాలని వుంది.

అక్కడ అందరూ ఫలహారాలు తీసుకున్నారు. బొమ్మకు సమీపంలోనే ఒక నీటివాగు కనబడింది. అంతా ఆ వాగులోని నీరు తాగారు. నీరు తియ్యగా ఎంతో రుచిగా వుంది. ఆ నీరు తాగాక అందరిలోనూ కొత్త ఉత్సాహం కలిగింది. మళ్ళీ ప్రయాణాన్ని కొనసాగించారు.

వారలా రెండు కిలోమీటర్ల దూరం నడిచి ఒక కొండ వద్దకు చేరారు. కొండ వారి దారికి అడ్డంగావున్నది.

"ఇక్కడొక సొరంగమార్గముంది!" అంటూ అరిచాడు జోహారీ. అందరూ ఆత్రుతగా అటు చూశారు. నిజమే! ఆ కొండలో ఓ చిన్న గుహావుంది. దానినే జోహారీ సొరంగమార్గమంటూ అరిచాడు.

"ఏంచేద్దాం?" అన్నాడు టాకూర్.

"ఇలాంటి గుహలలో ఒకోసారి కొండచిలువ లెదురు కావచ్చు" అన్నాడు రామేశం.

గుహముందు వారు పరిశీలించి చూస్తున్నారు. ఏదో కొత్తవిశేషం కనుక్కోబోతున్నట్లు వారికళ్ళు ఉత్సాహంతో మెరుస్తున్నాయి.

ఉన్నట్లుండి గుహలో ఏదో అలికిడి వినిపించింది.

బృందమంతా చటుక్కున పక్కకు తప్పుకున్నారు.

కొంతసేపటికి గుహలోంచి ఓ మనిషి బయటకు వచ్చాడు. వాడి భుజంమీద ఏదో సంచివుంది.

అందరూ ఊపిరి బిగబట్టి వాణ్ణి చూస్తున్నారు.

వాడు భుజంమీద సంచిని క్రిందకు దింపి సంచిలోంచి కొన్ని బట్టలు బయటకుతీశాడు. కొద్ది నిముషాల్లో వాడి నాగరక వేషం ఆటవిక వేషంగా మారిపోయింది. సంచి లోంచి వాడు కొన్ని వస్తువులు బయటకు తీసి లెక్క పెట్టి, సంచిలో పెట్టేసుకున్నాడు. తర్వాత సంచిని భుజానికి తగిలించుకుని అక్కణ్నించి వెళ్ళిపోయాడు. వాడు చాలాదూరం వెళ్ళిపోయాడని నమ్మకం కుదిరేక అంతా మళ్ళీ గుహ ముందుకు వచ్చారు.

"ఎవరు వాడు?" అన్నాడు టాగూర్.

"ఆటవిక వేషంలోవున్న నాగరకుడు, నాగరక వేషంలోవున్న ఆటవికుడు__ఇద్దరిలో ఒకడైవుండాలి. కానీ వాడిసంచిలో బంగారపుటచ్చులున్నాయి..." అన్నాడు రామేశం.

"అవును. పచ్చగా తళతళా మెరుస్తోంది. అంత బంగారం వాడికెక్కడిది?" అన్నాడు జోహారీ.

"వాడు గుహలోంచి బయిటకు వచ్చాడు" అన్నాడు టాగూర్. ఆ గుహలో ప్రవేశించాలని అతడికి చాలా ఆత్రుతగా వుంది.

మనిషి ఒకడు గుహలోంచి వచ్చాడు కాబట్టి, గుహలో ప్రమాదకరమైన జంతువులేమీ వుండవని కూడా వారు అనుకున్నారు.

ముందుగా టాక్సీవాలా, ఆ వెనుక టాగూర్, ఆ వెనుక జోగారావు, జోహారీ, రామేశం గుహలో ప్రవేశించారు. గుహలో చికటిగా వుంది.

జోహారీ జేబులోంచి అగ్గిపెట్టె తీశాడు. అతను గీసిన పుల్ల వెలుగులో గుహలో ఓ మూలగా కూర్చున్న మనిషి వాళ్ళ కళ్ళబడ్డాడు. వాడికి నలభైఏళ్ళుంటాయేమో_వీళ్ళం

దరికేసి అఘోరకంగా చూస్తున్నాడు.

అగ్గిపుల్ల ఆరిపోయింది. ఇంకో పుల్ల వెలిగించాడు జోహారి.

రామేశం ఆ మనిషిని సమీపించాడు.

"అడుగు ముందుకువేస్తే చస్తావ్!" అన్నాడా మనిషి. రామేశం చటుక్కున ఆగిపోయాడు. అతన్ని దాటుకుని టాక్సీవాలా ఆ మనిషివైపు నడవబోయాడు.

మళ్ళీ అదే హెచ్చరిక—"అడుగు ముందుకు వేస్తే చస్తావ్!"

రామేశం ఆ మనిషినే పరీక్షగా చూస్తున్నాడు. అతడి పెదవులకదలిక, కంఠం విచిత్రంగా తోచాయి ఆయనకు. టాక్సీవాలా భుజంతట్టి "ఈ మనిషి కూడా బొమ్మేనని అనుమానంగా వుంది. ఏమంటావ్?" అన్నాడు.

"మీరు సరిగ్గా ఊహించారు. మనలో ఒకరు ధైర్యం చేసి అడుగు ముందుకువేసి చూసి ఏమవుతుందో గ్రహించాలి..." అంటూ టాక్సీవాలా ఆ మనిషిని సమీపించాడు. ఆ మనిషిలో యెక్కడా ఏ విధమైన చలనమూ లేదు.

టాక్సీవాలా ఆ మనిషిని తాకేటంత దూరానికి రాగానే అతడు గిరగిరా తిరగడం ప్రారంభించాడు. అలా కాసేపు తిరిగేక ఆ మనిషి నేలలోకి క్రుంగిపోయాడు. ముందుకు వెళ్ళడానికిప్పుడు సన్నని మార్గం అగుపిస్తోంది. ఇదివరకటిమీద వెలుతురు కూడా వచ్చింది గుహలోనికి.

అందరికీ ఆ అనుభవం వింతగా వుంది. ఆశ్చర్యంగా వుంది.

అందరూ ఆ సన్నని మార్గాన్ననుసరించారు. అందరికంటె ముందు టాక్సీవాలా నడుస్తున్నాడు. వెనుక

రామేశం వున్నాడు.

ఆ మార్గం క్రమంగా విశాలమైంది. క్రమంగా వెలుతురు కూడా అధికమైంది. సుమారు పావుగంట నడిచి వారు గుహలోంచి బయటకు వచ్చారు. అక్కడ వారికి కనబడ్డ దృశ్యం వారినమితాశ్చర్యపరులను చేసింది. అందరూ రెప్పవాల్చకుండా అటే చూస్తున్నారు.

సుమారు ఇరవైయేళ్ళ ప్రాయపుపిల్ల ఒకతె అర్ధనగ్నంగా నృత్యంచేస్తోంది. పాతికేళ్ళ యువకుడొకడు ఆ నృత్యం మాని ఆనందిస్తున్నాడు. ఆ ప్రాంతంలో ఈ బృందానికిది ఊహించని దృశ్యం. ఆ ఆశ్చర్యమే వీరిని ఆ జంటకు పట్టించింది.

ఆ యువతి వీరిని చూస్తూనే నృత్యం ఆపింది. ఆ యువకుడు పరుగున వీరిదగ్గరకు వచ్చి "ఎవరు మీరు? ఇక్కడికెలా వచ్చారు?" అనడిగాడు.

"మేము యాత్రికులం. ఇక్కడ చాలా వింతలు చూడవచ్చునని తెలిసి వచ్చాం" అన్నాడు రామేశం.

"ఇక్కడ వింతలు చూడగలమని యెవరు చెప్పారు మీకు?"

"గంగాపురం ప్రెసిడెంటు..." అన్నాడు రామేశం.

ఆ యువకుడి ముఖంలో రంగులు మారాయి "ఇంకా ఏం చెప్పాడు?" అన్నాడు.

"ఇంకేమీ చెప్పలేదు..." అన్నాడు రామేశం. మిగతా నలుగురూ ఆ సంభాషణలో కలగజేసుకోలేదు.

"ఇక్కడేమీ విశేషాలు లేవు. మీరు వెళ్ళొచ్చు..." అన్నాడా యువకుడు.

"మీరెవరో ఇక్కడేం చేస్తున్నారో తెలుసుకోవచ్చా?" అన్నాడు రామేశం.

"కూడదు..." అన్నాడు యువకుడు ముక్తసరిగా.

"సరే_అయితే మీ పని మీరు చేసుకోండి. మా పని మేము చేసుకుంటాం" అన్నాడు రామేశం. తన సంభాషణ వివరాలనాయన జోహారీ, టాకూర్ లకు తెలియబర్చాడు.

"కా సదూరంలో ఓ ఆలయం కనబడుతోంది" అన్నాడు టాక్సీవాలా.

అందరూ అటువైపు కదిలారు.

"మీరలా వెళ్ళడానికి వీల్లేదు" అంటూ చటుక్కున ఆ యువకుడు వారిముందుకు వచ్చి అడ్డంగా నిలబడ్డాడు.

"ఎందుకని?" అన్నాడు టాక్సీవాలా.

"నేను చెబుతున్నాను కనుక..."

"నువ్వెవరు నాకు చెప్పడానికి?"

ఆ యువకుడు టాక్సీవాలాను సాచి లెంపకాయ కొట్టాడు. ఒక్క_దెబ్బలో అతడు క్రిందపడిపోయాడు.

"ఎవ్వరూ అడుగు ముందుకు వేయవద్దు" అన్నాడా యువకుడు ఇంగ్లీషులో.

"నేను వేస్తున్నాను" అంటూ టాకూర్ ఓ అడుగు ముందుకువేయడమేకాకుండా ఆ యువకుణ్ణి బలంగా ఒక్క తాపుతన్నాడు. ఆయువకుడు కిందపడి దొర్లాడు. ఈలోగా టాక్సీవాలా లేచినిలబడ్డాడు_చెంపచేత్తో తడుముకుంటూ. అతడికళ్ళలో నీళ్ళతోపాటు కోపం కూడా బాగావుంది.

యువకుడు లేచేలోగా జోహారీ, టాకూర్ వెళ్ళి అతడి రెండు చేతులూ పట్టుకుని లేవనెత్తి "బిహేవ్ యువర్ సెల్ఫ్" అన్నారు.

యువకుడి ముఖంలో ఇప్పుడు కోపంస్థానంలో కంగారు ఉంది. అతను రామేశం వంక తిరిగి "నా తొందరపాటును మన్నించండి. కానీ వెంటనే మీరిక్కణ్ణించి వెళ్ళిపొండి" అన్నాడు.

"మేమెందుకు వెళ్ళిపోవాలో చెబితే అలాగే చేస్తాం. ఏది యేమైనా యింతదూరం వచ్చి ఇక్కడున్న ఆలయాన్ని చూడకుండా యెలాగా వెళ్ళం" అన్నాడు రామేశం.

"మీరా ఆలయం చూడ్డానికి వీల్లేదు."

"ఎందుకని?"

"చెప్పకూడదు. కానీ చూస్తే మీకే ప్రమాదం."

"చెప్పకపోతే నీకు ప్రమాదం" అంటూ భోగారావు ఆ మనిషిమీదకు పులిలా దూకాడు. జోహారీ, టాకూర్ కూడా ఆ యువకుడికి కాసేపు దేహశుద్ధి చేశారు. అయితే అతడి నోటివెంట ఒక్క మాటకూడా బయటకు రాలేదు.

"వీడిచేత నిజాన్ని కక్కించలేం ఆ అమ్మాయిని లాక్కొస్తేసరి..." అన్నాడు టాకూర్.

ఈలోగా ఆ అమ్మాయే అక్కడకు వచ్చింది.

"ఇది చాలా ప్రమాదకరమైన స్థలం. ఆ ఆలయంలో ఒక అపూర్వమైన నిధి వుంది. ఎంత తీసినా తరగని బంగారం అక్కడ వుంది. ఆ రహస్యం కొంతమందికి తెలుసు. వాళ్ళిక్కణ్ణించి బంగారాన్ని తరలించుకు పోవడానికి పెద్ద ఎత్తున ఏర్పాట్లు చేస్తున్నారు. అందు గురించి ఆలయంలో చాలామంది పనిచేస్తున్నారు. బంగారమంతా ఒక్కచోట లేదు. రకరకాల ప్రదేశాల్లో నిక్షిప్తమై వుంది. ఆ ప్రదేశాలను కనుక్కొని అందులోని బంగారాన్ని బయటపెట్టడానికి పెద్దఎత్తున కృషి జరగాలి. ఇక్కడి బంగారమంతా బయటకు తరలించడానికి అయిదారేళ్ళు పడుతుందని అంచనా.

ఇక్కడ చాలామంది పనిచేస్తున్నారు గదా_వారందరి కోసం నా లాంటి ఆడవాళ్ళని తీసుకువస్తున్నారు. నేను వీళ్ళ మనిషిని కాదు. వీళ్ళకు బందీని. నా దురదృష్టం

కొద్దీ వీళ్ళకు చిక్కి యిక్కడ నాకు నచ్చని జీవితం గడుపుతున్నాను.

ఆలయం సమీపించారంటే మీరు మరి ప్రపంచాన్ని చూడలేరు. బయటివారు రారన్న ధైర్యంతో ఇక్కడ కాపలా లేదు. మనం వెంటనే బయటకు పోయి ప్రాణాలు దక్కించుకుందాం. నన్నిక్కడి నుంచి బయట ప్రపంచానికి తీసుకుపోగలిగితే_మీకు నేను ఆజన్మాంతం ఋణపడివుంటాను'' అందా యువతి.

ఆమె అన్న మాటల అర్థాన్ని జోగారావు బోహారీ, టాకూర్ లకు వివరించి చెప్పాడు. ఆ వివరాలు రామేశం బృందానికి చాలా ఆశ్చర్యాన్ని కలిగించాయి.

''ఇప్పుడేం చేయాలి?'' అన్నాడు టాక్సీవాలా.

''అంతా అయోమయంగా వుంది___'' అన్నాడు టాకూర్.

''ఈ యువతి మనను తప్పుదారి పట్టించడం లేదన్న గ్యారంటీ వుందని మీకు తోస్తోందా?'' అన్నాడు రామేశం.

మళ్ళీ అందరూ ఆలోచనలో పడ్డారు. రామేశం అనుమానానికి ఆ యువతి ప్రత్యేకంగా సంజాయిషీ ఇవ్వకుండా తనకా అవసరం లేదన్నట్లు ఊరుకుంది.

''మనను ఆలయం దగ్గరకు వెళ్ళకుండా ప్రయత్నించాలని ఈ ఇద్దరూ ప్రత్నిస్తున్నారు. యువకుడు బెదిరించి చూశాడు. ప్రయోజనం కనబడలేదు. ఈయువతి అర్థించి నరుక్కురావడానికి ప్రయత్నిస్తోంది. రోట్లో తల పెట్టి రోకటిపోటుకు భయపడడమెందుకు? మనం వెళ్ళి ఆ ఆలయంలోని విశేషాలు చూసివద్దాం___'' అన్నాడు రామేశం.

''నేను చెప్పవలసింది చెప్పాను. ఇప్పుడు మీరు

చేస్తున్న సాహసంవల్ల మిమ్మల్ని మీరు రక్షించుకోలేరు. నన్ను రక్షించలేరు'' అందా యువతి.

ఆ యువకుణ్ణి, యువతినీ వెంటబెట్టుకుని ఆ అయిదుగురూ ఆలయంవైపు నడిచారు. ఓ కంట ఆ యువకుణ్ణి, యువతినీ కనిపెడుతూనే వున్నప్పటికీ అందరికీ గుండెలదురుతూనే వున్నాయి. ఏ క్షణం యేం జరుగుతుందో ఎవరికెరుక?

అంతా ఆలయంలోకి ప్రవేశించారు. అది ఒక శివాలయం. ఏ నాటిదో కానీ ఆ ఆలయం మీది శిల్పం అద్భుత కళాసృష్టి అని చెప్పవచ్చును. అంతా ఆలయం చుట్టూ తిరుగుతున్నారు. ఎక్కడా వేరే మనుషుల అలకిడి లేదు.

ఆలయం చుట్టూ తిరగడమయ్యేక వారు లోపలకు ప్రవేశించారు. ముందుగా టాక్సీవాలా ఆ వెనుక జోహారీ, యువకుడూ, జోగారావూ—ఆ వెనుక టాకూర్, యువతి, రామేశం అంతా లోపల ప్రవేశించారు. అక్కడి దృశ్యం వారినాశ్చర్య చకితులను చేసింది.

ప్రవేశద్వారం వద్ద నంది విగ్రహం వున్నది. అది రెండుగా చీలి వున్నది. అటూ ఇటూ బంగారపు పలకలు ఫ్రేంలో అమర్చబడివున్నాయి. అలాగే ధ్వజస్థంభం కూడా బంగారపుపలకలమయంగా వుంది.

“ఇది నిజంగానే అపూర్వనిధి'' అన్నాడు టాకూర్.

లోపల గుడి చాలా విశాలంగా ఉంది. ఎప్పుడు కట్టారో, ఎవరు కట్టారో కానీ ఆ కట్టడం ఇంతవరకూ చెక్కు చెదరకపోవడం చాలా ఆశ్చర్యం. అంతా వాళ్ళి కాసేపు మంటపంలో విశ్రమించారు.

“మన ట్రిప్పు ఫలించింది. ఇది నిజంగానే జీవితానికో అనుభూతిగా మిగిలిపోతుంది'' అన్నాడు రామేశం ఆంధ్రదేశంలో అంతవరకూ చూసిన ఆలయాలన్నీ దీని

ముందు శిల్ప సౌందర్యంలోనూ, వైశాల్యంలోనూ కూడా దిగదుడుపుగా వున్నాయి.

"వాటం చూస్తూంటే ఈ గుడిలోని ప్రతిశిల్పమూ బంగారంతో నిండివున్నదనిపిస్తోంది" అన్నాడు జోహారీ.

"అలా అనుకోవడానికి వీల్లేదు. ప్రతిశిల్పాన్నీ జాగ్రత్తగా పరీక్షించి బంగారం వున్నదీ లేనిదీ తెలుసుకోవచ్చును. అలాగే మరికాస్త జాగ్రత్తవహిస్తే ఏ శిల్పాన్నీ దెబ్బతీయకుండానే జాగ్రత్తగా బంగారాన్ని స్వంతం చేసుకోవచ్చు. నందివిగ్రహమూ, ధ్వజస్తంభమూ—కొన్ని రహాస్యపు మీటల సాయంతో తెరవబడ్డాయి. ఇక్కడున్న విగ్రహాలు శిలావిగ్రహాలను పోలివున్నా వాస్తవాని కవి లోహనిర్మితాలు" అందా యువతి.

"నువ్వు లోపల మనుషులున్నారని చెప్పేవు. కానీ ఎవ్వరూ లేరు" అన్నాడు జోగారావు.

"అవును. అబద్ధం చెప్పాను. ఇక్కడున్న ఈ బంగారాన్ని మీరు కళ్ళలో చూస్తే ఉత్తిచేతులతో కదల గలుగుతారా? మీలో ఆశ రేగుతుంది. అక్కణ్ణించి కష్టాలు ప్రారంభమవుతాయి. నాకంటె అనుభవం గల వారు. మీకు నేనేం చెప్పగలను?" అందా యువతి.

"అయితే ఇక్కడ మనుషులు లేరా?" అన్నాడు రామేశం.

"ఈ రోజుకు లేరు. ఒకవారం రోజుల్లో ఇక్కడ హడావుడి ప్రారంభమవుతుంది. అంతవరకూ ఈ ప్రాంతానికి నేనూ, ఇతనూ కాపలా!" అందా యువతి యువకుణ్ణి చూపిస్తూ.

"అయితే నువ్వు కూడా వీళ్ళ మనిషి వేనన్న మాట?" అన్నాడు జోగారావు.

"కాదు. నేనిక్కడ బందీని. నేనొక్కతెనే కాదు,

ఇంకా కొందరు ఆడవాళ్ళున్నారిక్కడ బందీలుగా” అందా యువతి.

“ఇక్కడ అంటే?” అన్నాడు రామేశం.

“నాకు తెలియదు. కానీ ఇతనికి తెలుసు” అందా యువతి.

“రప్పించు. చూస్తాం” అన్నాడు టాక్సీవాలా యువకుని వంక తిరిగి.

“ఆమె చెబుతున్నవన్నీ అబద్ధాలు. తనే ఇక్కడి వ్యవహారానికి నాయకురాలు. మిమ్మల్ని బుట్టలో వేసుకోవాలని చూస్తోంది” అన్నాడు యువకుడు.

“వీళ్ళతో మనకేమిటి గానీ ఇప్పుడేం చేయాలి మనం?” అన్నాడు రామేశం.

“ఈ పూటకిక్కడ విశ్రాంతి తీసుకోవాలి” అన్నాడు జోహారి.

“ఆ తర్వాత...”

“శాశ్వతంగా విశ్రాంతి తీసుకుంటారు” అని నవ్విందా యువతి.

రామేశం తన బృందంతో అన్ని విషయాలూ చర్చించాడు. ఏంచేయాలో ఎవ్వరికీ తోచడంలేదు. తమ కళ్ళబడ్డ ఈ అపూర్వనిధిని వశపర్చుకోవాలని అందరికీ వుంది. అయితే దీని ఉనికిని ప్రభుత్వానికి తెలియజేయాలని రామేశం అభిప్రాయపడ్డాడు. ఆయన అభిప్రాయాన్నామోదించినా, ఆమోదించకపోయినా ఎవ్వరూ వ్యతిరేకించలేదు.

“ఇక్కణ్ణుంచి బయటపడ్డాన్ని పెద్దసమస్యగా మీరు గుర్తించినట్లులేదు. అందుకే వృథా కాలయాపన చేస్తున్నారు. ఇక్కణ్ణుంచి తప్పించుకోవడము కష్టమే! తప్పించుకుని బ్రతికి బయటపడటమూ అసాధ్యమే!”

అందా యువతి.

ఆమెకు తామక్కడ వుండడం యిష్టం లేదని రామే శానికి అర్థమయింది. అంటే ఈ రాత్రి కూడా ఇక్కడే దైనా విశేషం జరుగుతుందా? లేక ఈమె నిజంగా బయట పడాలని తహతహలాడుతోందా! ఏది యేమైనా యీ రాత్రికి తామిక్కడ విశ్రాంతి తీసుకోక తప్పదు. చీకటి పడుతోంది. ఇప్పుడెక్కడికి వెడతారు?

అంతా భోజనాలు చేశారు.

రామేశం ఆమె మాటలను సీరియస్‌గా తీసుకోవడం లేదు. ఆయన ఆలోచనలు పరిపరివిధాలపోతున్నాయి. గంగాపురంలో ఇప్పుడేం జరుగుతోంది? ఊరి ప్రెసి డెంటుకు తామింకా కనబడకపోవడంతో అనుమానం రాలేదా? ఆయనకూ ఈ నిధికీ సంబంధం ఉంటే యిప్పు డాయన ఊరుకుంటాడా? తెల్లారేలోగా మనుషులు తమను చుట్టుముట్టరా?

చుట్టుముడతారని భయపడి యిప్పుడు వెనక్కు వెడితే మాత్రం తాము దొరికిపోమని నమ్మకమేమిటి? అడ కత్తెరలో చిక్కిన పోకలా వుంది తమ పని. అయితే యిందులో విచారించవలసినది లేదు. తాము కావాలనే యిందులో యిరుక్కున్నారు.

ఒక అపూర్వ విధిని కళ్ళారా చూశామన్న ఆనందం ముందు ఈ కష్టాలో లెక్కలోనివి కావు. గంగాపురం ప్రెసిడెంటుక్కూడా తామంటే భయముంది. సాధ్యమై నంతవరకూ తమ ప్రాణాలు తీయడు.

రాత్రి అంచెలంచెలుగా మెలకువ వుండి కాలంగడపా లని వారు అనుకున్నారు. అయితే వారికా శ్రమ అవసరం లేకపోయింది. రాత్రి పదిగంటలకల్లా అక్కడకో చిన్న పటాలం వచ్చి చేరింది. వారివద్ద ఆయుధాలున్నాయి.

"నామాట వినలేదు. నాకు చెర తప్పలేదు సరిగదా— మీరూ బందీలవుతున్నారు—" అందా యువతి.

రామేశం బృందం పెద్దగా చలించలేదు—"మేము సాధారణ యాత్రీకులం. ప్రయాణాలు మాకు సరదా. ఇక్కడున్న ఈ అపూర్వ కళాఖండాన్ని చూడగా మా జన్మ తరించింది. మాకీ నిధిమీద ఆశలేదు. మేము వచ్చిన పనైపోయింది. సెలవిప్పిస్తే వెడతాము..." అన్నాడు రామేశం.

"మీరు కావాలని సింహం నోట్లో తలపెట్టారు. మీకు లాగే నాకూ కొన్ని సరదాలున్నాయి. మీ సరదా తీరిందంటున్నారు. కాబట్టి నా సరదా తీర్చుకుంటాను. మీరందరూ వరుసగా ఒకరి పక్కగా ఒకరు నుంచోండి..." అన్నాడు కొత్తగా వచ్చిన పటాలంలోని నాయకుడు ముందుకు వస్తూ.

అయిదుగురూ ఒకరి పక్క ఒకరు నిలబడ్డారు.

"మీరు మొత్తం అయిదుగురున్నారు. మిమ్మల్ని యిదుగురినీ రివాల్వర్‌తో కాల్చి చంపవచ్చు. కానీ అలా చేయను. మీ అయిదుగురికీ మంచి పానీయం ఇప్పిస్తాను. అందులో ఒకరి దాంట్లో విషం వుంటుంది. నేనిచ్చిన పానీయాన్ని అందరూ బుద్ధిగా తాగినట్లయితే మీలో ఒక్కరే మరణిస్తారు. మిగతా వాళ్ళందరూ రక్షించబడతారు. అలాచేస్తే మానవత్వం పాలు ఎక్కువగా వున్నట్లవుతుంది కదూ?" అన్నాడు ఆ వ్యక్తి.

బృందంలో అయిదుగురికీ ముచ్చెమటలు పోశాయి.

రామేశం అందరిలోకీ ముందుకువెళ్ళి—"నీవు మమ్మల్ని చంపడం అనవసరం. ఏ విధంగానూ మేము మీకు అపకారం కలిగించం. ఈ నిధి సంగతి మరచిపోతాం. మమ్మల్ని వదిలి పెట్టేసేయ్. మాలో ఒకర్ని చంపడమే

నీ ఉద్దేశ్యమైనట్లయితే నన్ను చంపేసేయ్. అందరిలోకీ ముసలివాడిని..." అన్నాడు. హఠాత్తుగా ఆయన గొంతులో దైన్యం ధ్వనించింది.

జోగారావు, టాకూర్ కి పరిస్థితి వివరించాడు. టాకూర్ మొహం కోపంతో జేవురించింది. "చూడు. నాకు చావంటే భయంలేదు. ధైర్యంగా ఇక్కడకు వచ్చాను. ధైర్యంతోనే ఇక్కడ ప్రాణాలు పోగొట్టుకుంటాను. నా ప్రాణాలకోసం వీళ్ళని దేబిరించను..." అన్నాడు.

జోహారీ, టాక్సీవాలా మాత్రం కాస్త దిగులుగా వున్నారు. అంతవరకూ వున్న వుత్సాహం మాయంకాగా వాళ్ళు ప్రాణభీతితో ఆ వ్యక్తివంకే చూస్తున్నారు.

ఆ వ్యక్తి తన వెనుకనున్న ఒక మనిషికి సైగ చేశాడు. వెంటనే ట్రేలో ఒక మనిషి ఈ అయిదుగురి ముందుకూ వచ్చాడు. ట్రేలో అయిదు గ్లాసులున్నాయి. గాజు గ్లాసుల్లో రంగులేని ద్రవం కనబడతోంది.

"ఈ అయిదింటిలో ఒకటి మాత్రమే విషం. మీ మీ గ్లాసుల్ని మీరే ఎన్నుకోండి. ఎవరు చావును ఆహ్వానిస్తారో_తమాషా చూద్దాం. అందరూ తలో గ్లాసునూ అందుకోండి. పిచ్చిపిచ్చి వేషాలు వేశారో_అయిదుగురూ చస్తారు..." అన్నాడా వ్యక్తి.

అయిదుగురూ ఆ గ్లాసుల వంకే చూస్తున్నారు. ఆ గ్లాసుల్లో వారికి మృత్యువు కనబడుతోంది. అందులోనూ కోరి ఆప్యాయంగా ఆహ్వానిస్తున్న మృత్యువు!

ఆ వ్యక్తి రివాల్వర్ గాలిలోకి పేల్చాడు. రెడీ వన్. టూ. త్రీ.

అయిదుగురూ అయిదు గ్లాసులూ అందుకుని గటగటా పానీయాన్ని త్రాగేశారు. తర్వాత ఒకరివంక ఒకరు చూసుకున్నారు. అందరికీ కడుపులో తిప్పుతున్నట్లే

ఉంది కానీ ఎవరికీ ఏమీ కాలేదు.

ఆ వ్యక్తి నవ్వాడు—"ఆశ్చర్యం! మీలో ఎవ్వరూ చావలేదు. అంతా బాగానే వున్నారు. తప్పకుండా చచ్చిపోతానని మీరనుకున్నారు కానీ మీలో ఎవ్వరూ చావరని నాకు తెలుసు. ఎందుకంటే—పాలలో ఉప్పు కలిసేనే అవి విరుగుతాయి. మీలో ఒక్కరు విషం తాగిన మాట నిజం. కానీ ఆ విషం విషంలా పనిచేయడానికి మీరు మరో టాబ్లెట్ వేసుకోవాల్సి వుంది. నా మనిషి మీ దగ్గరకు అయిదు టాబ్లెట్సుతో వస్తాడు. అందరూ తలొకటీ వేసుకోండి. అప్పుడేం జరుగుతుందో తమాషా చూద్దాం."

అయిదుగురి ముందూ టాబ్లెట్సు కనబడుతున్నాయి. అవే మృత్యుగుళికలని వారికి తెలుసు. కానీ తప్పదు. మళ్ళీ అందరూ తలొకటీ వేసుకున్నారు.

అందరూ చూస్తుండగా కెవ్వుమన్న ఆర్తనాదం వినబడింది. టాక్సీవాలా కెవ్వుమని అరిచి క్రిందపడి గిలగిల తన్నుకుని క్షణంలో ప్రాణాలు విడిచాడు.

మొదటి దఫా విషం లేకపోవడంలో రామేశం కాస్త సంతోషంగా వున్నాడు. ఆ వ్యక్తి తమను భయపెట్టి ఆడుకుంటున్నాడని ఆయన ఆశపడ్డాడు. టాక్సీవాలా నేల కూలడంతోనే తమ ప్రాణాలకు నిజంగానే ముప్పు వచ్చిందని ఆయనకు అర్థమయింది.

అందరూ నేలమీదకు వంగి టాక్సీవాలాను సమీపించారు. కొద్ది నిముషాల క్రితంవరకూ తమతో సరదాగా గడిపిన ఆ మిత్రుడి శరీరంలో ఇప్పుడు ప్రాణాలు లేవన్న నిజం వారికి కలిగించిన బాధ ఇంతా అంతా కాదు.

"అన్నింటికీ తనే ముందడుగు వేస్తూ వచ్చాడు. ఆఖరికి మృత్యువు నాహ్వానించడంలో కూడా—" అన్నాడు

టార్చర్.

"మీరు నలుగురూ బ్రతికి బయటపడ్డా మనుకుంటే అది చాలా పెద్ద పొరపాటు. ఇప్పటికి ఫస్ట్ రౌండ్ అయింది..." అన్నాడా వ్యక్తి.

"అయితే అందర్నీ ఒకేసారి చంపేసేయరాదూ—" అన్నాడు జోగారావు.

"అందుకు నాకేమీ అభ్యంతరంలేదు. మీకు ఓ అవకాశం ఇచ్చిచూద్దామని మానవత్వంగల మనిషిగా నేననుకుంటున్నాను. మీరంతా ఆలయ ముఖద్వారం చేరి గుహవైపు పరుగెత్తండి. నేను ముఖ ద్వారం దగ్గరకువచ్చి రివాల్వర్ కాలుస్తాను. తప్పించుకోగల వాళ్ళు అదృష్టవంతులు. అసలీ ప్రాంతంచేరి ఇంతసేపు బ్రతికిన వాళ్ళే అదృష్టవంతులు. సెకండ్ రౌండ్‌లో ఎంతమంది రక్షించబడతారో చూద్దాం...ఎంతో టైంలేదు. రెడీ...వన్. టూ...త్రీ..."

నలుగురూ ఆలయ ముఖద్వారంచేరి అక్కణ్ణించి పరుగెత్తడం మొదలుపెట్టారు. శక్తికొద్దీ పరుగెడుతున్నారు ప్రతి ఒక్కరూ. ప్రాణభీతి వారి కళ్ళలోనూ, కాళ్ళలో కూడా వుంది.

ఆ వ్యక్తి ఆలయం ముఖద్వారం చేరాడు. ముఖద్వారం నుంచి గుహకు చేరేదారి "U"ఆకారంలోవుంది. ఆ వ్యక్తి వారిలో ఒకరిని జాగ్రత్తగా శ్రద్ధగా గమనిస్తున్నాడు. రివాల్వర్‌ను తన టార్గెట్ మీదకు గురిపెట్టాడు. మరుక్షణంలో రివాల్వర్ పేలింది.

హృదయ విదారకమైన ఆర్తనాదం!

మిగిలిన ముగ్గురూ ఆగిపోయారు. పడిపోయిన మనిషి కోసం చూశారు. అతను జోహారీ!

"చిన్న వాళ్ళకే ముందుగా నూకలు చెల్లిపోతున్నాయి" అంటూ బాధగా నిట్టూర్చాడు రామేశం— "అంత మాత్రాన మిగతా వాళ్ళం తప్పించుకోగలిగామనీ కాదు."

"ఇప్పుడు చేయగలిగిన దేముంది? ఇదే ఊపులో ముందుకు వెళ్ళిపోతే...?" అన్నాడు టాగూర్.

అయితే గుహముందు ముగ్గురు మనుషులు తుపాకీలతో నిలబడి వున్నారు.

"వెనక్కు వెళ్ళండి. ఇంకా థర్డ్ రౌండ్ మిగిలి వుంది—" అన్నాడు వాళ్ళలో ఒకడు.

రామేశం బృందానికి పై ప్రాణాలు పైనే పోయాయి.

"ఈ మానసిక హింసకంటె అందర్నీ వెంటనే చంపేసినా బాగుండును..." అన్నాడు గోపాలరావు. అయితే శత్రువు అవకాశమిచ్చినపుడు ఆ పరిస్థితుల్లో ఎవరికైనా వుపయోగించుకోవాలనే వుంటుంది.

ముగ్గురూ వెనక్కు మళ్ళారు.

"భయపడి చేయగలిగింది లేదు. చివరి క్షణంవరకూ ధైర్యంగావుందాం—"అన్నాడు టాగూర్—"ఎటొచ్చీ నాదొక్క విన్నపం. మనలో ఏఒక్కరైనా మిగిలితే వీడి మీద పగసాధించాలి. వీడి అంతు తేల్చాలి. అందుకు నా కుమారుడి సాయం తీసుకోండి..."

"త్వరగా రావాలి..." ఆ వ్యక్తి గర్జించాడు.

ముగ్గురూ మళ్ళీ వెళ్ళి ఆ వ్యక్తిముందు నిలబడ్డారు. ఆ వ్యక్తిని చూస్తూంటే వారికి నరరూప రాక్షసుడిలా అగుపిస్తున్నాడు.

నా మనిషి ఇప్పుడు ట్రేలో మీదగ్గరకు మూడుచీటీలు తెస్తాడు. అందులో ఒకదాంట్లో "చంపు"—అని రాసి వుంటుంది. రెండోదాంట్లో "చావు"—అని మూడో దాంట్లో "బ్రతుకు"—అనీ రాసి వుంటుంది. "చంపు"

అన్న చీటీ వచ్చినవాడు "చావు" అన్న చీటీ వచ్చిన వాణ్ణి విషం పూసిన కత్తితో పొడవాలి. మిగిలిన ఇద్దర్నీ వదిలిపెట్టేస్తాను. ఇదే ఆఖరి రౌండ్. చంపడంలో జాప్యంచేసినా, చంపడానికి సందేహించినా, ఎదుటివాణ్ని చంపకుండా తనకుతాను పొడుచుకున్నా— నా రివాల్వర్ ఇద్దరి ప్రాణాలూ తీస్తుంది. అలాకాకుండా మామీద అత్యాచారానికి ప్రయత్నిస్తే ముగ్గురూ చస్తారు. రూల్స్ చెప్పానుగా—ఇప్పుడు ఆట ప్రారంభం..." అన్నాడా వ్యక్తి.

ఆ మాటలు వింటూనే ముగ్గురూ ముఖముఖాలూ చూసుకున్నారు. ఎవరు ఎవరిని చంపాలి? వాళ్ళకు కళ్ళలో నీళ్ళు తిరిగాయి. "ఈ క్షణంలో మమతానుబంధాలు, మమకారాలు...అన్నీ మరచిపోదాం. వీడు తన మాటమీద నిలబడి మనలో ఇద్దర్ని వదిలిపెడతాడని నేననుకోవడంలేదు. అయినప్పటికీ తెలివితక్కువగా కోరి చావును ఆహ్వానించడమెందుకు? వాడు చెప్పినట్లే చేద్దాం. ఎవరూ ఎవరినీ దయతలచవద్దు......"అన్నాడు రామేశం.

ఒక మనిషి వారిముందు ట్రేతో నిలిచాడు. అందులోని మూడు చీటీలనూ చూస్తూ వారు ముగ్గురూ గజగజా వణికిపోయారు. ఇంతవరకూ జరిగిన హత్యలు ఒక ఎత్తు. జరుగనున్నది ఒక ఎత్తు. వణుకుతున్న చేతులతోనే ముగ్గురూ చీటీలు తీశారు. కానీ విప్పి చదవడానికి ముగ్గురికీ ధైర్యం చాలలేదు.

ఆఖరికి ఠాకూర్ తన చీటీ విప్పి చదివాడు— "చంపు!" అని ఉంది. తన ప్రాణాలు నిలబడ్డవని అతడికి ఏమాత్రమూ సంతోషంగా లేదు. ఎదురుగావున్న ఇద్దరిలో ఒకరిని తను చంపవలసివుంది. రామేశాన్ని కానీ,

జోగారావునుకానీ తన చేతుల్తో ఎలా చంపగలుగుతాడు?

రామేశం తన చీటీ విప్పి చదివాడు—"బ్రతుక—" అని వుంది.

అంటే చావబోతున్నది జోగారావు అన్నమాట!

జోగారావు చుట్టూ బెదురు చూపులు చూస్తున్నాడు అతడి కళ్లలో ప్రాణభీతి వచ్చేసింది. భయం వేరు, నిజం వేరు!

విషంపూసిన కత్తి టాకూర్‌కి అందింది. టాకూర్ గుండె రాయి చేసుకున్నాడు.

"హటాత్తుగా సృష్టి స్థంభించిపోకూడదూ?" అనుకున్నాడు రామేశం. కానీ సృష్టి స్థంభించలేదు. కాలచక్రం ఆగిపోలేదు.

టాకూర్ ముందడుగు వేస్తూంటే జోగారావు వెనుకడుగు వేస్తున్నాడు. టాకూర్ జోగారావు కళ్ళలోకి చూడడంలేదు. అలా చూస్తే తాను చేయదల్చుకున్న పని చేయలేడని తెలుసు.

జోగారావు వెనుకడుగు వేస్తూంటే ఆ వ్యక్తి అరిచాడు. "చంపేవాడే కాని చచ్చేవాడు కదలకూడదు. అలా జరిగితే ఇద్దరూ చస్తారు నా చేతిలో..."

జోగారావు చటుక్కున ఆగిపోయాడు. చేతిలో కత్తితో కాలయముడిలా టాకూర్ వస్తూంటే అతని గుండెలు శరవేగంతో కొట్టుకుంటున్నాయి. తను కదలకపోతే తను అక్కడే చస్తాడు. తను కదిలితే తనతో పాటు టాకూర్ కూడా చస్తాడు. ఏం చేయాలి తనిప్పుడు?

చీమలాంటి చిన్నప్రాణి కూడా తన ప్రాణాలు రక్షించుకోవడంకోసం చివరిక్షణంవరకూ ప్రయత్నిస్తుంది.

ఆలోచనా శక్తితో అత్యున్నత స్థాయి చేరుకున్న మని షిని ఆత్మరక్షణ చేసుకోకుండా అనువులు అర్పించ మనడం...ఎంత ఘోరం?

అయినప్పటికీ జోగారావు కదలలేదు. ప్రతిఘటించే యత్నం చేయలేదు. టాకూర్ కత్తి అతడి గుండెల్లో బలంగా దిగబడింది. కత్తి దిగబడిన మరుక్షణంలోనే జోగారావు శరీరం నల్లబడింది. అతడు కుప్పలా నేలకూలి పోయాడు.

టాకూర్, జోగారావువంక చూడలేదు. రెండు చేతులూ ముఖానికి కప్పుకొని ఘొల్లున ఏడుస్తూ నేలమీద కూలబడిపోయాడు. రామేశం నోట మాట రాకుండా అలా నిలబడివున్నాడు.

"వెరీగుడ్! అపురూపమైన ప్రదేశాన్ని చూసి మీ సరదా తీర్చుకున్నారు. అపూర్వమైన ఆటలతో నా సరదా తీర్చుకున్నాను. నాకు సంబంధించినంతవరకూ మీ ప్రాణాలతో నాకు నిమిత్తంలేదు. మిమ్మల్ని నేను చంపను. మిమ్మల్నిద్దర్నీ నా మిత్రులకు కానుకగా పంపుతున్నాను. మీ భవిష్యత్తు వారి సరదామీద ఆధా రపడి వుంటుంది" అన్నాడా వ్యక్తి.

తర్వాత రామేశానికీ, టాకూర్‌కూ స్పృహ తప్పించ బడింది. వాళ్లకు స్పృహవచ్చేసరికి ఒక ఆటవిక జాతిమధ్యన తామున్నామని గ్రహించారు. వీళ్ళిద్దరూ కళ్ళు తెర్వగానే వాళ్ల చుట్టూవున్న మనుష్యుల్లో సంచలనం కలిగింది.

"మెలకువ వచ్చింది వుండండి"—అంటూ ఆటవి కుల్లో ఒకడు ముందుకు వచ్చాడు. రామేశం, టాకూర్— లేచి కూర్చోడానికి ప్రయత్నించారు. అయితే వారి చేతులూ, కాళ్లూ కట్టబడి వున్నాయన్న విషయం అప్పుడే వారికి అర్థమయింది. (సశేషం)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 5 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/-లు నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 7/-లకే మా మా ఏజెంట్ ద్వారాగాని, వి.పి. ద్వారాగాని మీ ఇంటిదగ్గర అంద జేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీల కోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరుగనవ సరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

7. నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు, ఏడాది పైకము రు. 80/-లు ముందుగా పంపితే వారికి కాపీలు 'రిజిస్టర్డ్ డెలివరీ'లో పంపగలము.



# క్రైమ్‌లో తమాషాలు

[ఈ శీర్షికలో ప్రచురించబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును. —ఎడిటర్]

## మూగ భాష - ?

తెలుగు క్లాసు జరుగుతోంది. లెక్చరర్ పాఠం చెబుతున్నాడు. స్టూడెంట్స్ అందరూ సీరియస్‌గా ఫోజుపెట్టి వినేస్తున్నట్లు నటిస్తున్నారు.

ఇంతలో ఒక మూగవాడు క్లాసులోనికి వచ్చి సహాయం చేయమంటూ అతని దయనీయమైన కథంతా వున్న కార్డు చూపించపోయాడు.

"బాబూ నీవు వెళ్ళి ప్రిన్సిపాల్‌గారి సంతకం చేయించుకొని రా! సంతకం లేకుండా అసలు రాకూడదు" అని గంభీరంగా ఆ మూగవాడితో చెప్పారు లెక్చరర్, ఆ కార్డు చూడకుండానే. సంతకం చేయించుకొని వచ్చానని తన మూగ భాషలో సంజ్ఞలుచేసి చెప్పాడతను. కానీ లెక్చరర్ అతనిని అర్థం చేసుకోకుండా, వానికి ఇంకా అర్థం కాలేదని మళ్ళీ చెప్పాడు గట్టిగా.

సంతకం చేయించుకొచ్చానని చెప్పటానికి ఆ మూగవాడు చాల తంటాలు పడ్డాడు. చాలాసేపు సంజ్ఞలుచేసి విఫలయత్నం పొందాడు. అసలే చికాకుగావున్న లెక్చరర్ అవేమి పట్టించుకోకుండా, "ఎన్నిసార్లు చెప్పినా వినవేమయ్యా. సంతకం పెట్టించుకొనిరా, పో!" అని గట్టిగా అరిచారు విసుగుతో, కోపంతో.

ఆ మూగవాడు రెట్టింపు కోపంతో, "సంతకం చేయించు

కానే వచ్చానయ్యా అంటే వినరేం—?" అంటూ చకచకా అక్కడ్నించి వెళ్ళిపోయాడు. —ముద్దుకృష్ణ, రామకృష్ణ.

## "గాడిద"

ఒక సభలో ఒక ఎం.ఎల్.ఏ మాట్లాడుతున్నాడు. అతడి మాటలకు మధ్యమధ్యన చెప్పట్లు మారుమ్రోగుతుండినాయి. సంతోషంతో, ఉత్సాహంతో తన ఉపన్యాసం అలాగే సాగిస్తున్నాడు.

హఠాత్తుగా అతడికో కాగితంముక్క అందివ్వబడ్డది. ఆ కాగితంపై "గాడిద" అని మాత్రం వ్రాయబడింది. దాన్ని చదివిన ఎం.ఎల్.ఏ ఏమాత్రం కోపం చెందక మైక్ ముందు ముఖంపెట్టి ఇలా అన్నాడు:

"ఇప్పుడు నాకు పంపిన ఉత్తరం ముక్కలో ఎవరో తన పేరే వ్రాసిపంపాడు. నన్ను ఏమడుగుదా మనుకున్నాడో అది వ్రాయకుండా మరిచిపోయాడు. ధైర్యంగా నిలబడి అడగవచ్చు." —చాగాపురం నాగేశ్వరరావు, మల్దకల్.

## "తలనొప్పి"

ఒక పెద్దమనిషి చాలా రోజులనుండి తలనొప్పితో బాధపడుతూ పేరుపొందిన ఒక డాక్టర్ దగ్గరకు సలహా గురించి వెళ్ళాడు. అంతా విని డాక్టర్—

"అసలు ఈ తలనొప్పి అంటే ఏమిటోకూడా నాకు తెలియదు. దీనిగురించి మీరు అంత సీరియస్‌గా ఎందుకు తీసుకుంటున్నారో అర్థం కావటంలేదు" అన్నాడు తేలిగ్గా.

పేషంట్‌కు వళ్ళు మండింది.

"తలనొప్పి మీరు ఇంకొకరికి యిస్తారు తప్ప, మీరు దానితో ఎందుకు బాధపడతారండీ?" అన్నాడు.

—ప్రభాకర్, తిరుచ్చి-14.

